# ఉజ్జయినీ పతనము

[చారిత్రక నవల]

బెంగాలీ మూలం : శ్రీ హెచ్. పి. చటోపాధ్యాయ

ఆంగ్లము : శ్రీ ప్రమోదనాథ్ బిసి

తెలుగు : " విజయ "




జాగృతి ప్రచురణ

బకింగ్‌హాంపేట, విజయవాడ - 2

## రెండు మాటలు

విజ్ఞతలేని పాలకులు, అవినీతిపరులైన అధికారులు, సుఖలాలసులైన ప్రజలు, ధర్మభ్రష్టము, పథభ్రష్టము నైన రాష్ట్రము....

ఈ దుస్థితిలో....

విదేశీయులు, శత్రువులు నైన శ్వేతహూణుల దురాక్రమణ వాంఛ, కుట్ర, వ్యూహము.... దేశములో వారి మిత్రమండలులు, పంచమాంగదళములు, పరిపాలకులపైన, ప్రభుత్వ యంత్రాంగములోను వారి పలుకుబడి, ........దురాక్రమణ మార్గాన వారి పురోగమనము....

దేశ భక్తులయెడ అనాదరణ, చివరకు పుష్యభూతివంటి త్యాగపురుషుని బలిదానము.... అన్యదేశభక్తుల అసహాయ స్థితి....

వీటన్నిటి పర్యవసానముగా ఒక మహారాజ్య పతనము

ఇదీ "సింధూనదేర్ ప్రహరీ''లోని కథావస్తువు. ఒక్కముక్కలో ప్రమత్తజాతి కిదియొక హెచ్చరిక.

బెంగాలీ మూలం : శ్రీ హెచ్. పి. చటోపాధ్యాయ.

ఆంగ్లానువాదము : శ్రీ ప్రమోదనాథ్ బిసి.

ఇది చదివినప్పుడు తెలుగు పాఠకులుకూడా దీనిని చదవాలనే ఉబలాటము కలిగింది. ఆ ఉబలాటపు ఫలితమే ఈ "ఉజ్జయినీ పతనము"నే తెలుగు సేత.

మొదట జాగృతి పత్రికలో ధారావాహికగా ప్రకటించబడిన ఈ ప్రచురణకు సహకరించినవారందరికి ధన్యవాదములు.

—"వి జ య".

# ఉజ్జయిని పతనం

చూడు! అలెగ్జాండర్ అడుగిడి వెడలిన చారిత్రక స్థలం ఇది. ఆట్టే లోతులేనిచోట, ఇక్కడే అతడు సింధునదిని దాటింది. కొన్నిచోట్ల నీరు నడుములదాకాకూడా లేదు. సగందూరంలో ఒక పాషాణద్వీపం. దానిమీద ఒంటరిగా ఒక పెద్ద కొండతిప్ప. అంతా రాళ్ళమయం గడ్డిమొక్కయినా మొలిచే అవకాశం లేదు. ఆ శిథిలాలను పర్యవేక్షిస్తున్న అభేద్యమైన రక్షణ శ్రేణికివలె కాలిపోయి మిగిలిన రాళ్ళవరుసలు... ఆశిఖరంమీద ఒక కొండగుహ ఉంది. దాని ముఖద్వారంనుండి తిన్నగా దీవిమీదికి ఎక్కడానికి, దిగడానికి కష్టసాధ్యమైన మార్గం ఒకటి ఉంది. మొండికెత్తిన ఏ పర్వతారోహకుడో తప్ప దాని నెక్కేందుకు ఎవరూ సాహసించరు.

ఇరుకైన ప్రవాహంవైపు చూస్తుండే ఈకొండ ప్రాంతానికి ఆరోజుల్లో అన్నిరకాలవాళ్ళు వస్తూ పోతుండేవారు; నెత్తిన కుండలుపెట్టుకొని నీటికోసం ఆడవాళ్ళు వస్తుండేవారు; ఒంటెలమీద సరుకు లెక్కించుకొని వ్యాపారస్థులు నదిని దాటిపోతుండేవారు; ప్రయాణీకులకువలె అటూ ఇటూ తిరుగుతుండేవారు సంఘవిద్రోహులు కొందరు. వారంతా ఆకొండ గుహవైపు, నీటిని నింగిని సంధిస్తున్నట్లుగా ఆగుహ ముఖద్వారంలో నిలచిఉన్న మానవాకృతి వైపు తలెత్తి ఒక్కసారిచూచి మరీ వెళ్లేవారు. అంత ఎత్తున

ఉన్నందువల్ల క్రిందనుండి చూచేవారికి ఆ మానవాకృతి ఒక చిన్న బొమ్మలా కనిపించేది మంచి సాధన, శిక్షణలో ఉన్నందువల్లకాబోలు ఆ ఆకారం నిటారుగా నిశ్చలమైన ప్రతిమలా కనిపించేది. మొదట్లో చూపరుల కాదృశ్యం చాలా విచిత్రంగా ఉండేది. ఆవిగ్రహం అంతఎత్తుకి ఎలా వెళ్ళిందా అని తరచు మధనపడేవారు. ఆశ్చర్యపడుతుండేవారు. సంవత్సరాలు గడచినకొద్దీ ఆశ్చర్యపడడంమానేశారు. క్రమంలో అదొక విశేషమని భావించడమూ మానివేశారు. ఆకొండ వలె, ఆగుహవలె అక్కడి మానవాకారంకూడా ఆపరిసరాలలోని ఒక భాగంగానే భావించేవారు. స్త్రీలు ఆ ఆకారాన్ని ఒక దేవత అనేవారు; పురుషులు యోగి అనేవారు; పండితులు యక్షుడనేవారు. అదక్కడ ఒంటరిగా ఎందుకుంటోంది? దాని తిండితిప్పల సంగతేమిటి? ఈప్రశ్నలు ఎవరికీ స్ఫురించేవికాదు. ఎందువల్లనంటే దేవత, యోగి, యక్షుడు అంతా ఈసామాన్య మానవ ప్రపంచాన్ని అధిగమించినవారుగనుక.

ఒక ఉదయం, శీతకాలపు మంచు ఆప్రదేశాన్నంతా ఆవరించుకొనిఉంది. అక్కడక్కడా చెదరువాటుగా మొలచిన గడ్డిమొక్కలకుగాని, రాతిముక్కలకుగాని ఇంకా సూర్యరశ్మి తగలడంలేదు. ఆమానవాకృతి అప్పటికే అక్కడ నిలచిఉంది. దానికండ్లు ఉదయభానునిమీద కేంద్రీకరింపబడి ఉన్నాయి. మహా ప్రకాశమానుడు, పవిత్ర కాశ్యపవంశజుడునైన సూర్యభగవానుడు జపాపుష్పమువంటి ఎర్రనైనరంగులో, తనకిరణాలతో చీకటి తెరలను చీల్చుకుంటూ, ప్రకృతిని, మానవుని

ప్రకాశవంతంచేస్తూ వెలికి వస్తున్నాడు. ప్రతిరోజూ ఆమానవాకృతి ఆసమయంలో అదేస్థానంలో అలాగే నిశ్చలంగానిలచి ఉంటుంది. పూజనీయుడైన సూర్యదేవుని కీర్తిగానంచేస్తూ రానున్న శుభోదయానికి స్వాగతం పల్కుతుంటుంది. ఆయన భక్తి అపారము. ఎంతసమయం అయిందీ, తానెంతసేపటినుండి నిలచిఉన్నదీ ఏదీ అతనికి తెలియదు. అన్నీ మరచిపోయినాడాతడు. ఎందుకో అనుకోకుండా దక్షిణంవైపుకు తల తిప్పాడు. దృష్టిమరలింది. మనస్సు ఆ దివాకరుని, ఆ పాపహారుని, ఆ తిమిరహారుని నుండి మరలింది. ఏవేవో ఆలోచనలు ఆతడి మనస్సునాక్రమించాయి. ఏవేవో స్మృతులు ...

౨

ఆనాడు ...

"ప్రభూ తమరిని ఆ తలంపు వదలివేయమని విన్నవిస్తున్నాను" అన్నాడు సైన్యాధిపతి మహారాజుతో.

"మీ రలా సూచించడం చాలా విచిత్రంగా ఉంది సైన్యాధిపతీ! సముద్రగుప్త విక్రమాదిత్య భూపతికాలంనుండి సగర్వంగా ఆయుధం చేపట్టుతూ, నాసేవలో తలనెరిసిన మీ నోటినుండి ఆసూచన వినడం ..." అని మహారాజు ఆ విన్నపము ఎడ తమవిముఖత ప్రకటించారు.

"ప్రభూ! నా అనుభవం ఇంకా ఎక్కువదే. కుమారగుప్త మహేంద్రాదిత్యుని కాలంలోనే నేను సామాన్య సైనికునిగా చేరాను."

"ఓహో! అలాగా!" తేలికభావంతో అన్నాడు మహారాజు.

"ఆ సుదీర్ఘానుభవంవల్లనే మహారాజుకు, సామ్రాట్టుకు సూచన లివ్వ సాహసిస్తున్నాను. ఈక్షణాన నిర్బద్ధ ఒడంబడిక చేసుకోవడం తగనిపని" అన్నాడు సైన్యాధిపతి మహారాజు వైఖరికి కించ ప్రకటించకుండా.

"ఎందువల్ల తగనిపని? భయపడుతున్నట్లనిపిస్తుందా?"

"భయం ప్రసక్తేలేదు. అనుభవము, అవసరము ఆ ప్రసక్తినివదలి, వేచిచూడ మంటున్నాయి."

"ఆ శత్రువులతో పోరాడి ఓడించేశారుకదా, మీరు? వారినిగురించి మీ అభిప్రాయ మేమిటి? అప్పట్లో మీరు విక్రమాదిత్య మహారాజు సర్వసైన్యాధిపతులు మీ అనుభవాన్నిబట్టి చెప్పండి"

"మహారాజా! తరంగం ఒకక్షణాన నిలుస్తుంది—మరుక్షణాన మరింత ఉవ్వెత్తుగా వచ్చేందుకు మాత్రమే!"

"అందుకే కరకట్ట నిర్మించాలంటున్నాను."

"తప్పక నిర్మించండి. కాని అది కాగితాల కరకట్ట కారాదు. అజేయశక్తి అయి ఉండాలి."

"సైన్యాధిపతీ! నేటి గుప్తసామ్రాజ్యం స్వీయశక్తి ప్రభావాలను కోల్పోయినట్టిదని మీకన్న ఇంకెవరికి తెలుసు?"

"నిజము ప్రభూ! ఈ విషయం వ్యతిరేకులకు కూడా తెలుసు. అందువల్లనే వారు ఇలాంటి ప్రతిపాదనలు చేస్తున్నారు."

"మీ రన్నట్లు మనపరిస్థితి వారికి తెలిసేఉంటే సూటిగా సైన్యాల నెందుకు నడపరు?"

"అడగకుండా వచ్చే శాంతిఒడంబడిక ప్రతిపాదనలు, పెద్దదురాక్రమణలకు నాందీప్రస్తావనలు"

"అయితే మీ రనే దేమిటి?"

"గుప్తుల బహుకాల సేవకునిగా తమకు నే చేసేవిన్నపం ఎలాంటి ఒడంబడికలకు దిగవద్దని మాత్రమే."

"ఎందువల్ల?"

"యుద్ధంచేసేవారిమధ్య శాంతిసంధిఅంటే, అర్థం ఉంది. కాని అన్యపరిస్థితిలో శాంతిసంధులు అసంగతమైనవి."

"కాని వారంటున్న ప్రకారం ఇది కేవలం మైత్రీసంధి మాత్రమేకదా?"

"మైత్రియా! విద్వేషం కక్కే వారితో మైత్రి ఎలా సాధ్యం?"

"విద్వేషం కక్కే వారని మీరంటున్న దెవరిని?"

"సరిహద్దుల కావలనున్న పొరుగు రాజ్యంవారిని."

"బాగుంది, చాలా బాగుంది. ఆక్సస్‌నది ఒడ్డునఉన్న చిన్నరాజ్యం బాక్ట్రియా. సిప్రా ప్రాంతమందున్నది మన ఉజ్జయిని. మధ్యలో వందల యోజనము లున్నవి. వారు మనకు పొరుగువా రెలాఅవుతారు?"

"వందల యోజనము లంటే ఏమంత ఎక్కువకాదు. ఒక్కొక్క యోజనము — పరాజితులైన హూణులు కడుపున దాచుకున్న ఒక్కొక్క క్రోధ ద్వేషాంశ."

"తమ ఘోరపరాజయ గుణపాఠాన్ని వారెంకా మరచి ఉండరని నావిశ్వాసం."

"ప్రభూ! ఏ పరాజయమూ ఏ జాతికీ అహింసా గుణ పాఠాన్ని నేర్పలేదు. అలాగే జరిగిఉంటే చరిత్ర మరొక మాదిరిగా ఉండి ఉండేది. ఈ భూమండలంలో పరాజయం పొందని జాతి ఏదైనా ఉన్నదా?"

"సైన్యాధిపతీ! వారి గాయాలింకా మానలేదని నా విశ్వాసం అందువల్లనే మైత్రికి తహతహ లాడుతున్నారు."

"ప్రభూ! వారి శాంతికాముక ప్రదర్శనలన్నీ, బ్రహ్మాండమైన ప్రతీకార పథకానికి ప్రారంభదశయని నా అనుభవాన్నిబట్టి అనిపిస్తోంది."

"మీవాదన చాలా విచిత్రంగా ఉంది!"

"విచిత్రంగా ఉంటే ఉండనివ్వండి. అవాస్తవికం మాత్రం కాదు. లేనిదానిని అతిక్రమించడమంటూ ఉండదు. సంధులు ఏర్పడేది అవకాశాన్నిబట్టి అతిక్రమింపబడేందుకే. ఈప్రపంచంలో అతి తేలికగా అరికాలరాయడానికి వీలైనది కాగితంముక్క."

"ఆపని ప్రారంభించడం మనచేతిలోనిపని గదా?"

"వారిచేతిలోని దనాలి."

"వారు మనకంటే బలవంతులనా మీరనేది?"

"బలవంతులుకాదు ప్రభూ, త్వరపడగలవారు. చొచ్చుకు వచ్చేందుకు త్వరపడతారు. విస్తరించేందుకు త్వర

పడతారు. కనుకనే ఈశాంతి, సహకార, సౌభ్రాతృత్వాలంటూ ధ్వజాలు పుచ్చుకొని మనదెస వస్తున్నారు."

"వారు కోరేది శాంతి స్నేహాలే అయినప్పుడు మనం వారి నెందుకు శంకించాలి ?"

"రెపరెపలాడుతున్న ఆ ధ్వజంవంక చూడండి. దానిని తగిలించినది ఒక దృఢమైన దండానికి. పోరు ప్రారంభమయే సరికి ఆసుందర కేతనం ముడుచుకుపోయి ఆ నగ్నదండం విరుచుకు పడుతుంది."

"ఆలోచించుకోవడానికి నాకు కొంచెం వ్యవధి ఇవ్వండి" అంటూ బుద్ధగుప్తమహారాజు చిరాకుపడుతూ సభాస్థలి నుండి వెడలిపోయినాడు ...

## 3

"ఏమిటి నా కీస్మృతులు ? నేను చేయబోయే దేమిటి ? నేను లౌకిక వ్యాపారాదులను విసర్జించిన సన్యాసిని కదా ? అట్టి నామనస్సులో ఈ ఆలోచనలేమిటి ? ఎంత దురదృష్టవంతుణ్ణి నేను !" అనుకుంటూ ఆ శిఖరంమీద నున్న వ్యక్తి ఆత్మవిమర్శ చేసుకుంటున్నాడు. వ్యథతో తొందరపాటుగా గుహలోకి వెళ్ళిపోబోయినాడు నుదిటికి గుమ్మం బలంగాతగిలి నెత్తురు చిమ్మింది ఆయనకు అదికూడా పట్టలేదు. అక్కడ పరచిఉన్న పులిచర్మపు ఆసనంమీద కూలబడి దుఃఖించ నారంభించాడు. "హేభగవాన్! ఓ మహాకాళేశ్వరా! నేను సర్వసంగపరిత్యాగం చేశానని నీకు తెలుసు. అలాంటప్పుడు ఈ

లౌకికవిషయ సంబంధమైన భావాలు నన్నెందు కిలా వెన్నాడుతున్నాయి? నన్నీ భావబంధనాలనుండి విముక్తుణ్ణి చేయి ప్రభూ!" అంటూ ఆ కఠినశిలపై తలబాదుకో నారంభించాడు.

ఒకసారి బీటవారిన సేతువు అంత తేలికగా అతికిపోదు. ఉధృతమైన ప్రవాహం ఆబీటను ఇంకా ఎక్కువ చేస్తుంది. మరింతనీరు లోనికి చొచ్చుకు పోతుంది. ప్రవాహం ఉధృతమవుతుంది. విస్తృతమవుతుంది. ఊళ్ళను, పొలాలను, తన కడ్డు వచ్చిన ప్రతిదానినీ ముంచివేస్తూ వెల్లువయై ప్రవహిస్తుంది.

ఆ సన్యాసి ప్రాపంచిక భావాల ఉప్పెననుండి తన మనస్సును తప్పించాలని చాల ప్రయాస పడ్డాడు. నియమ నిష్ఠలతో సేతువును నిర్మించుకున్నాడు. ఒక్కక్షణం ఏమరితే మళ్ళీ అవే ఆలోచనలు మరింతపెద్ద ఉప్పెనలా వచ్చిపడతాయి. 'భగవత్కృప లేనప్పుడు నే నీబంధనాలనుండి ఎలా తప్పించుకోగలను" అనుకున్నా డాసన్యాసి నిస్సహాయంగా. "మహాకాళేశ్వరుని ఇచ్ఛ ఇది గాబోలు! ఆయన కనుసన్నలలోని వారముకదా మనమంతా? రాగల ఘోరపరిణామాలనుండి తప్పించుకుపోవడం, పరిణామాల నెదుర్కొనడం ఎలా అవుతుంది? నేను నా ఒక్కని సంగతి చూచుకొని, అందరి సర్వనాశనానికి ముందు పారిపోయి వచ్చాను. ఇది ఘోరమైన పాపముకదా! నే నొక పాపిని. వాస్తవ ప్రపంచాన్ని తప్పించుకో జూచిన పారుబోతును. నే విడచివచ్చిన ప్రపంచపు సమస్యలు, ఈ ఏకాంత ప్రదేశానికి సైతం భావాల రూపంలో వచ్చి నన్ను బంధితుని చేయడం పరమేశ్వరేచ్ఛగాబోలు.

ఇక నే తప్పించుకునే వీలులేదు. పారుబోతుకు పరమేశ్వరాను గ్రహంకూడా ఉండదు. నే విజృంభిస్తాను. మహా కాళేశ్వరుడు ఎక్కడికి నిర్దేశిస్తే అక్కడికే వెళ్తాను. ఓ! హృషీకేశ! నీయాజ్ఞను శిరసావహిస్తాను. నిన్ను నాహృదయంలో పదిలపరచుకొని సంగర మధ్యములోనికి ఉరుకుతాను.''

ఈ అంతరంగసంఘర్షణ జరుగుతూ ఉండగానే మళ్ళీ అనేక స్మృతులు ఆతని మనసులో మెదల నారంభించాయి.

౪

సామ్రాట్టు హఠాత్తుగా సభాస్థలిని వదలి వెళ్ళిపోగానే సేనాపతి, రక్షణమంత్రియునైన పుష్యభూతి అనేక విచారకరమైన ఆలోచనలలో మునిగిపోయినాడు. సాయంత్రం ప్రార్థన చేసుకునేందుకు మహాకాళేశ్వరాలయానికి వెళ్ళాడు. అక్కడ మిణుకు మిణుకుమంటూ వెలుగుతున్న దీపం అంతకు పూర్వమే ఎవరో వచ్చినట్లు చెప్తోంది. ఆవెలుగులో గంభీరముగా ప్రశాంతముగా కూర్చొనిఉన్న పూజనీయుడగు వృద్ధ మిత్రుని గుర్తించాడు.

“కవివర్యా, మీరిక్కడుంటారని నాకుతెలుసు'' అన్నాడు పుష్యభూతి.

“కవుల కెప్పుడూ ఏకాంత ప్రదేశములంటే ఇష్టము కదూ'' అన్నాడా మసక చీకటిలో కూర్చున్న వృద్ధుడు.

నిజముగా అది ఏకాంత ప్రదేశమే. పూర్వ మలా ఉండేదికాదు. ప్రస్తుత సామ్రాట్టు మహాకాళేశ్వరాలయము ఎడ ఎలాటి శ్రద్ధా వహించడములేదు. రాజసేవ లేమీ దానికి జరగడము లేదు.

పుష్యభూతి చిన్నగానవ్వి "ఈరాజ్యములో నిర్లక్ష్యము చేయబడ్డది ఒక్క మహాకాళేశ్వరుడు మాత్రమేకాదు; ఆస్థాన పండితులైన మహాకవికూడా" అన్నాడు.

కవీశ్వరుడు పకాలున నవ్వి "ఈసన్మానము పొందిన మూడవ వ్యక్తికూడా ఉన్నాడు. మహాకాళేశ్వరుడు, మహాకవులతో పాటు మహాదండనాయకునియెడ సైతము అదే 'గౌరవం' చూపబడుతోంది. ఈ ఉదయం సభా భవనంలో ఏమి జరిగిందీ నేను విన్నాను." అన్నాడు.

"మీకు తెలిసిందా? చాలామంచిది. అయితే ఇక ముందు ఏమి చేయనగునో " బోధించండి.

"బోధించే దేమున్నది? అస్తమించనున్న సూర్యుణ్ణి ఈబోధనలు ఆపగలవా? చీకటి క్రమ్మకు వచ్చినప్పుడు ఎవరైనా చేయగల బోధ ఒక్కటే – నీగదిలోని దీపము నాశ్రయించమని."

"అయితే గుప్త సామ్రాజ్య వైభవము అంతమైనట్లే నంటారా?"

"స్పష్టముగా కానవస్తున్న దదే."

చాలాసేపు ఇద్దరూ మౌనంగాకూర్చున్నారు. దూరము నుండి వినవస్తున్న నక్కల అరుపులు చాలారాత్రి అయినట్లు

సూచిస్తున్నాయి. ఎవరో అదృశ్య శత్రువుల నెదుర్కొంటు న్నట్లుగా నదిఒడ్డున చిన్న గాలిదుమారం ఒకటి రేగింది. నదిలో నక్షత్రాల ప్రతిబింబాలు ఊగిసలాడి పోతున్నాయి. కీచురాళ్ళ ధ్వను లా చీకటినంతా నింపివేస్తున్నాయి.

పుష్యభూతి మౌనం వదలి అన్నాడు: "మహాకవీ! నశించి పోతున్న ఈ మహా వైభవాన్ని అమరం చేసే బాధ్యత మీది. గుప్త సామ్రాట్టుల చరిత్రను గానంచేయమని మిమ్మ ప్రార్థిస్తున్నాను."

"కవులు చరిత్రల జోలికి పోకుండా ఉండడం మంచిది. ఒక కావ్యాన్ని సృష్టించ దలచాను."

"గుప్తసామ్రాజ్య ఉత్థాన పతనాలపై ఒక కావ్యమా"

"కేవలము అదికాదు. నా కథావస్తువు గుప్తవంశ సంబంధమైనది."

"మీ కావ్యముపేరు?"

"రఘువంశము"

"మీరన్నది రఘువంశమనేనా?"

"అవును. ఆశ్చర్యమెందుకు? వర్తమానాన్ని గడచిన కథద్వారా వివరించ దలచాను."

"అదెలా?"

"గత మనేది వర్తమాన సారాంశం. వర్తమానము భవిష్యత్తుకు పూర్వరంగం. నిజానికీ మూడూ ఒకటే. కాలము అవిభాజ్యము. అది శాశ్వత మహాకాళస్వరూపము. నే నా మహాకాళుని సేవకుణ్ణి."

"ఇంతకూ రఘుమహారాజు రంగములోనికి ఎలా వచ్చాడు ?"

"రఘు మహారాజుకు అజ మహారాజు, దిలీప మహారాజు పూర్వీకులని మీకు తెలుసు. అయినా ఆవంశం రఘుపుతో ప్రారంభమైనట్లే చెప్తారు. అలాగే చతుస్సముద్ర ముద్రితమైన ఈవిశాల భూభాగాన్ని ఏకచ్ఛత్రాధిపత్యముగా ఏలిన మహానీయునితోనే గుప్తవంశము ప్రారంభమైనట్లు చెప్పుకోవాలి. నేను ఆసంప్రదాయాన్నే స్వీకరించాను. మొదట ఉన్న ఇద్దరు గుప్తరాజులను వదలివేశాను."

"మీభావం ఇప్పుడిప్పుడే బోధపడుతోంది. మహాకాళేశ్వరస్వామి నిజమైన సేవకులు మీరు."

"కథను కొంచెము గోప్యముగా చెప్పడం మరొకందుకుకూడా అవసరం. రాజులను, రాజకుమారులను గురించి సత్యాన్ని నగ్నంగా చెప్పడం తరచు ప్రమాదకరం."

"మీరన్నది పూర్తిగా నిజం. సభలో నేనంత సూటిగా మాట్లాడినదాని ఫలితాలను గురించి నాకు కొంత అనుమానం కలుగుతోంది."

"అదీ విషయం. రఘు, రామచంద్ర, అగ్నివర్మాదులంతా ఒకే వంశవృక్షంలోనివారు."

"నేడు మనం అగ్నివర్మ పరిపాలనను అనుభవిస్తున్నామా?"

"దాదాపుగా..."

"హే భగవాన్! అటు శ్వేత హూణులు మళ్ళీ సమగ్ర సన్నాహాలు చేస్తున్నారు."

"స్కందగుప్తుని కాలంలోకూడా హూణులు విజృంభించారు. ఆరోజుల్లో గుప్తసామ్రాజ్యము మహా శక్తివంతముగా ఉండేది. అంటే అప్పుడు రక్తమాంసాదులతో దృఢంగా ఉండేది. నేడది గుండెలు లేని దై ఉంది."

సైన్యశక్తిమీాద కవి సన్నగా విసరడం పుష్యభూతికి కాస్త చురుక్కుమన్నది.

"గుండె లున్నవో లేవో చెప్పగలది యుద్ధరంగం" అన్నాడు అభిమానంతో.

"యుద్ధము ప్రారంభమయ్యేది మనుష్యులమనస్సుల్లో. సమరోత్సాహం అనేది నే డెక్కడైనా కనిపిస్తోందా?"

"మన మహారాజు కాధోరణిలేదు. మంత్రివర్గములోని మరి అనేకమందికి సమరమంటే సంకోచభావమే ఉన్నట్లుంది."

"మన శత్రువు లొక పెద్దపథకం వేసుకు కూర్చున్నారు. నెత్తురుబొట్టు రాలకుండా సర్వమూ కబళించివేయాలనే పథక మది. మన సమాజాన్ని ఏకంచేసే మూలసూత్రాలలోకి మెత్తని వ్రేళ్ళను జొప్పించి వాటిని త్రెంపివేయ యత్నిస్తున్నారు."

"హూణుల వ్రేళ్లు మెత్తనా? మీా ఉపమానము అతికినట్లు లేదు."

"కత్తిని, బాణాన్ని చేపట్టినప్పుడు అవి కఠినమై ఉక్కు

ప్రేళ్ళలా అవుతాయి. ప్రస్తుతము ఆ ఉక్కు పిడికిలి మెత్తని పత్రాలమాటున ఉన్నది."

పుష్యభూతి మౌనంగా కూర్చున్నాడు. కాసేపైన తర్వాత ఒక్కసారి నిట్టూర్చి అన్నాడు: "అంతా గమనిస్తూనే ఉన్నాను. అర్థము చేసుకున్నదేదో అర్థము చేసుకున్నాను. ఈ భూఖండములో పరిస్థితు లెలా పరిణమిస్తున్నాయో తెలుసు. త్వరిత గతిని పతనమైపోతున్న దానిని ఆపలేని నిస్సహాయ స్థితిలో నాహృదయము క్షోభ పడిపోతోంది. సర్వ సంగ పరిత్యాగముచేసి ఈగోడవతో తెగతెంపులు చేసుకొని వెళ్ళిపోదామనిపిస్తుంది తరచు."

"దానివల్ల ప్రయోజన మేమైనా ఉంటుందా? సర్వమూ నాశనమైపోతే ఒక్కడవే మిగిలి కూర్చొని చేసేదేమిటి?

మళ్ళీకాసేపు గంభీరమైన నిశ్శబ్దం... వారి గంభీరమైన ఆలోచనలకు వలె.

"అర్థరాత్రయింది. ఇక పోదాం పదండి" అన్నాడు కవి నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ బయలుదేరబోయేముందు ఆ రాజ్యముయొక్క, ప్రజలయొక్క ఆరాధ్యదైవము రక్షకుడునైన మహాకాళేశ్వరునికి సాష్టాంగదండప్రణామ మాచరించి వారు గుడి వెడలి వచ్చారు.

౫

మహా కీర్తివంతులు, తన పూర్వీకులునైన సముద్ర గుప్త, కుమారగుప్త, స్కందగుప్తులు అలంకరించిన సింహాస నమును నేడు బుధగుప్తు డాక్రమించాడు. సముద్రగుప్తుని తర్వాత మరిఇద్దరు గుప్తవంశజులు పరిపాలించారు. వారి అనంతరము బుధగుప్తుడు రాజ్యమునకు వచ్చాడు. నేటికీ గుప్తసామ్రాజ్య వైభవము ఎల్లెడలా ఉన్నది; కాని దాని పతనదశ అంధులకు తప్ప అందరికీ కనిపిస్తూనే ఉంది. కేంద్ర స్థానమగు ఉజ్జయినిలో రాజ్యముయొక్క హృదయ స్పంద నము బాగానే ఉన్నదిగాని సరిహద్దులలోని అంగాంగములు దెబ్బతిని పోతున్నాయి. పశ్చిమ సరిహద్దులలోని ప్రాంతా లపై సామ్రాజ్య ప్రభావం చాలవరకు తగ్గింది.

సామ్రాట్టుయొక్క అదుపాజ్ఞలు రాజ్యపు నలు మూలల్లో రాజప్రతినిధులు, న్యాయాధికారులద్వారా వ్యాపించియున్నమాట నిజమేగాని, వాటి అమలుకుమాత్రం ఏమంత శ్రద్ధ చూపబడడంలేదు. దూరప్రదేశాలలో తన ఆజ్ఞలను అమలు చేయించగల శక్తి సామ్రాట్టుకు లేదని వారికి తెలుసు. ఒకప్పుడు అతిశక్తివంతముగానున్న తమ ప్రభువు శక్తిహీను డవుతున్నాడని సహజంగా మొదట గుర్తించినది ఆ అధికారులు. ఆతర్వాత వీధిన వెళ్ళే సామా న్యుడికికూడా తెలిసిపోయింది. వికావికలై పోతున్న అతని అధికారం అందరికీ సామాన్య విషయమైపోయింది.

వాయవ్య సరిహద్దు ప్రాంతమును బుధగుప్తుని సామ్రాజ్యపు కోటగండి అనవచ్చును. దురాక్రమణదారులైన శ్వేతహూణులను స్కందగుప్త సామ్రాట్టు సింధునది ఆవలకు తరిమి తరిమి కొట్టిన సమయముండున్నది. నాటినుండి సింధునదినే తన వాయవ్య సరిహద్దుగా ప్రకటించాడాయన. ఆయన వారసులు ఆ ప్రకటన కనుగుణముగా అక్కడ అధికారమును నిర్వహించుకోలేక పోయినారు. ఉజ్జయినిలోని విదేశాంగశాఖ మాత్రం నేటికీ తన సరిహద్దు సింధునది అంటూనే ఉంటుంది. కాని ఆనదికి, ఆప్రాంతపు ప్రముఖ నగరమైన సకలానగరానికి మధ్యభాగము నాక్రమించిఉన్న రాజులు, సన్నకారు పరిపాలకులు తాము స్వతంత్రుల మంటుంటారు

నిజానికి ఈవిశాల భూభాగంలో సమగ్రమైన పరిపాలన లేదు. ఆధునికమైన నిరధిప మండలం (no man's land) అనేపేరు దానికి తగిఉంటుంది. భారత వర్షమునకు ఆవల ఉత్తరమున, పశ్చిమముగా బాల్హిక్ రాజ్యమగు బాక్ట్రియా వ్యాపించిఉన్నది. దానిపై శ్వేతహూణులు తిరుగులేని అధికారము చలాయిస్తున్నారు. వారిరాజు తోరమానుడు. గుప్తరాజులు ఉత్తర, పశ్చిమ, మధ్య భారత వర్షము నేలుతున్నారు. కొంతవరకు అదంతా ఏకఖండంగా పరిపాలన సాగుతోంది. ఈరెండు రాజ్యాలకు మధ్యనున్నది ఆ "ఎవరికీ చెందని భూమి" – రెండు బెబ్బులుల మధ్యనున్న మేకవలె. అయితే ఈరెండు పెద్దపులుల అలవాట్లు వేరు. ఇందొకటి పెద్దదైన నిండైన పులి. రెండవది ఆకలిగొన్న చిన్న

పులి. ఒకటి సంతుష్టమైయున్న రాజ్యం. తనకున్న దానికి భంగం రానంతవరకు అదికదలదు. రెండవది ఆతతాయిది. నెమ్మదిగాఉన్న పొరుగువారి సొత్తును అపహరించి తనకోశము నింపుకోవాలనే దుర్బుద్ధితోకూడిన జిత్తులమారిది. నదికి ఈవలదూరాన భోగభాగ్య విలసితమైన రాజ్యము. సింహాసనముమీద బుధగుప్తుడు. ఆవల శ్వేతహూణుడైన తోరమానుడు; ఆ పారే నదివంక, పచ్చని పొలాలవంక ఆశగా చూచే అతని ప్రజలు. విభిన్న ప్రాతిపదికలుగల రెండు సంస్కృతులు; ఎంతగానో విభేదించే రెండు నాగరికతలు— భవిష్యత్తును నిర్ణయించేందుకు ఎదురెదురుగా తారసపడి ఉన్నాయి. చరిత్రతీరు అతి విచిత్రముకదా !

౬

ఇప్పుడు సముద్రగుప్తుడే బ్రతికివుంటే...! ద్వితీయ చంద్రగుప్తుడు లేదా కుమారగుప్తుడు .. కనీసం స్కంధ గుప్తుడు జీవించి ఉంటే... ప్రజలను విజృంభింప చేయక పోయి ఉండేవారా! "హూణులను దునుమాడివేయండి! దురాక్రమణదారులను గెంటివేయండి! మిత్రులారా! శస్త్రములు చేపట్టి సీమలను కాపాడండి!" అని హెచ్చరించకుండా ఉండేవారా!

సింహాసనానికి వారసుడైన బుధగుప్తుడు వారి శౌర్య విజ్ఞతలకు వారసుడు కాకపోవడం విచారకరం. పిరికివాని ఆత్మ

సంతృప్తితో అతడు ఇలావాదిస్తాడు: "యుద్ధంలో జయాప జయాలు అంచనా చేయడానికి అవకాశం లేనివి. ఊహించ డానికి వీలులేనట్టివి. బాక్ట్రియనుల రాజ్యమైన బాల్హిక్ చాలా దూరానఉన్నదని అందరికీ తెలుసు. మన ఉజ్జయినికి గాని, మధ్యభారత ప్రయోజనాలకుగాని ఇది చాలా అనుకూల మైన విషయం" అంటా డతడు. విద్వేషియైన శత్రువు వంద యోజనముల కవతల ఉన్నప్పటికి పొరుగున ఉన్నశత్రు వంత ప్రమాదకారియే నని, కనుక రెంటియెడ సమాన జాగ్రతలే వహించాలనే విషయాలు బుధగుప్తుని దౌర్భాగ్యపు దౌత్య నీతికి అవగతం కావడం లేదు.

విజ్ఞులు, వయోవృద్ధులు, అనుభవజ్ఞులైన అమాత్య వర్యులు రక్షణవిషయమై ఉద్బోధిస్తే, బుధగుప్తుడు తన శాంతి పథకాలను సమర్థించుకుంటూ ఆస్థానకవివర్యుని కుమార సంభవంనుండి శ్లోకాలు చదివి వినిపించి "రాజకీయాలలో నేను కాళిదాసు వర్ణించిన ఉమను. నా రాజకీయాలు ఎప్పుడు మధ్యేమార్గాన్నే అనుసరిస్తాయి. అవి ఎటువైపూ మొగ్గవు. నావిధానం చూడండి మీరు" అన్నాడు.

ఒకసారి అత డిలాగే మాట్లాడుతుంటే అతడి ఆత్మస్తుతి వెనుకనున్న దురభిమానం తునాతునక లయేలా సర్వ సైన్యాధిపతి ఒక చురుకైన విమర్శను విసిరాడు. "బాగా చెప్పారు ప్రభూ! మీరు జీవితంలో కుమారసంభవాన్నే ఆదర్శంగా ఉంచుకోండి. ఆ ఆదర్శం ఆధారంగానే దేశంలోని

పిశాచాలను పారద్రోలండి" అన్నాడు పుష్యభూతి. అందుకు సమాధానముగా బుధగుప్తుడు ముక్తసరిగా నవ్వి, "అలా అయితే మా ఆస్థానకవి మళ్ళీ ఒక కొత్త కావ్యం వ్రాయాలి. ఈవయసులో ఆయనకు అది చాలా భారమైనపని అవుతుం దని గట్టిగాచెప్పగలను" అన్నాడు. ఆప్రక్కనే నెగసిన గడ్డంతో ఉన్న మహాకవి చటుక్కునలేచాడు; "పైపైకివెళ్లే నా సామ్రా ట్టును అనుసరించడానికి నాఘంటం ఎప్పుడూ సంసిద్ధమే" అన్నాడు గంభీరంగా. బుధగుప్తుడు మెల్లిగా మాటతప్పించి "ప్రతిఒకపొద ఓ ఎలుగుకు నివాసమే అని శంకిస్తూకూర్చుంటే జీవితం ఘోరంగా ఉంటుంది" అంటూ వేదాంతం ఒలక బోశాడు.

కాని కవిమాత్రం మొండిగా తనమాట వదలలేదు. "ప్రతి పొదలోనూ ఓ ఎలుగు ఉంటుందని ఎవ రంటారు? మనప్రజలు శాంతి కాముకులు. ఇక్కడ అంతర్యుద్ధం వస్తుం దని ఎవరూ అనుకోరు. కాని పొరుగురాజ్యం—అందులో ముఖ్యముగా ఆ తోడేలు తన గాయాన్నింకా నాకుకుంటూ ఉండగా మిత్రరాజ్యం ఎప్పటినుండీ అయింది?" అన్నాడుకవి.

"ఇప్పట్లో మళ్ళీ మనజోలికి రాలేనంత గట్టిగా పాపం హూణులు స్కంధగుప్తుని చేతిలో దెబ్బతిన్నారు" అన్నాడు బుధగుప్తుడు.

ఇంతలో పుష్యభూతి కలుగజేసుకొని "క్షమించండి మహారాజా! మీరక్షణమంత్రిగా, మన సామ్రాజ్యపు సర్వ

సైన్యాధిపతిగా సరిహద్దులలో మన రక్షణ ఏర్పాట్లు సరిహద్దు ప్రాంతాల పర్యవేక్షణ, విషయసేకరణలు నాబాధ్యత. నాకు అందిన సరికొత్త సమాచారం ప్రకారం శ్వేతహూణులు తక్షశిల, శకల, మయూరపురములవరకు చొచ్చుకువచ్చారు. ఒకసారి శూద్రకి భాగంలోనికి కూడా వచ్చారట" అన్నాడు.

"ఏమి టందులో ప్రమాదం?" బుధగుప్తుడు ప్రశ్నించాడు.

"మనప్రజలలో అసంతృప్తి రెచ్చగొట్టి తిరుగుబాటును ప్రోత్సహిస్తున్నారు. అదీ ప్రమాదం"

"ఇది మీ ఊహ".

"ఇది నామెదడున పుట్టిన విషయం కాదు స్వామీ"

"అయితే, ఇది మీ కెలా తెలుసు?"

"అక్కడ విశ్వాసపాత్రులైన మన ప్రతినిధు లున్నారు. వారు సమాచారం అందజేస్తుంటారు."

"మీ ప్రతినిధులు మీకు అమ్ముడుపోయిన బాపతు. మీ ప్రాపుగోరి జీవిస్తున్న బాపతు. మీ దృష్టిలో ముఖ్యులయేందుకు ఈ మాదిరి నివేదికలను సృష్టించి పంపుతుంటారు. దయచేసి మీరంతా కాస్త శాంతంగా ఉండండి. మీ అందరికీ నా సూచన ఇది. ఒక్కొకప్పుడు రాజకీయ వ్యూహాలలో సంపూర్ణ నిష్క్రియత ఆధారస్థంభం అవుతుంటుంది."

రాజు కేవలం సుఖాసక్త జీవనాన్ని ఎన్నుకున్నాడని అతడిని మరల్చడం అసాధ్యమని కవి, సర్వసైన్యాధిపతి, విజ్ఞులైన ఇతర పెద్దలు అర్థంచేసుకున్నారు. కవి తనలో తానే సణుగుకున్నాడు: "సర్వనాశనానికి పూర్వము మానవుడు అడ్డుత్రోవలు వెతుక్కుంటాడు" అని.

ఆ సమయంలో కంచుకి ఒకడు ప్రవేశించి, రాజును సమీపించి "ప్రభూ! సర్వము ఏర్పాటైనది. తమ ఆగమనానికై నిరీక్షిస్తున్నారు" అన్నాడు.

బుధగుప్తుడు వెంటనే తనకు వేరేపని ఉన్నదని చెప్పి సమావేశాన్ని చాలించి, కంచుకి వెంటరాగా బయల్దేరాడు.

ఇట్టి ఘట్టాలకు అలవాటుపడిన మంత్రులకు రాజెక్కడికి వెళ్ళినదీ తెలుసు. అతడు వెళ్ళినది సంగీతమంటపానికి. వన్నెచిన్నెల వయారి చిలుకలు, సాంస్కృతిక విభాగపు నాట్యరాణులు అక్కడః ఎదురుచూస్తున్నారు. ఆ మహోత్సవానికి రాజుగారి ప్రేక్షకత్వం అత్యవసరం!

మంత్రిమండలి కూడా లేచింది.

"బుధగుప్తుడు సముద్రగుప్తుని సంగీతసమరాలు రెండిటిలో ఏదో ఒకదానినే ఎన్నుకొనవలసి ఉంది గనుక రెండవ దానిని వదలి మొదటిదాని నెన్నుకున్నాడు" అన్నాడు కవి.

"రాజుగారు కేవలం రసికత్వంలో పడితే రాజ్యానికి సర్వనాశనం తథ్యం" అన్నాడు రక్షణమంత్రి.

"రాజ్యమేలడాన్ని మించిన కళ లేదని, దానిని సాధన చేయడంలో గల కష్టం ఇంకేకళ విషయంలోను ఉండదని మనరాజు ఎప్పటికి తెలుసుకుంటాడు?" అన్నాడు మహాకవి విచారంతో.

"ఓ మహాకవీ, ఇక ఇప్పుడు అర్థంచేసుకునే సమయం లేదు. వాయవ్య సరిహద్దులనుండి వస్తున్న వార్తలు నిజంగా చాలా ఆందోళన కల్గించేవి. శ్వేతహూణుల ముందంజకు ప్రధానకారణం మహారాజులోని బలహీనతే"

"అయితే పోరు అనివార్య మంటారా?"

"దాదాపు"

"అయితే ఏమంత నష్టంలేదు"

"ఎందువల్ల?"

"ప్రమాదం ప్రారంభమైనప్పుడు పర్యవసానాలను అందరూ చూడవచ్చు."

"మార్గాంతరం ఏదైనా ఉందంటూరా?"

"యుద్ధక్రియలు మారువేషాల్లో మనలను చుట్టుముట్టినప్పుడు పర్యవసానాలను అంత స్పష్టంగా ఊహించలేము."

"మీారంత అధైర్యపడటానికి కారణం?"

"అట్టే ఏమీాలేదు. కవిగాని కాలక్షేపం. అంతే" అన్నాడు కవి.

"అలాకాదు. నాకర్థంకాని ఈవిషయాన్ని వివరించి చెప్పండి." పుష్యభూతి ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

"అయితే రండి. శ్రీమతి శీలవతి భవంతికి వెళదాం. మన ఏకాంతసంభాషణలన్నీ అక్కడ సాగించుకోవచ్చు. సానుభూతితో వినేవారుంటే – వత్సము ఎదుటఉన్న గోమాతకు క్షీరముస్రవించునట్లు–హృదయస్థమైయున్న రహస్యములన్నీ వెలికివచ్చి కొంతభారం తగ్గిస్తాయి."

"మీా రన్నది నిజము మహాకవీ!"

మిత్రు లిరువురూ సిప్రానదీతీరమున ఉన్న శీలవతి నివాసానికి బయల్దేరి వెళ్ళారు.

## ౭

స్కంధగుప్తుని మరణానంతరము గుప్తవంశపు ఆశయాదర్శాదులలోను, సంప్రదాయాలలోను మార్పులువచ్చాయి. ఈపరివర్తన పవనాలు ఉజ్జయిని సాంఘికవ్యవస్థపైకికూడా ప్రసరించాయి; రాజరికం కొత్తఆశయాలకు, పద్ధతులకు సహాయపడజొచ్చింది ప్రభావపూర్ణమైన దక్షిణభారతంనుండి వైష్ణవభక్తి సంప్రదాయం ఉజ్జయినిలో ప్రవేశించింది. దానితోపాటు దేవదాసి వ్యవస్థకూడా వచ్చింది. అది ఆలయ ఆవరణ దాటి నగరాన్నికూడ ప్రభావితంచేయ నారంభించింది. గుప్తుల సంప్రదాయిక దైవమైన మహాకాళేశ్వరుడు

ఈకొత్తగావచ్చిన లక్ష్మీనారాయణస్వామికి వెనుకబడ్డాడు. రాజుగారి అడుగుజాడల్లో నగరప్రముఖులు ఈ నూతనభక్తి సాగరంలో మునిగిపోయారు.

అన్యప్రయోజనాలు పొందేందుకు తమనుతాము కోలుపోవడం వారు నేర్చుకున్నారు. కళాప్రధానమైన సంస్కృతికి రాజరికపు ప్రాపు లభించింది. నృత్యము, సంగీతము, సాహిత్యము, చిత్రలేఖనము ఇత్యాదుల వ్యామోహము మితిమీరిపోయింది. మొదట్లో శ్రీమతి శీలవతి అందరికీ అభిమానకేంద్రంగా ఉండేది. క్రమంలో ఆ స్థానాన్ని దేవదాసీలాక్రమించారు. భక్తియోగ వ్యామోహంలో పడిపోయిన ప్రజలు దేవదాసీలు, అందగత్తెలతో వెర్రెత్తిపోతున్నారు.

బుధగుప్తుని స్థితికూడ అలాగేఉంది. రాచరికపు వ్యవహారాలను నిర్వహించేందుకు ఆయనకు ఉండవలసినంత వ్యవధి ఉండడంలేదు. ఉదయంపూట వాహ్యాళి సమయంగూడా సంగీతమంటపంలోనే గడచిపోతోంది. వీటన్నిటి పర్యవసానంగా పరిపాలనానిర్వహణ భారం మంత్రివర్గంమీాద, కార్యదర్శులమీాద పడ్డది కాస్త భక్తిరసామృతాన్ని గ్రోలిన ఉద్యోగి ఎవరైనా ఉంటే చాలు, అతని పొట్టె విరిగి నేతిలో పడ్డట్లే. ప్రభువు వారినే అభిమానిస్తాడు. వారితోనే సంప్రదింపులు కోరుతాడు. ఫలితముగా నిజమైన దేశశ్రేయోభిలాషులు తృణీకరించబడ్డారు. అట్టివారిలో పెద్దలైన మంత్రులు, విశ్వాసపాత్రులు, విశేషానుభవజ్ఞులునైన సైన్యాధికారులు ఉన్నారు. వీరిలో పలువురు హృదయభారముతో పదవీవిరమణ

చేశారు. స్వీయగౌరవమర్యాదలను లక్ష్యపెట్టక, దేశశ్రేయస్సే ప్రధానంగా భావించే నిస్వార్థులు కొందరింకా పట్టుకు వ్రేలాడుతునే ఉన్నారు. వీరందరిలో చాలా గొప్పవాడు సైన్యాధిపతి, రక్షణమంత్రి అయిన పుష్యభూతి.

చాలాసార్లు తానుకూడా విరమించి, సన్యాసం స్వీకరిద్దామనుకున్నాడు. ఆజన్మబ్రహ్మచారి కనుక అతని కెందుకు బంధనాలుకూడా ఏమీలేవు. కాని అత డెచటికి వెళ్ళగలడు? అసమర్థుడైన రాజుయొక్క పాలన కింద ఉన్న ఈరాజ్యంలో అతనికి శాంతి ప్రసాదించగల స్థానం లేదు. పతిత సామ్రాజ్యపు ప్రతిధ్వనులేవీ వినరాని దూరప్రదేశానికి, కల్మషమైన ఆ సభాప్రదేశానికి వీలున్నంత ఎక్కువదూరంగా వెళ్ళిపోవాలి. ఈ భగవత్సృష్టిలో తాను కలగంటున్న అలాంటి ప్రదేశం ఎక్కడున్నది? గుప్తసామ్రాజ్యం ఒక చిన్న చేతి గుడ్డవంటిది కాదు. దానిని చుట్టిరావడం, దానికి దూరంగా వెళ్ళిపోవడం తనవయస్సులోని వృద్ధునికి తేలికపని కాదు. అయినా ఆ రాజ్యంలోనే ప్రాపంచిక రణగొణధ్వనులు లేని ఒక పవిత్ర ప్రశాంతస్థానం లభించకపోదు. ఆయనమనస్సు తరచు స్కంధగుప్తుని వైభవోజ్వల పరిపాలనాకాలమువైపు పోతోంది. సామ్రాజ్య సేనావాహిని కధిపతిగా తాను శ్వేతహూణులను సీమలుదాటి సింధునది కావలకు తరిమితరిమి కొట్టాడు. దురాక్రమణదారులను దునుమాడివేస్తుండగా నది మధ్యలో ఒక కొండదీవిని చూచాడు. చొరరాని ఆ దీవి సామ్రాజ్యపు సరిహద్దుల కాపలాకు చక్కని స్థావరమని భావించాడు.

ఇప్పుడా వృద్ధవీరుడు పదేపదే ఆదీవిని గురించే కలగంటు న్నాడు. విధివిలాసమా అన్నట్లు బుధగుప్తుని సామ్రాజ్యపు సరిహద్దుల రక్షణకు ఇది అక్కరలేకపోయింది. ఎందువల్ల నంటే బుధగుప్తుని వాస్తవాధికారపు సరిహద్దు చాలా తూర్పుకు వెళ్ళిపోయింది. ప్రశాంత జీవనానికై తహతహ పడుతున్న పుష్యభూతిని ఆ ఏకాంతమైన దీవి ఆకర్షించింది. బుధగుప్తుని చర్యలతో అసంతృప్తి కలిగిన సమయాలలో ఆయన మనస్సు ఆ ప్రశాంతద్వీపమువైపు పోతుండేది. భవి ష్యత్తు ఏమికానున్నదోకూడా అతనిఊహ కందడములేదు. ఏదో నిస్పృహాభావం అతని ముఖమంతా అలముకొన్నది. సైనికప్రయోజనాలకు ప్రకృతిచే సృష్టింపబడి రాజ్యముచే విసర్జింపబడిన కొండశిఖరము ఒకటి తపస్వికి సాధనాస్థలం కాబోతోంది! ఆ తపస్వి, సైనికుడు ఒకేఅంశనుండి ఉద్భ వించినవారు కాదుకదా! ఈ ఏకత్వము వెనుక లోతుగా ఏదైనా సత్యం ఇమిడి లేదుకదా! ఒంటరిగా ఉన్నప్పుడు ఈమాదిరి తత్వచింతన జరుగుతుండే దాయనలో.

* * *

సింధునదీ మధ్యములో, గగనమును చుంబిస్తూ నిలచి ఉన్న ఆపర్వత శిఖరంమీద ఒక విచిత్రమానవుడు తదేక ధ్యానంలో నిలచిఉన్నాడు. సంధ్యాసమయాలలో పాంథులు ఆవైపొకసారి గౌరవదృష్టితో చూచేవారు. ఆయనను గురిం చిన కథలు చెప్పుకోవడం వారికిష్టం. పాండవుల గురువైన

ధౌమ్యుడు,—తన బాధ్యతక్రింద నున్న శిష్యులు శాశ్వతానందస్థానంపొందారు గనుక ఇక ప్రశాంతముగా ఏకాంతవాసంలో తపము జేసుకుంటున్నారని, ఈ కనిపించే మహనీయుడు ఆ ధౌమ్యుడేననీ అనేవారు కొందరు. మరికొందరు ఆయన నొక పవిత్ర బౌద్ధబిక్షువుగా భావించేవారు. పర్వదినాలలో ఫలాలు, తేనె మొదలైనవి అర్పిస్తుండేవారు. ఆ కొండంతా ఎక్కేవారు కాదు. మధ్యలో ఒక నీటిబుగ్గవద్ద అర్పించి సంతృప్తితో తిరిగి వచ్చేవారు. ఆవిచిత్రయోగికి ఆహారం ఈభక్తుల అర్పణలే! అలాగే కాలం గడిపేవాడాయన!

౮

ఒకరోజు ఉదయం ఉజ్జయినీపౌరుల కొకపెద్ద 'వింత' కనిపించింది నగర వీధుల్లో విదేశీసమూహం ఒకటి విహరిస్తోంది ఏదో విచిత్రమైన భాష మాట్లాడుతున్నారు. బాహ్యదేశపు వేషాలతో ఉన్నారు. వారి కను ముక్కు తీరు చాలా తేడాగా ఉంది. ముఖంమీద ఎక్కడా వెంద్రుకలు ఉన్నట్లు లేవు. వారివెంట ఒక పొట్టి గుర్రాలగుంపు ఉన్నది. గుర్రాల వీపులమీద సామానుల మూటలున్నాయి. ఎవరో వ్యాపారులిటు వచ్చారు కాబోలు ననుకున్నారు ప్రజలు. అయితే వీరేదేశంనుండివచ్చారో వారికి అంతుచిక్కలేదు.

ఒక పౌరుడు చొరవచేసుకుని ప్రశ్నించాడు "మీదే దేశము?" అని. ఆ ముఠానాయకుడు వచ్చీరాని ఉజ్జయినీ

భాషలోనే "మాది పురుషపురము. వ్యాపార స్థలం" అని చెప్పి, "మీ నగర పాలకుని భవనము, గృహమంత్రి నివాసము ఎక్కడ ?" అని ప్రశ్నించాడు.

ఆ పౌరుడు ముఖ్యమంత్రి అయిన సురపాలుని భవనానికి మార్గము చెప్పాడు. ఆముతా అటు మళ్ళింది.

బృందనాయకుడు సురపాలునిముందు అతినమ్రముగా వంగి వందనము లాచరించి, బంగారు నాణెముల కానుక లుంచాడు.

సురపాలుడు ఎంతో సంతోషించాడు. "ఎవరుమీరు?" అన్నాడు.

"మేము సంచార వ్యాపారులము బాబూ"

"మీ దే దేశము ?"

"పురుషపురము నుండి వచ్చామండీ."

"నేను పురుషపురము చూచాను. మీరు పురుషపుర నివాసులవలె లేరే?" అన్నాడు సురపాలుడు.

"ప్రభువులవారికి అన్నీ తెలుసు. పురుషపురము మా వ్యాపార కేంద్రం. మా స్వస్థానము హిందూకుష్ పర్వతాలకు పశ్చిమభాగం."

"సరకు లమ్మకునేందుకు ఇంతదూరం వచ్చారా?"

"ఇల్లు వదలని వ్యాపారి ఎన్నడూ బాగుపడడు ప్రభూ."

"అయితే మీ రేమే సరుకుల వ్యాపారం చేస్తారు?" బృందనాయకుడు ఒక పెద్ద పెట్టె తెరచాడు. చిత్రవిచిత్రము లైన చర్మ పేటికలు, సంచులు, అడవి జంతువుల ఎముకల తోనూ, కొమ్ములతోనూ తయారైన అనేక వస్తువులు; కలం పుడకలు, కుంచెలు, సిరాబుడ్లు, కంఠాభరణాలు, కర్ణాభరణాలు ఒకటేమిటి... కళ్లు జిగేల్ మనేలా ఒక్కొక్క వస్తువునే ఊపిరాడకుండా చూపించ నారంభించాడు

సురపాలుడు వాటిని పరీక్షించి చూచాడు. నిరాడం బరంగాను, అయినా ఎంతో కళాత్మకంగాను తయారుచేయ బడిన వా టన్నిటిని ఎంతగానో ప్రశంసించాడు.

"ఇవి ఎంతో అందంగా ఉన్నమాట నిజమే అయినా ఇక్కడ మాకు లేనివస్తువులుమాత్రం కాదు. మరి మా ప్రజలు వీటినే ఎందుకు కొనాలని మీ ఉద్దేశం?" ప్రశ్నిం చాడు సురపాలుడు.

"వాటి ధరను చూడండి ప్రభూ..."

"ఏం తేమిటి?"

ఆబృందనాయకుడు చెప్పిన ధరలు, అంతంత విలాస వస్తులకు సంబంధించి ఊహించరానంత తక్కువగాఉన్నాయి. ఆశ్చర్యంతో చకితుడై పోయి ముఖ్యమంత్రి "అంత చవుకగా ఎలా అమ్మగలుగు తున్నారు?" అన్నాడు.

"మేము బయట ఎవరి సహాయము పొందము. మేమే వేటాడుతాం. మేమే వాటిని అందంగా తయారుచేస్తాం.

అందువల్ల మాకు చాలా తక్కువకు గిట్టుతుంది. పైగా మా దేశంలో ఆహార పదార్థాలు కోకొల్లలుగా చాలా చవుకగా, తేలికగా లభిస్తాయి ప్రభూ."

"అవునవును; అయితే మీరిప్పుడు ఏమికావా లంటారు?"

"ఏమీ లేదు ప్రభూ! ఈ సరకును విక్రయించుకోవడానికి, ఈ వ్యాపారము నడుపుకోవడానికి అనుజ్ఞ ఇప్పించమని ప్రార్థిస్తున్నాము."

అనుమతి నివ్వడానికి అభ్యంతర మేమీ లేదనుకున్నాడు ముఖ్యమంత్రి. ఎందరెందరో విదేశీయులు వ్యాపారం చేసుకువెళ్ళారు. పైగా తనకు చాలా బంగారం కానుకగా ఇచ్చారు.

"సరే మీరు వ్యాపారం చేసుకోవచ్చు కాని ఈ రాజ్యపు నియమ నిబంధనలు పాటిస్తుండాలి. లేకపోతే చిక్కున పడతారు" అన్నాడు ముఖ్యమంత్రి.

ముఠానాయకుడు మళ్ళీ వంగి వంగి వందనా లర్పించాడు. పౌరులందరితోపాటు తాము విధేయతతో మెలగుతామన్నాడు. మంత్రిపుంగవుల కృపాకటాక్షవీక్షణములు తమపై ఉంటే తమ కదే చాలునన్నాడు. పనిపూర్తయింది. బృందము వెళ్ళిపోయింది.

* * *

నగరముచుట్టు ప్రవహిస్తున్న సిప్రానది ఒడ్డున ఉన్నది శీలవతిభవనం. రోజూ జరుగుతూఉండే వ్యవహారాలను గురించి ఏకాంతంగా చర్చించుకొనే కొద్దిమంది ఆప్తమిత్రుల కది

కేంద్రము. మామూలు ప్రకారము ఒకసాయంత్రము పుష్యభూతి, మహాకవి కాళిదాసు, తదితరులు అక్కడ కూర్చొనిఉన్నారు. మహాకవితో సమవయస్కఅయిన శీలవతి విద్యావిజ్ఞానాలలో, కళాసంస్కృతులలో, దేవదాసీత్వంలో చాలా ఖ్యాతికన్నది.

ఒకమూల చిన్న ఆముదపు ప్రమిద వెలుగుతోంది. ముగ్గురూ తీవ్రమైనచర్చలో ఉన్నారు. ఇంతలో నిఖిలుడు పరుగెత్తుకుంటూ వచ్చాడు, "చాలా ఆలస్యమయింది" అను కుంటూ.

శీలవతి సన్నగా నవ్వి, "కవిచంద్రుడు తమ మేఘ సందేశములో వర్ణించినమేఘానివి నీవేవలెఉన్నది. ఉజ్జయినీ నగరభవన శిఖరాల మీదనుండే సుందర కన్యకలు నీకడ్డుతగిలి నందువల్ల ఆలస్యమైఉంటుంది" అన్నది. నిఖిలుడు పకాలున నవ్వాడు. ఈ చమత్కారానికి అంతా ఆనందించారు.

నిఖిలుడు కాళిదాసు కవిత్వానికి ఒకవ్యాఖ్యాత. కాళి దాసు, పుష్యమిత్ర, శీలవతులకు మిత్రుడు. వీరందరిలో చాలా చిన్నవాడు. సర్వజనమనోరంజకుడు.

వారు కూర్చున్న తివాచీపై పడ్డ దీపపుకాంతిని చూచి "చూడండీ! కవివర్యుని స్పర్శమాత్రముచేత ఆప్రాగలువ విక సించింది" అన్నాడు నిఖిలుడు, ఆశ్చర్యం నటిస్తూ.

"దిఙ్నాగుడు ఈ చుట్టుపట్ల లేనందున అదృష్టవంతుడు" అన్నాడు కాళిదాసు.

"ఏమి? నేనన్నది పొరపాటా?" అన్నాడు నిఖిలుడు.

"కాదా మరి? రాత్రివేళ ఎర్రకలువ వికసించదు. విక సించేది శ్వేతపుష్పము."

"ఓస్! అంతేనా? మీ దిజ్నాగుడికి దివాకరుడైన ఒక్క సూర్యుడే తెలుసు. మా కవి చాలా గొప్పవాడు. రాత్రివేళనుకూడ పగలుగా మార్చివేయగలడు" అని, శీల వతివైపు తిరిగి "ఇదివర కెప్పుడూ ఈతివాచీని చూడలేదు. ఎంతయిన దేమిటి?" అని అడిగాడు.

"నా ప్రశ్నకునీవు సమాధానమీయలేదు. ఎందువల్ల ఇంత ఆలస్యమైనది?" అని అడిగింది శీలవతి.

"ఉజ్జయినీలోని సుందరకన్యలు కారణమని నీవేచెప్పా వుగా. శ్వేతహూణులు ఒక చిన్న నృత్యోత్సవం ఏర్పాటు చేశారు. నన్నూ పిలచారు. అక్కడినుండి బయటపడేసరికి ఈవర అయింది."

"బాగుందా నృత్యం?"

"అంతబాగాఉన్నదనిచెప్పలేనుగాని క్రొత్తగాఉన్నది."

"క్రొత్తదనం బాగుండడాన్ని మించిపోయినదంటే అది ప్రమాదానికి గుర్తని తెలుసుకో" అన్నాడు మధ్యలో కవి.

"దేనికి ప్రమాదం? కళలకా?"

"కళలకు, కళాకారులకు, సమాజానికే ప్రమాదకరం."

"అయితే సాంఘికాభివృద్ధి మంత్రిని నిందించండి. అసలు రాజుగారే దీనికి ప్రధాన ప్రోత్సాహకులు" అన్నాడు నిఖిలుడు.

శీలవతి అందుకున్నది : "కమ్మని ఖర్జూరాలంటే రాజు గారికి రుచితప్పింది. వారు మార్పుకోసం పుల్లని చింతపండు కోరుతున్నారు" అన్నది.

"పర్యవసానాలు చేదుగాను ప్రమాదకరంగాను ఉంటాయి," వ్యాఖ్యానించాడు కవి.

"ఎవరికి ప్రమాదకరం? కవివర్యులు శకుంతల సంగతి ఆలోచిస్తున్నారా?"

"అలాగేఅనుకో. ఈ శకుంతల కణ్వామహర్షి పెంచు కున్న శకుంతలను మించిపోయింది. ఈమెపేరు సైనికశక్తి. సాగర పరివేష్టితమైన ఈ ధరామండలానికి రాజ్ఞి ఈమె; ఈ నగరరాజపు గర్వహేతువు; గుప్తసామ్రాజ్యపు వైభవ చిహ్నము." మహాకవి అనేశాడు ఒక్కగుక్కలో.

కొద్దిక్షణా లంతా మౌనంగా కూర్చున్నారు. మళ్ళీ నిఖిలు డందుకున్నాడు:

"దాని ధర చెప్పనేలేదేమి?" అని.

"ఎంత ఉంటుం దనుకుంటున్నావు?"

"కనీసం ఏబది సువర్ణము లుండవచ్చు."

"ఆ ధరకు నీ విది తీసుకుంటావా ?"

"అంటే అంత ధర లేదన్నమాట. అయితే నలుబది ఉంటుందా? ఇంకాతక్కువా? సరే. ముప్పదికితక్కువ ఎంత మాత్రము ఉండదు."

"నేనది పది సువర్ణములకు కొన్నాను." అన్నది చిరు నవ్వుతో.

"పదా? అసంభవం. నీవుకొన్నది ఎక్కడ?"

"జనంతో కిక్కిరిసి ఉంటుందే... అదే, ఆ శ్వేత హూణుల దుకాణము లేదూ? అందులో."

నిఖిలుడు తటాలున ప్రశ్నించాడు:

"వీళ్ళువచ్చినది వస్తువు లమ్మేందుకా? లేక జనానికి విరాళా లిచ్చేందుకా?"

ఇంతవరకు వింటూ కూర్చున్న పుష్యభూతి మాట అందుకున్నాడు: "మే మింతవరకు చర్చిస్తున్నది అదేవిషయం నిఖిల్. వీరు వ్యాపారులా లేక వీరిది విరాళములిచ్చే ఏదైనా సమాజమా? వీ రిక్కడ ఉండడానికి ఇంకేమైనా కారణ మున్నదా అని ఆలోచిస్తున్నాము".

"నాకదంతా తెలియదు. వారిధరలు చచ్చేంతతక్కువగా ఉన్నాయని మాత్రం తెలుసు. వీరిముందు ఉజ్జయిని వ్యాపారులు నాశనమై పోతున్నారు." అన్నాడు నిఖిలుడు.

"పౌరులకు వచ్చిన ఈ బెడదను గురించి సామ్రాట్టుకు నివేదించాను" అన్నాడు పుష్యభూతి.

"ఏమన్నా రేమిటి?

"వారా? చక్కగా వారంత చౌకగా ఇస్తుంటే తా మెందుకు నిరోధించాలని అడిగారు. స్థానిక వ్యాపారస్థులు దెబ్బ తిని పోతున్నారని నివేదించాను. స్వేచ్ఛా వ్యాపారములో

ఈమాదిరి పోటీ ఉండితీరాలన్నారాయన. పోటీ అనేది సమాన పక్షాలమధ్య ఉండవచ్చుగాని ఇలా కాదన్నాను నేను. మన వ్యాపారులు స్వదేశంలోనే గిజగిజలాడిపోతున్నారు; విదేశీయులు వచ్చి వెర్రి చౌకగా అమ్ముతున్నారు; ఇందులో ఏదో దుర్వాసన వేస్తోంది; దీనిపై ప్రత్యేకవిచారణ జరగాలి- అని విన్నవించాను. ఏమైనాసరే ఈ పోటీ చాలా అసమంజసంగా ఉందని స్పష్టం చేశాను. వారి దేశంలో ముడి పదార్థాలు చాలా చవుక అని వారిని సమర్థించారు సామ్రాట్టు. వారన్న ముక్కలనే ప్రభువులవారు పదే పదే అంటున్నారనీ, వారన్న దానిలోని సత్యాన్ని మనం పరిశీలించలేదని చెప్పాను. 'అయితే వా రబద్ధాలాడుతున్నారంటారా? ఆఅబద్ధానికి కారణమేదో ఉండాలికదా?' అన్నారు మహారాజు. 'ఆవిషయాన్నే ప్రభువులవారు మంత్రి మండలితో సంప్రదించి నిర్ధారించాల'ని నేను సూచించాను. వారా సూచనను త్రోసిపుచ్చి 'సేనాపతీ! మన వ్యాపారులు వట్టి వెధవాయిలు, మన పౌరులు వట్టి స్తోమరులు. అందు వల్లనే పోటీలో వెనుక పడ్డార'ని నాకు సమాధానమిచ్చారు" ఒక్కగుక్కలో అంతా వివరించాడు పుష్యభూతి.

"చూడగా, సామ్రాట్టుకు హూణులంటే ఏదో అభిమాన మున్నట్లుంది" వ్యాఖ్యానించాడు నిఖిలుడు.

"తన వారిని వెధవాయిలుగా పరిగణించి, విదేశీయుల నభిమానించే పాలకుని క్రింద రాజ్యానికి ముప్పు పొంచి ఉంటుంది" అన్నాడు, బాధతో కాళిదాసు.

"హూణుల యెడల అభిమానం చూపుతున్నది రాజు గారు మాత్రమే కాదు. నగర ఉన్నతాధికారులుకూడ హూణులపై వ్యామోహం చూపుతున్నారు" వెల్లడించాడు పుష్యభూతి.

"అయితే వీరందరినీ అలా పురికొల్పుతున్న ఆదర్శమేమిటంటారు?" నిఖిలు డడిగాడు.

తల నెరిసిన సేనాని తన జీవితంలో అనేక విషయాలు చూచాడు. సమాజముగాని, వ్యక్తులుగాని జీవితంలో ఎలా ఉత్థానపతనాలు పొందుతుంటారో ఆయనకు పూర్తిగా తెలుసు. అందువల్ల 'ఆదర్శ'మనేమాట వినగానే ఆయనకు నవ్వువచ్చింది.

"యువకమిత్రమా! కనకము కళ్లబడేసరికి అన్ని ఆదర్శాలు అణిగి మణిగే ఉంటాయి."అన్నాడు.

"అంటే?"

"అంటే మన నగర ప్రముఖులు విదేశీసువర్ణానికి తమను తాము అమ్ముకుంటున్నారు"

"లంచాలు తింటున్నా రంటారా?"

"దానిని ఏ పేరుతో పిలిచినా వాస్తవానికి అది లంచమే. బంగారు కానుకలు నాకూ ఇవ్వజూపారు. 'నా ప్రభువు నాకు వేతనం బాగానే ఇస్తున్నారు. మీ సహాయాలు నాకక్కర లేద'ని త్రిప్పి కొట్టాను. ఇది తమ హృదయాంతర్గత భాగాలనుండి వచ్చిన అభిమాన పూర్వకమైన బహుమానమని వత్తిడిచేశారు. దానిపై నేను కటువుగానే అన్నాను. 'అవస

రాన్ని మించిఉంచుకోవడము దొంగకు స్వాగతంపల్కడమే'నని. అప్పటికి వారు వెళ్ళిపోయారు. నాకు తెలుసు వారు మళ్ళీవస్తారని. నిఖిల్! ఈ ప్రపంచములో బంగారాన్ని మించిన గొప్ప వాదపటిమ లేదు. నీకుఅనుమానంతీరకపోతే మన సువర్ణకావ్య ప్రదాత అయిన కవిగారిని అడుగు".

కాళిదాసు అందుకున్నాడు: "నాఅనుభవంకూడా నీవన్నదానిని సమర్థిస్తున్నది. కొద్దిరోజుల క్రితం శ్వేత హూణుల బృంద మొకటి నావద్దకు వచ్చింది. వారి నాయకుడు నాపై బ్రహ్మాండమైన ప్రశంసలు కురిపించ నారంభించాడు: 'ఓమహాకవీ! మీ కుమారసంభవం మాదేశంలో ఎంతో ప్రచారంలో ఉన్నది. ఇంటింటా ఒకప్రతి ఉన్నది' అంటూ. అయితే మీకు సంస్కృతం వచ్చునా అని అడిగాను నేను. మీగ్రంథాన్ని అర్థంచేసుకునేందుకు ప్రత్యేకం చదువుకున్నామని చెప్పాడు కాసేపాగి, 'శ్వేతహూణుల పరాజయంనుండి సూత్రంతీసుకొని మీరు మహాకావ్యం గానంచేశారు. ఈసారి ఆర్యావర్త-శ్వేతహూణులమధ్య మైత్రిని ఆధారం చేసుకొని మరొక మహాకావ్యం వ్రాయండి మహాకవీ!' అని అడిగారు. దానిపై నేను 'మీసూచనకు ధన్యవాదములు. అయితే నాకు ఒక్క అమరకావ్యముచాలు. ఇన్ని భరించలేను' అన్నాను. 'అయితే మరికొందరు యువకవులు ఈప్రయత్నం చేస్తారు' అని హెచ్చరించాడు. 'తప్పకుండా చేయించండి. వారికీ అమరకవు లనిపించుకుందామని ఉంది' అన్నాను. వారు తేలికభావంగా పకాలుననవ్వి ఒక పెద్ద బంగారునాణేల

పెట్టెను నా పాదాలవద్ద ఉంచారు. 'ఏమిటి'దన్నాను. 'ఎబ్బే, ఏమీలేదు. కొంచెం సువర్ణం' అన్నారు తేలికగా. 'నా కెందు కిది? ఆర్యావర్తములోని సువర్ణకావ్యాలు నావద్ద నిరంతరము ఉండగా?' అన్నాను. వారు నవ్వుతూ తిరిగి బయల్దేరారు. 'మీ పెట్టె మరచారు, తీసుకువెళ్ళం' డన్నాను. మళ్ళీ పకపకా నవ్వి పెట్టెను తీసుకువెళ్ళారు. నిఖిల్, నీకింకా సందేహం తీరక పోతే మన సువర్ణసుందరి శీలవతిని అడుగు."

శీలవతి తన అనుభవం చెప్ప నారంభించింది. "ఒక శ్వేత హూణుల బృందం నా వద్దకు కూడా వచ్చింది. ఉజ్జ యిని సంస్కృతి, కళల ప్రతిభను గురించి వా రెన్నో కథలు విన్నారట. వారు ప్రస్తుతము ప్రత్యక్షముగా తెలుసుకొన దలచారట. 'చాలా కాలంగా నాకు వాటితో సంబంధం తక్కువగా ఉన్నద'ని 'వెళ్లి దేవదాసీలను కలుసుకొమ్మ'ని చెప్పాను. దేవదాసీలంటే మత సంప్రదాయాలకు సంబంధిం చిన వారు కనుక అంతగా అక్కడనుండి తెలుసుకొనలేమని చెప్పారు. సామాన్యమానవుని రసపిపాసిగాచేసే మహాకళను తాము తెలుసుకొన గోరుతున్నామన్నారు. 'అయితే మీరు సరియైనవారివద్దకు రాలేదు. నాకళ దైవానికే అర్పితమైనది' అన్నానునేను. 'అయితే మీవిషయం వేరులెండి. మీ దైవము మానవుడేకనుక' అన్నారువారు. 'మళ్ళీమీరు పప్పులో కాలు వేశారు. నాకు మానవుడు దైవమే' నన్నాను. ఈ మొట్టికా యనుకూడ వారు నిబ్బరంగానే స్వీకరించి 'మీరు మా సంగీత నాటకప్రదర్శనానికి విచ్చేస్తారా?' అన్నారు 'నాకు వయసు

మళ్ళింది' అన్నాను. 'మా ప్రదర్శనాలకు వృద్ధులు వస్తార' న్నారు వారు. 'అయితే వాళ్ళు వృద్ధులేకాదు' అన్నానునేను. 'అంటే? పెద్దరికం లేనివాళ్ళనా?' అన్నారువాళ్ళు. 'అబ్బే! కాదు! వారు యువకులవంటివారేననినాభావం' అన్నానునేను. ఇక వారు మెల్లిగా ఒక బంగారు నగలపెట్టె తెరిచారు. 'ఇవి మీకు మా కానుకలు' అన్నారు. 'నాకెందుకు వయసుమళ్ళిన దానికి' అన్నానునేను. దానిమీద వారు స్త్రీహృదయాన్ని జయించడంలో అంతిమాస్త్రం ప్రయోగించారు: 'మీవయ స్సెంతయితేనేమి? ముప్పదిసంవత్సరాల యువతివలె ప్రకాశిస్తున్నారుమీరు' అంటూ. 'నన్ను వదలివేయండి నా చిట్టి మనుమలారా! పూజా పునస్కారాలు చేసుకొనవలసిన సమయమైంది' అన్నాను వ్యంగ్యముగా నేను. అన్నదే తడవుగా బయల్దేరారువారు- పెట్టెనువదలి."

"అయితే ఆపెట్టె ఏదీ అన్నాడు నిఖిలుడు.

"ఆసిప్రానదిలో పారవేశాను. ఓపిక ఉంటే వెదకి తెచ్చుకో"అన్నది.

"బంగారు నగలకు నేను బానిసనా? కవిగారికి వలె నేను కూడా ఒక సువర్ణ గీతికను అల్లగల్గితేనా?..."అంటూ చమత్కరించాడు నిఖిలుడు.

ఆచమత్కారము ఎవరికీ ఆసక్తి కల్గించలేదు. పరిస్థితి అంత గంభీరముగా ఉన్నది. పరిస్థితిని గ్రహించిన నిఖిలుడు వెంటనే "మనరాజ్యానికి మూలస్థంభములైన పుష్యభూతి

సేనాని, ముఖ్యమంత్రి సురపాలుడు ఉన్నంతవరకు మనము భయపడవలసిన పని లేదు" అన్నాడు.

"సురపాలుడు కూడ మెతక పడ్డాడనిపిస్తోంది" అన్నాడు పుష్యభూతి.

"ఘోరము, సురపాలుడు కూడా...." నిఖిలు డడిగాడు దద్దరిల్లిపోతూ.

"అదికాదు సమస్యఅంతా అతనిపుత్రుడు నరపాలునితో వచ్చింది"

"ఆబుడుత డేమిచేశాడు?"

"శ్వేతహూణులను కౌగిలించుకు తిరుగుతున్నాడు."

"అందులో ప్రమాద మేమున్నది?"

"ప్రమాదము వారు ఒలికించే విషములో ఉన్నది. భూమినుండి వేరుపీల్చుకున్న సారం మ్రానుకు, కొమ్మలకు, ఆకులకు, పండ్లకు...కుమారునినుండి తండ్రికి, తండ్రినుండి తాతకు కూడా ప్రాకుతుంది. ఈవిషము నరపాలునినుండి సురపాలునకు ప్రాకింది."

శీలవతిగాని, కాళిదాసుగాని మాట్లాడలేదు. వారికిది అంతా తెలుసు నిఖిలునికి అంతా అయోమయంగాఉంది. పుష్యభూతి మళ్ళీ అందుకున్నాడు: "సురపాలుడు శ్వేతహూణుల విషయంలో తటస్థవిధానం ప్రారంభించాడు. ఈ తటస్థత ప్రమాదానికి పూర్వదశ. అందువల్ల సురపాలునిపై ఆశలంతగా పెట్టుకోవద్దు"

"మహారాజుకు ఇదిఅంతా తెలియదా?"

"హూణుల తళుకు బెళుకులతో ఆయన కండ్లు, చెవులు భ్రమసిపోతున్నాయి. అందువల్ల ఆయనకు అర్థముకావడం అసాధ్యంగాఉంది."

నిఖిలుడు నిస్పృహగా భారత వచనాన్ని గోషిగాడు "హే సంజయా? మనకు విజయావకాశం శూన్యమే నంటావా?" అని. అంతా గంభీరంగా మౌనంగా కూర్చు న్నారు. నడిరేయి దాటిన చిహ్నాలు కానవచ్చాయి. మెల్లగా ముగ్గురూ లేచారు. అందరి హృదయాలలో ఒకే వేదన. శీలవతిమాత్రం కదలకుండా కూర్చున్నది – దూరాన ఉన్న తారకలవంక అరమోడ్పు కన్నులతో దీనంగా చూస్తూ.

౬

శ్వేతహూణులు కొంతకాలముగా మైత్రీ సంధికి సంబంధించి సామ్రాట్టుతో అనేకమైన పరోక్షప్రయత్నాలు చేస్తున్నారు. అసలు మనకథ ప్రారంభమైన దిక్కడ. ఇప్పుడా పరోక్షప్రయత్నాల ప్రసక్తిలేదు. శ్వేతహూణుల నాయకుడు తోరమానుడు సూటిగా దౌత్యవర్గాలద్వారా రాయబారా లారంభించాడు. సామ్రాట్టు మంత్రిమండలిలో ఆలేఖ చదివి వారి అభిప్రాయ మడిగాడు.

పుష్య: "ప్రభూ, మీకు నాఅభిప్రాయము తెలుసుకదా"

బుధ : "మీరు మైత్రీసంధికి అనుకూలురుకాదు"

పుష్య : "వారిఎడ ఉదారతకుకూడా అనుకూలుడను కాను."

సుర: "అయితే మార్గాంతర మేదైనాఉన్నదా ?"

పుష్య: "మార్గాంతరము యథాతధపు స్థితే. రాజకీయముగా ఎలాంటి మార్పులూ లేకపోవడమే సరియైన పద్ధతి."

సుర: "మైత్రి అంటే మీ కెందుకు వ్యతిరేకభావం?"

పుష్య: "యథాతథ పరిస్థితిఅంటే మీ కెందుకయిష్టత ?"

సుర: "దానిలోని సందిగ్ధ స్థితివలన."

పుష్య: "రాజకీయాలలో అంతటి అసందిగ్ధత లుంటాయా?"

సుర: "సందిగ్ధత లేకుండా చూచుకోవాలికదా?"

పుష్య: "ప్రతి సందర్భంలోనూకాదు. అచలత్వము నుండి అకర్మణ్యత పుట్టుకొస్తుంది. అందుండి సోమరితనము, సుఖలాలసత, ప్రమత్తత; చివరకు పతనము దాపురిస్తాయి."

సుర: "అలాకాదు. మైత్రినుండి శాంతి ఉద్భవిస్తుంది. శాంతివుంటే రక్షణావ్యయం తగ్గుతుంది. ఆవ్యయం తగ్గితే

సామాన్యుని జీవన ప్రమాణాన్ని పెంచేందుకు అభివృద్ధి పథకాలు చాలా వేసుకోవచ్చు."

పుష్య: "రక్షణ వ్యయము మరీ ఎక్కువగా తగ్గితే మోతాదుకు మించిన పొదుపు జరుగుతుంది. దానివల్ల విలాస జీవనం తప్ప అధికంగావచ్చేది ఏమీఉండదు."

సుర: "ప్రజాధనం ఎక్కువయితే వారి అభివృద్ధి కార్య కలాపా లెందుకు ఎక్కువకావు?"

పుష్య: "ప్రజాకార్యాలకు ప్రజలు అండగా ఉన్నపుడే అభివృద్ధి కార్యకలాపాలకు శాసకత్వం వస్తుంది. కరుడు కట్టిన పరిస్థితులువస్తే ఈఅభివృద్ధి కార్యక్రమాలను కోరే దెవరు?"

బుధ: "ఈ శాంతిసంధివల్ల కనీసం యుద్ధప్రమాద మయినా నివారణ అవుతుందికదా?"

పుష్య: "ప్రభూ! యుద్ధ మొక్కటేనా ప్రమాదం?"

బుధ: "లేకపోతే హూణులు మైత్రికై అంత తహ తహ ఎందుకుపడుతున్నారు?"

పుష్య: "అసలుప్రశ్న అదే. వారి ఆతృతవెనుకఉన్న ఆలోచన ఏమిటనేదే?"

బుధ: "మీరేచెప్పండి సేనాపతీ"

పుష్య: "పశుప్రవృత్తి అణగడానికి సైనికమైన ఘోర పరాజయం ఒక్కటే చాలదు. హింస, క్రౌర్యం అనేక రూపా లలో వ్యక్తమవుతుంటుంది. యుద్ధంలో చావుదెబ్బతిన్న

శ్వేతహూణులు నేడు మైత్రీసంధిఅనే ఎత్తుగడ నెత్తారు. రాజ్య లౌక్యపు స్నేహమంటే మారువేషంలోని శతృత్వమే.”

బుధ. “చూడండి! హూణవర్తకులు మనమధ్య చాలా కాలంగా ఉంటున్నారు. వారు కూరులనే సూచన లేపీ కాన రావడంలేదు. ఎంత వినయ విధేయతలు! ఎప్పుడూ స్వాగత పురస్సరమైన చిరునవ్వుతోనే ఉంటారు.”

పుష్య: “నిజం మహారాజా. సూర్యకాంతిలో మెరిసి పోయే నిశితఖడ్గపు నిశితత్వమే ఆ చిరునవ్వు.”

బుధగుప్తుడు మిగిలిన మంత్రులవైపు తిరిగాడు. అధిక సంఖ్యాకులు మైత్రీసంధికి అనుకూలించారు. సేనాపతి, మరి యిద్దరు ముగ్గురు అనుభవజ్ఞులుమాత్రం యథాతథపు స్థితిని అనుకూలించారు

“అధికసంఖ్యాకులు మైత్రీసంధి ననుకూలిస్తున్నారు సేనాపతీ” అన్నాడు బుధగుప్తుడు. పుష్యభూతి ఏమీ మాట్లా డలేదు. “శ్వేతహూణుల ప్రతిపాదన నంగీకరిస్తున్నా”నని మహారాజు బహిరంగ ప్రకటనచేశాడు.

సేనాపతి లేచాడు: “మహారాజా! నేను చాలావృద్ధుడ నైనాను. ఉద్యోగవిరమణకు నాకు అనుజ్ఞఇవ్వండి” అన్నాడు.

బుధగుప్తుడు కోరుతున్నదికూడా అదే. పుష్యభూతి సేవలను చాలప్రశంసించాడు. కాని ఉద్యోగములో ఉండమని మాత్రం కోరలేదు. పుష్యభూతి సెలవుతీసుకున్నాడు. సమా వేశము ముగిసింది.

స్వచ్ఛందముగా పదవీ విరమణచేసిన సర్వసేనాపతి మరునాడు ఉదయం నగరమువీడి వెళ్ళనున్నాడు. కడసారిగా నల్గురు రాజ్యశ్రేయోభిలాషులూ శీలవతి ఇంట్లో కలిశారు. సముద్రగుప్త, కుమారగుప్త, స్కందగుప్తుల పరిపాలనా వైభవమును బాగా తెలిసినవారిలో సజీవులై ఉన్నవారు కాళిదాసు, పుష్యభూతి, నిఖిలుడు, శీలవతి— ఈ నలుగురే.

మిత్రుని పదవీ విరమణను ప్రస్తావనకుతెచ్చి నిఖిలుడు "ఉజ్జయిని భాగ్యలక్ష్మికూడా ఈ ద్వారమునుండే విరమిస్తున్నట్లున్నది" అన్నాడు.

కాళి : "ద్వార మెప్పుడూ ఒకటే. 'ఈ' ద్వారము, 'ఆ' ద్వారము అనేవి లేవు. లక్ష్మి ఒకే ద్వారం నుండి వెలికి నడుస్తుంది"

నిఖి : "ఆమెను నిలిపే మార్గమే లేదా ? "

కాళి : "ఆమె చెప్పకుండా వెళ్ళిపోతుంది. ఆమె వెళ్ళేటప్పుడు తన సింహాసనముపై బంగారుపూత వదలిపోతుంది. దానినిచూచి సామాన్యులు లక్ష్మి అక్కడ ఉన్నట్లే భ్రమిస్తారు."

శీల : "మీరెక్కడకు వెళ్తున్నారు పుష్యభూతీ ?"

పుష్య : "నేను చెప్పలేను. ఈరాజ్యాన్నిదాటి ఎక్కడికైనా వెళ్ళవచ్చు. ఏదైనా నదిప్రక్కన ఒక ఏకాంత ప్రదేశము నాకు శాంతి నివ్వవచ్చు."

కాళి : "అది చక్కని ఊహ. నగర రక్షకుడు సింధు నదిలోని రక్షణ కేంద్రములో నివసిస్తాడు."

పుష్య : "మీరన్నదే నిజం కావచ్చు. ఆ ఏకాంత స్థానములోనే నేనుండవచ్చు."

కాళి : "మహాకాళేశ్వరుడు ని న్నెలా ఉపయోగించు కొన నున్నాడో ఎవరికి తెలుసు ? నీవు ఏమాత్రమూ ఉపయో గించనంత వృద్ధుడవు కాలేదు."

పుష్య: 'కాని నేనీ ప్రాపంచిక జీవనమునుండే విర మించి సన్యాసిని కావలచాను"

కాళి:"రాజ్యరక్షణకు సన్యాసియే కావాలని నేను గట్టిగా చెప్పగలను. మహాకాళేశ్వరుడు ఒకచేత శాంతిపుష్పాన్ని, మరొకచేత త్రిశూలాన్ని ధరిస్తాడు"

పుష్య: " కాని నేను వృద్ధుణ్ణి, శక్తిహీనుణ్ణి అయి నానుకదా?"

కాళి: "మహాకాళేశ్వరుడు కూడా పసిపాపకాదుగా?"

పుష్య: "మీరు ముగ్గురూ ఇక్కడే ఉండండి"

కాళి: "తప్పకుండా. నేను బ్రతికున్నంత కాలమూ మనస్సులుకలిసే ఈస్థానానికి వస్తూనే ఉంటాను. ఈ మహా సామ్రాజ్య ఉత్థాన పతనాలనుగురించి, దాని చరిత్ర గతిని గురించి ఇక్కడ మాట్లాడుకుంటూనే ఉంటాము."

పుష్య : "మీా రఘువంశ మహాకావ్య రచనను మాత్రము మానకండి"

కాళి : "అదికూడా ఒక మహాసామ్రాజ్య ఉత్థాన పతన గాథేకదా !"

పుష్య : "మీా కావ్యగానమును వినే భాగ్యము నాకు ఉండదుకదా !"

కాళి : "సార్థకమయే జీవితం నీకు ఇంక చాలా ఉన్నది"

పుష్య : "ఏక్షణాన ఎలా ఈజీవితం ముగిసిపోతుందో ఎవరూ చెప్పలేరు"

కాళి : "సందేహ మక్కరలేదు. ఉజ్జయిని జ్యోతిని మళ్ళీ దర్శించేందుకు నీవు జీవించేఉంటావు. సరియైన సమయము వచ్చినప్పుడు మహాకాళేశ్వరుడు తన ఉత్తమసేవకుని మరచిపోడు."

పుష్య : "మిత్రమా! చాలాసేపు మాట్లాడుకున్నాం. ఇక నాకు సెలవిప్పించండి."

నల్గురు మితులూ పరస్పరము సెలవుతీసుకున్నారు. ఆకాశములో ప్రకాశవంతమైన నక్షత్ర మొకటి ఆ చీకటి సముద్రములో ఇటునుండి అటు వెళ్ళింది

పుష్యభూతి వేకువనే నియమితలగ్నములో లేచాడు. మహాకాళేశ్వరునికి ప్రార్థనలు జరిపాడు. సైనికవేషము ధరించి

గుఱ్ఱముమీంద ఒక్కసారి నగరములోనికి వెళ్ళాడు. నగర మింకా నిద్రలేవలేదు. మహానగర సింహద్వారమునుదాటి వెళ్ళాడు. రాజవీధిన పయనిస్తూ ఒక్కసారి వెనుదిరిగి చూచాడు- తన ప్రియతమమైన సర్వస్వాన్ని. ద్వారముపైనున్న సింహకేసరములు, అప్పుడే ఉదయిస్తున్న సూర్యకిరణములతో కలిసిపోయినాయి. సింహద్వారముపైనున్న సముద్రగుప్తుని వైభవ చిహ్నమైన విజయభేరి నొకసారి చూచాడు. గుప్తరాజుల విజయోత్సవ సమయములలో వినవచ్చేఆవాద్యధ్వనులు స్మరణకువచ్చాయి; ఆ భేరీనాదాలు శత్రుహృదయాల నెలా ఛేదించేవో! సైన్యాలు విజయలక్ష్మితో తిరిగివచ్చినప్పుడు వినవచ్చే ఆనాదాలు ఎంత ఉత్తేజం కల్గిచేవో! విజయ వార్తలను పురజనులకు ఎన్నిసార్లు అందించినదో ఆ భేరీ! సామ్రాట్టుకు విజయఘోషలు పలుకుతూ విజయలక్ష్మితో విచ్చేసే వీరులకు ఎన్నిమారులు స్వాగతం పల్కిందో !... వేయితలపులు పుష్యభూతి మనసులో మెదలాయి. తరతరాల వైభవాన్నిచాటే ఆభేరీ నేడు బూజువారి, దుమ్ముకొట్టుకొనిపోయి, నిర్లక్ష్యం చేయబడి, విశ్వాస రాహిత్యానికిగురియై మూలపడిఉన్నది! బాల్యమునుండి సైనికుడుగా ఉండి, అనేక అనుభవాలతో పండిపోయిన పుష్యభూతి భావావేశంతో ఒక్కసారి ఉక్కిరిబిక్కిరయినాడు. ఒక్కసారి కండ్లు తుడుచుకొని, చరిత్రకు కట్టిన ఆ సమాధిస్థానంనుండి దూసుకుపోయినాడు. ఆతని అశ్వము ఉరకలు పరుగులుతీస్తూ అస్పష్టమైన భవిష్యత్తులోనికి అతడిని తీసుకు వెళ్ళింది.

౧౦

సర్వసైన్యాధిపతి పదవీవిరమణతో మైత్రీసంధికి సంబంధించిన రాజకీయ తతంగము త్వరితముగా పూర్తయి పోయినది. నగరములో శ్వేతహూణుల ప్రభావము ప్రమాదకరముగా పెరిగిపోయినది. వీటన్నిటిని మించి ముఖ్యమంత్రి సురపాలుని పుత్రుడగు నరపాలునికి సర్వ సైన్యాధి పత్యము కట్టబెట్టబడినది. ఇది విదేశీయులకొక వరప్రదానము మొదటి నుండి నరపాలుడు శ్వేతహూణులకు అనుకూలుడే. అతడి ప్రభావము తండ్రిమీదకూడా పడినది. దీనితో ప్రభుత్వసైన్య పౌరశాఖలన్నిటిపైన హూణుల ప్రభావము ఏర్పడినది. ఇక సన్నకారువారంతా గాలివాటు పురుగులు తమ మాతృభాష సరిగా రాకపోయినా, బాక్ట్రియన్ భాషలో పాఠాలు నేర్చుకొన నారంభించారు. గురు శిష్యులు సన్నిహితులుగా ఉండాలి కదా! అందువలన నగరములోని మేధావర్గానికి హూణులు సన్నిహితంగా చేరారు. సాయంత్రమువేళలందు ఈ సజ్జనులంతా హూణగురువుల ఇండ్లకు చేరేవారు. వారిభాష, ఆచారములు, సాంప్రదాయాదులకు సంబంధించిన పాఠములు వల్లె వేసేవారు. తమ నాగరికతా ఆధిక్యాన్ని గురించి వారు చెప్పే డంబములను నోరు తెరచుకు వింటుండేవారు వారు, తమ దేశములో ప్రతిపౌరుడు ఒక వీరు డనేవారు. తమ దేశములోని ప్రతి స్త్రీ అందానికి అప్సరస, గానానికి సరస్వతి అనేవారు. ఈ పాఠాలన్నీ మంచి కట్టుదిట్టములతో, మంచి ప్రదర్శనము

లతో కూడా నేర్చారు. వీటిని మహా ఆతృతతో నెమరు వేసే వారు ఈ 'సజ్జనులు'.

నగరములో తిష్టవేసిన హూణబృందానికి నాయకుడు బకునాశుడనే ఒక వృద్ధ జంబుకము. పైకి అతడూ ఒక మామూలు వ్యాపారియే; హూణులందరికివలె ఎంతో 'మంచి' వాడుకూడా. అందముగా అలంకరించబడిన తన దుకాణములో తన మాతృదేశపు వస్తువులను అమ్మజూపుతూ కూర్చునేవాడు రోజూ. అతిమధురభాషి; బహుసరసుడు; ఎంతో కలుపుగోలు తనముకలవాడు; దానశీలిగా కనిపించేవాడు. ఎంత అల్పలక్ష్యమునకైనా భూరివిరాళా లిస్తుండేవాడు. ఈ ప్రకారం దాన ధర్మాలు చేస్తే "మరిమీకు భోజనము ఎట్లా" అని ఎవ రైనా అడిగితే "మీచలవ ఉంటే మా కదేచాలు. పైగా ఈ దేశములో మేము సంపాదించిన దానిని ఈ దేశీయులకోసము వాడడమే మాకు న్యాయము" అని చెప్పేవాడు.

ఈ శ్వేతహూణుల ఆదాయ వ్యయాలను పరిశీలించే కష్టమును ఎవరూ పడవలచలేదు. ఆపని ఎవరైనా చేస్తే, వారిచ్చేవిరాళాలు, లాభాలను మించిపోయినవిషయం స్పష్టపడేది. దానిమీద ఇంకాఅనేకవిషయములు వెలికివచ్చేవి. వీరిముందు స్థానిక వ్యాపారులు క్రమంగా జీర్ణించ నారంభించారు. పెద్ద వ్యాపారులు అప్పులపాలయి పోయినారు; సన్నకారువారు దుకాణములు మూయ నారంభించారు. స్వస్థానములోనే వారికి తరతరాలవ్యాపారాలకు తిలోదకా లివ్వవలసినస్థితి వచ్చినది. ఇక తమ 'పని' ముగిసిందనుకున్నారు. చివరకు హూణు

లలో 'ఉత్తముడై'న బకునాశుడివద్దకే వెళ్ళి మొరపెట్టు కున్నారు.

"అయ్యో! అంత ఘోరము జరుగుతున్నదా?" అంటూ సానుభూతితో అదిరిపడినట్లు నటించాడు బకు నాశుడు "మా దేశములో వ్యాపారులకు ఇలాంటి దుస్థితి వస్తే ప్రభుత్వమే వారి నాదుకొని అన్నిరకాల ఆర్థికసహా యము చేస్తుంది" అన్నాడు. అసహాయస్థితిలోఉన్న వర్త కులు "ఔ"నంటూ తలలూపి "మా దేశములో అలాంటి దేమీ లేదుగా" అని ఖేదపడ్డారు. బకునాశుడు భేదోపా యాన్ని మరింత తీవ్రంగా ప్రయోగించాడు "మీ ప్రభుత్వం మిమ్మింత నిర్లక్ష్యముగా వదలివేస్తే మీరు నాసహాకారం మీద ఆధారపడవచ్చు. నాకు కొంతమంది అనుభవజ్ఞులైన ఉద్యోగులు కావాలి. మీరు ఇష్టపడితే చాలు."

మార్గాంతరములేని ఆ విక్రయ కళా పారంగతులు ఆ విదేశ సంస్థలో ఉద్యోగులుగా చేరారు! దిన దిన గండ ముగా గడిచే తమ వ్యాపారములకన్న ఇదే ఎక్కువ సుఖ ముగా ఉన్నదనుకున్నారు. తమ యజమానులుకూడా చాలా దయాళువులుగా ఉన్నందుకు ఎంతో ఆనందించారు. 'అబ్బ! తేనె, పాలు ప్రవహించే ఆబాక్ట్రియా రాజ్య మెలాఉంటుందో కదా!' అనిపించేది వారికి. వారి ఆశలు, స్వప్నాలు అన్నీ నేడు దానిమీదనే కేంద్రీకృతమైఉన్నాయి! "మన రాజు నత్తి సిరర్ధకుడు బాల్హిక్ నిజంగా మనం ఉండడానికి తగిన రాజ్యమై ఉండాలి" అనుకుంటుండేవారు అంతరాంతరాళాల్లో.

ఒక ఉదయం బక్షునాళుడు ఇన్ని బంగారు నాణేలు, కానుకలు తీసుకుని మహాకవి నివాసానికి వెళ్లాడు. కాళిదాసు కానుకలను నిరాకరించి "ఎందు కిలా బహుమతు లివ్వ జూప్తున్నావ"ని ప్రశ్నించాడు "బాల్హిక్ – ఉజ్జయిని మైత్రిపై మీరొక్క కావ్యమును సృష్టించవలసిందిగా కోరుతున్నాను" అన్నాడు బక్షునాళుడు.

"క్షమించండి, వృద్ధుణ్ణి, బలహీనంగాఉన్నాను. మీ కోరిక తీర్చలేను" అన్నాడు కాళిదాసు.

మరునా డుదయం అంతకుమించిన కానుకలతో మహారాజును సందర్శించాడు బక్షునాళుడు. లాంఛనాదులన్నీ పూర్తయినతర్వాత వచ్చినపనిని గూర్చి అడిగినాడు మహారాజు.

"మహారాజా! ఉజ్జయిని- బాల్హిక్‌ల మైత్రికిసంబంధించిన ఒకనాటకాన్ని తమముందు ప్రదర్శించదలిచాము.. తమ అనుజ్ఞఅయితే."

"నాటకమా? ఎవరువ్రాశారు?" ఆశ్చర్యముతో అడిగాడు మహారాజు

"మన యువకవి పుండరీకుడు ప్రభూ" వినయ ముట్టిపడుతూ సమాధానమిచ్చాడు.

"పుండరీకుడు రచయితఅని నాకు తెలియదే! వీధుల్లో తిరిగి రాజశాసనాలను ప్రజలకు చదివి వినిపిస్తుండే పుండరీకుడేనా?"

"అతడే ప్రభూ! ఆవర్ధమానయువకుడే నేడు మన

ఉభయదేశముల మైత్రీ సందేశాన్ని వినిపిస్తున్నాడు. అతి రమ్యమైన నాటకాన్ని రచించాడు మహారాజా!"

ఉజ్జయినీనగరవాసులైన హూణులు స్వల్ప కాలంలో స్థానికభాషను చక్కగా చాలా పట్టుదలతో నేర్చుకున్నారు. హూణభాషను ఉజ్జయినీవాసులు అలా నేర్చుకొనడం జరగ లేదు. వారి హూణ భాషా పాండిత్యమంతా "పిల్లి, ఎలుక"ల దగ్గరే ఉన్నది.

"మీనాటకముపేరు?" సామ్రాట్టు అడిగాడు.

"తెల్లగలువ లేక శ్వేతపుష్పము"

"చక్కని పేరు" అన్నాడు మహారాజు.

"నాటకము అంతకన్న చక్కగాఉంటుందిమహారాజా"

ఒకానొకనాడు యువకవి పుండరీకునిచే రచియింపబడిన శ్వేతపుష్ప మహానాటకము మహారాజు దివ్యసమ్ముఖమున ప్రదర్శింప బడినది. రచన అంతా గ్రంథ చౌర్యముగా ఉంది ముప్పాతిక భాగము కాళిదాసు నాటకములనుండి సంగ్రహించినబాపతు. మిగిలిన పాతిక వంతు కుంటుకుంటూ నడిచే కవిత్వం—బాక్ట్రియన్ రాజ్యాన్ని స్తోత్రంచేస్తూ !

కూర్చున్నవాళ్ళు చాలామంది చప్పట్లు చరిచారు. నాట కానికి రానివాళ్ళు దాని గొప్పతనాన్ని గురించి మరీ గొడవ చేశారు. "బలే, బలేయువకవీ! పుండరీకా! బాలమేధావివి. మన ఈ వృద్ధ వాయసగాళ్లను గట్టిగా నొక్కావు" అన్నారు నల్గురూ.

బక్షనాశుడు క్షణము వృధాచేయలేదు. మహారాజును సమీపించి ప్రజానురాగం చూరగొన్న ఈవర్ధమానమహాకవిని ఆస్థాన కవిగా నియమిస్తే బాగుంటుందని ఉపదేశం చేశాడు.

"మహాకవి బ్రతికిఉన్నంత కాలం ఆయనే ఆస్థాన కవిగా ఉంటాడు" అన్నారు మహారాజు అయితే పుండరీకునికి కూడా ప్రయోజనము జరగకుండా పోలేదు. బక్షనాశుడు పుండరీకుని విషయము యువరాజు పురగుప్తునికి చెప్పాడు. పుండరీకు డతని అంతరంగికుడైనాడు. పురగుప్తుడు శ్వేత హూణుల సాంస్కృతిక సమాజమునకు ప్రధాన అభిమాని.

యువకవి అసూయాపరులు తమలో తాము సణుగుకొన నారంభించారు: "ఆస్థాన కవిగా నిర్ణయింపబడకపోయినా పుండరీకునికి పురగుప్తుని ప్రాపు లభించినది" అని.

అయితే పుండరీకుడు వట్టి మందమతికాడు, మూఢ ప్రజాభిమానంమీద ఆధారపడితే ఎక్కువ ప్రయోజనం లేదని అతడికి తెలుసు. కాళిదాసు బహిరంగముగా తనను గూర్చి ఘనముగా ప్రకటించేవరకు భారత కవి శేఖరుల శ్రేణిలో అతనికి స్థానము లభించదు. అందువలన మెల్లగా పిల్లిలా కాళిదాసు నివాసానికి వెళ్లాడు. అది సాయంవేళ. మహాకవి తోటలో కలుపు తీస్తున్నాడు. పుండరీకుడు మహాకవికి మహా వినమ్రతతో ప్రణామ మాచరించాడు.

"ఏదో పనిమీద వచ్చినట్టున్నావు?" అన్నాడు కాళిదాసు.

"మహాకవి ఆశీర్వచనాన్ని అభ్యర్థిస్తున్నాను" అన్నాడు పుండరీకుడు వినమ్రత ఉట్టిపడేలా.

"నన్నే ఆశీర్వదించగల ప్రతిభాశాలివి. నిన్ను నే నాశీర్వదించడమా"?

"పాపము శమించుగాక! మీ నోటినుండి అలాంటి వాక్కులు వినడంకూడా మహాపాపము మహాకవీ"

"అయితే నీకు పాప పుణ్య విచక్షణకూడాఉన్నదా?"

విషయము మార్చేందుకై పుండరీకుడు "నాకలం మీ అభిమానానికై అభ్యర్థిస్తోంది" అన్నాడు.

"నేను నీకలాన్నే అభ్యర్థించాలనుకుంటున్నాను"

"మీ రలా ఎందుకంటున్నారండీ?"

"ఈ కలం పుత్తీయడానికి ఎంత ఇబ్బంది పడుతున్నానో చూడు! నీకలమేఇస్తే ఇంత ఇబ్బంది ఉంటుందా?"

పుండరీకుడికి బాకులాతగిలింది. అయినా కోపాన్ని అణచుకున్నాడు. "నేను రచించిన శ్వేతపుష్పనాటకాన్నిగురించి తమ అమూల్యాభిప్రాయం సెలవిస్తారా?"

"నా రచనమీాద నేనే ఎలా వ్యాఖ్యానిస్తాను? నీ రచన చౌకబారు గ్రంథ చౌర్యం. కుమారసంభవములోని భాగాలతో నీ నాటకాన్ని నింపివేశావు. నాకీ శిక్ష పడనున్నదని ఆ కావ్యం వ్రాసేటప్పుడు నాకేం తెలుసు?" అన్నాడు.

పుండరీకునికి పట్టరాని కోపంవచ్చింది. ముఖం కంద

గడ్డచేసుకుని మారు మాట్లాడకుండా వెళ్లాడు. కాళిదాసు మళ్లీ తోటపనిలో నిమగ్నుడై పోయినాడు.

*   *   *   *

పుండరీకుడు తిన్నగా బక్షునాశుడి వద్దకు వెళ్ళాడు. "నాకో ఆలోచన వచ్చింది" అన్నాడు.

"తప్పక చెప్పండి" తా నందుకే సిద్ధముగా కూర్చుని ఉన్నట్లుగా అన్నాడు బక్షునాశుడు.

"శ్వేత హూణులతో స్నేహము విషయములో మేము చాలా కష్టపడుతున్నాము కదా! మా ప్రయత్నా లన్నిటినీ ఆ కుమారసంభవకావ్యం వమ్ముచేస్తోంది."

"ఎందువల్ల?"

"ఆ కావ్య పరమార్థం స్కందగుప్తుని చేతుల్లో శ్వేత హూణులు పొందిన పరాజయాన్ని వర్ణించడమేకదా! ఈ పాతకథ మన మైత్రీసంధికి భంగకరంకాదా!"

"అవుననుకోండి. కాని దానికి పరిష్కారమార్గమేమిటి?"

"ఆ గ్రంథ నిషేధానికి చర్యలు తీసుకోవాలి"

"అద్భుతం యువకవీ! అద్భుతం! మీరు భవిష్య ద్దాస్థానకవిమాత్రమేగాక, అద్భుత రాజనీతిజ్ఞులుకూడా. అయితే ఆ గ్రంథాన్ని మన మెలా నిషేధించగలం?

"సామ్రాట్టుకు విజ్ఞప్తిచేసి చూద్దాం"

"అందుకు సమయ మింకా పరిపక్వం కాలేదు."

"అయితే యువరాజును సంప్రదిద్దాం"

"ఆఁ. అది మంచి ఆలోచన"

ఒక మంచి సమయం చూచి బక్షనాశుడు యువ రాజుకు తన మొర వినిపించాడు. తనసూచనకూడా చల్లగా చొప్పించాడు. ఆ క్రిందటిరోజే బక్షనాశుని నుండి అనేక బహుమానాలు పొందిఉన్న యువరాజు ఆ మొర నాలకించి, చాలా తెలివిగా "మీరు ఈ విషయాన్ని నాదృష్టికి తేవడంతో, దీని వెనుకనున్న మానవసహజమైన బాధను ఊహించగల్గుతున్నాను" అన్నాడు

ఆయనగారి ఆజ్ఞలతో ఆయన బంధుమిత్రులలో కుమారసంభవ పఠనము నిలిచిపోయింది. దానికి బదులు శ్వేతపుష్ప పఠనము ప్రారంభమైంది.

ఈ విషయాన్ని నిఖిలుడు కాళిదాసు దృష్టికి తెచ్చే సరికి ఆయన "శ్వేతపుష్పాన్ని చదివే వారంతా నా గ్రంథాన్ని చదువుతున్నట్లే. నాకు బాధ ఎందుకు?" అన్నాడు.

ఉబ్బిపోతున్న పుండరీకుడు ఒకసారి ఊరంతా తిరిగి వచ్చాడు "కుమారసంభవపురోజులు మారాయి. దాని అంతు తేల్చాను" అంటూ మిత్రులతో ప్రగల్భాలు పలికి వచ్చాడు.

"మేము ముందే అనుకున్నాం. నీవు నిజంగా తారకాసు రుడివి" అంటూ ఇంకా స్త ఉత్సాహపరచారు అతని అభి మానులు. జీవితంలో ఒక్కొక్కప్పుడు మహా ప్రశంసలు కూడా నిశితమైన వ్యంగ్య విమర్శలుగా ధ్వనిస్తాయి.

రోమని విద్యా విజ్ఞాన పారంగతురాలైన యువతి. స్త్రీసహజమైన సొంపు, సౌందర్య, సౌకుమార్యాదు లన్నీ ఆమెసొత్తు. ప్రియభాషిణి. ఎవరినైనా ఇట్టే ఆకర్షించగల చతుర. శృంగారకళకు ఆమెది పెట్టినపేరు. భోగవిలాస వాతా వరణం మధ్యన ఉండి, తనకంటబడిన ఎవరినైనా కట్టివేయగల అద్భుత ప్రజ్ఞాశాలి. నగర మధ్యప్రాంతములో సైబల్ తటాకం ఒడ్డున బ్రహ్మాండమైన భవనం మణికుటీరంలో ఆమె నివాసం. రాజభవనము, యువరాజభవనముల తర్వాత నల్గురూ చెప్పు కొనేది ఈ సుందరభవనమును గురించే. పగలంతా ఉన్నతాధి కారులు, రచయితలు, కళాకారులు అక్కడికి వస్తూ పోతూనే ఉంటారు. రాత్రివేళ మరీ ప్రత్యేకమైన ముఖ్యులు వస్తూ పోతుంటారు. అందులో యువరాజుకూడా ఒకరు. ఆమె ఉజ్జయినీ మహానగర యువరాజుకు ముఖ్యమైన అభిమానిత అంటే ఆమెకు ఆరాజ్యములో ఎలాంటి స్థానమున్నదో ఊహించుకోవచ్చు.

శ్వేతహూణులతో మైత్రీ సంధి జరుగగానే పుష్యభూతి పదవీ విరమణము, ఆవెంటనే ఒక శ్వేతహూణ ప్రతినిధివర్గ ముతో రోమని ఉజ్జయినికి రావడం జరిగింది. ఇప్పటికి నగర వాసులు హూణుల వైభవయుత జీవనాన్ని చూడడానికి అల వాటు పడిపోయినా, ఈమె వైభవమును చూచి చకితులై పోయినారు.

"బాక్ట్రియనుల రాజ్యము నిజంగా దేవుని సువర్ణాగారమై యుండాలి" అనుకున్నారు. మామూలుగా బక్షునాశుడే ఆమెను నల్గురికీ పరిచయం చేశాడు. యువరాజు ముందుకూడా ప్రవేశపెట్టాడు. ఆయనకోసం ఆమె ఎన్నెన్నో అమూల్యములైన కానుకలు, సువర్ణాభరణాలు, కళాఖండాలు ప్రత్యేకంగా తీసుకుని వచ్చింది.

"యువరాజా! బాక్ట్రియా సంస్కృతికి మహారాణి మీ ఎదుట నిలచిఉంది. మీ అభిమానాన్ని ఆమె అపేక్షిస్తోంది" అన్నాడు బక్షునాశుడు.

"ఆమె ఘనతనుగూర్చి ఆముఖంలోని కళే చెప్తోంది. వేరే పరిచయ మెందుకు?" అన్నాడు యువరాజు ప్రశంసాపూర్వకముగా. కొద్దిక్షణాలలో మణికుటీరము శుభ్రము చేయించాలని ఆజ్ఞ అయింది.

పురజనులలో కాస్త ఆలోచనాపరులు ఆలోచనలో పడ్డారు. "ఈహూణు లెక్కడ నివసిస్తుంటారు? సరియైన అదను చూచి రంగంమీదికి వచ్చి సర్వమూ భుక్తం చేసుకుంటున్నారు. వేడిగా ఉండగానే టంకం వేస్తున్నారు!" అని ఆశ్చర్యపడసాగారు.

ప్రజలు వీరిని గురించి ఎలా అనుకుంటేనేం? ప్రజల భావాలు చరిత్రగతిని మార్చలేవు. అది తనత్రోవన తాను, వీటిని పట్టించుకోకుండానే వెళ్ళిపోతోంది!

సిప్రానదీతీరాన ఉన్న లక్ష్మీనారాయణ మందిరము ఇటీవలనే నిర్మించబడినట్టిది. ఆలయానికనుకునే ఆలయ దేవదాసీల నివాసము ఉన్నది. వారంతా సౌందర్యానికి, కళా ప్రతిభకు పేరెన్నికగని, దక్షిణభారతంనుండి రావింపబడినట్టి వారు. దాదాపు ఒకవందమందివరకు ఉన్నారు. వారందరి లోను ఉత్తమ సౌందర్యవతి, ప్రతిభాశాలి మధువల్లరి. ఆమె వీరందరికి నాయకురాలు. మధువల్లరి పేరు వినగానే ఉజ్జయిని మురిసిపోతూ ఉంటుంది. నాయకత్వానికి అన్నివిధాల ఆమె అర్హురాలే. ముఖ్యమంత్రి సురపాలుడు ఆమె ముఖ్య అభి మాని. ఆయనతోపాటు ఎందరెందరో పౌర, సైనికాధి కారులు ఆమె నభిమానిస్తుండేవారు. నిరంతరమూ ఆమె నభినందిస్తూ చుట్టూ తిరుగుతుండేవారు. బహుమానాలు, కానుకలుపంపి, ఆమెదృష్టిని ఆకర్షించడానికి తాపత్రయ పడు తుండేవారు. ఒక్కముక్కలో ఉజ్జయినీ ఉన్నతాధికారులు, మంత్రులు, కళాకారులు మున్నగువారందరికి దేవదాసీ నివాస మొక సందర్శనకేంద్రము. మధువల్లరి నివాసం మరీ ముఖ్య మైన కేంద్రము.

విద్యా విజ్ఞానవతులైన మహిళామణుల ప్రభావము ఉజ్జయినీనగరవాసులకు బాగా తెలుసు. కొద్దికాలముక్రితం అదే స్థానములో శ్రీమతి శీలవతి ఉండేది. ఇప్పుడు వార్ధక్యము వచ్చినతర్వాత ఏకాంతముగా దైవసేవలో గడుపుతోంది. ఆమెకు ప్రచారముమీద అభిలాషకూడా లేదు. మహాకవి కాళిదాసు, సైన్యాధిపతి పుష్యభూతి, ప్రఖ్యాత సాహిత్య

విమర్శకుడు నిఖిల్ - ఇలా కొద్దిమంది పూర్వపరిచయస్థులు ఆమెవద్దకు వెళ్ళివస్తుంటారు.

శీలవతి తర్వాత ఆస్థాన మాక్రమించి, మహాకాళుని అభిమానానికి పాత్రురాలైన మధువల్లరికి ఉజ్జయినీ పౌరుల హృదయాన్ని చూరగొనడం ఏమంత కష్టంకాలేదు. శీలవతి దేవదాసీత్వమునుండి విరమించినందున, మరెవరి పోటీ లేనందున, కళాసామ్రాజ్యానికి మధువల్లరే రాణిగా ఉండేది. రాజాస్థానములోని ప్రతి అధికారి, ఆమె చిరునవ్వును సంపాదించగల్గితే తనవృత్తి ఉద్యోగాలలో అభివృద్ధి సాధ్యమనుకుంటుండేవాడు. ఆమె నొక్కసారి ఆకర్షించగల్గితే చాలు ప పౌఃనికైనా సంచులు బంగారు నాణేలతో నిండుతాయనే భావమే. అసలు సామ్రాజ్యపు బంగారు నాణేల ముద్రణాలయం ఆమె సన్నని పెదవులే అనుకునేవారు చాలామంది. ముఖ్యమంత్రే స్వయముగా ఆమెకు అంతగా దాసోహమనేవాడు.

ఇలాంటి స్థితిలో దిగినది రోమని. దిగి, యువరాజు నాకర్షించింది. మధువల్లరికి కాస్త గిజాటయింది. ఒకరికొకరు పోటీగా తారసపడ్డట్లయింది. ఒకరినొకరు కొరకొర చూచుకునేవారు. సమయం చిక్కితే ఒకరినొకరు అధఃపాతాళానికి త్రొక్కివేయాలనుకునేవారు.

ఒకరోజున మణికుటీరంలో బక్షునాశుడు, రోమని, యువరాజు పురగుప్తుడు సమావేశమైనారు.

"రోమనీ! మీదేశంలో అబ్బ! ఎంత సౌందర్యం ఉన్నది!" అన్నాడు పురగుప్తుడు.

"మీ ప్రశంసకు నేను చాలా కృతజ్ఞురాలిని యువరాజా! కానీ ఈప్రశంస—సౌందర్యము నాస్వాదించగల మీ కనులకు చెందాలి!"

"ఘనత కన్నులకుమాత్రమేకాదు"

"ఎందువలన ?"

"చూడు! మేము మాట్లాడితే మానోటినుండి మాటలై తేవస్తాయిగాని వాటిలో మాధుర్యం ఉండదు. కాని నువ్వు మాట్లాడితే మధురసంగీతం ధ్వనిస్తుంది.

"అందుకు సున్నితమైన మీ శ్రవణేంద్రియాలను అభినందించాలి!"

వారు పకపక నవ్వుకున్నారు. ఇప్పుడు హూణుల నవ్వులోకూడా వింతసోయగాన్ని కనిపెట్టాడు యువరాజు. ఆమెకోసం అలా అలలలలుగా గదినంతా మల్లెవాసనలతో నింపివేసినట్లనిపించింది యువరాజుకు.

యువరాజుకు బాక్ట్రియనుభాషలో ఒక్క అక్షరమైన రాదు. కాని రోమనిమాత్రం చాలా కష్టపడి ఉజ్జయిని భాషను నేర్చుకొనడానికి ప్రయత్నిస్తోంది. వచ్చీరాని ఈ భాషను ఆమె ముద్దుముద్దుగా, మృదుమధురంగా పలుకుతుంటే శ్రోతలు ముగ్ధులైపోతారు.

"మాభాష నీవు ఎక్కడ నేర్చుకున్నావు?" ప్రశ్నించాడు పురగుప్తుడు.

"ఇంటి వద్దనే"

"అంటే మాభాష బాల్హీక్‌లో తెలుసా?"

"అదేమిటి? మా బాల్హీక్‌లో మీభాష మారెండవ భాష."

"ఆశ్చర్యంగా ఉందే!"

"ఆశ్చర్యమేముంది? మంచి ఎక్కడున్నా మేము స్వీకరిస్తాము. రామాయణము, మహాభారతము, ఇతరపురాణాలు, చివరకు కాళిదాస కావ్యాలనుకూడా చాలా కాలం క్రితమే మా భాషలోకి అనువదించారు."

యువరాజు కాసేపు నిమీలితనేత్రుడై—

"నిజం! మీవారు మంచి ఎక్కడఉన్నా స్వీకరిస్తారు" అన్నాడు మెల్లగా.

"అందువల్లనే అంతదూరంనుండి మేమిక్కడకు వచ్చాం" అన్న దామె.

"అవును. కాని మీ అద్భుత దేశాన్ని దర్శించే అదృష్టం నాకు కలుగలేదు" అన్నాడు విచారంగా యువరాజు.

"అదెంతసేపు యువరాజా! మీరెప్పుడో ఒకసారి మాదేశానికి విచ్చేయరాదా? మా బాల్హీక్ ప్రజానీకమంతా ఉజ్జయినీ యువరాజును హృదయపూర్వకంగా స్వాగతిస్తుంది."

వారి హార్దికతనుగురించి యువరాజుకు అప్పుడే రుచి కూడా తెలిసింది.

"అది సాధ్యంకాదు. మహారాజు నన్నంత దూరం పంపరు" అన్నాడు.

"అవునవును. అయితే తమరొక పనిచేయండి. ఉజ్జయినీ పురజనుల ప్రతినిధివర్గాన్నొకదానిని ముందు పంపండి. తర్వాత ఏమిజరుగుతుందో చూడవచ్చు. వారు తమపర్యటనానుభవం మీకు నివేదిస్తారు. ఇది ద్వితీయపక్షమనుకోండి. ప్రథమపక్షం తామే స్వయంగారావడం."

"చాలా చక్కనిసూచన! ఏమంటారు బక్షనాశ్?"

ఇంతవరకు పెదవి మెదపకుండా వింటున్న బక్షనాశుడు "నే నీవిషయాన్ని ఎంతోకాలంగా అనుకుంటున్నాను. కాని ప్రస్తావించేసాహసం చాలలేదు" అన్నాడు.

"అయితే ప్రతినిధివర్గాన్ని తప్పకపంపండి మహారాజా!" మహోత్సాహంలో అన్నది రోమని.

"నేను యువరాజును గోమనీ" సరిదిద్దాడామెను

"మాకు సంబంధించినంతవరకు మీరుకూడా మహారాజులే ప్రభూ" అన్నది రోమని. ముఖస్తుతి ఎంత అర్థంలేనిదైనా మధురంగానే ఉంటుంది!

"అయితే ప్రతినిధివర్గాన్ని ఎవరు ఏర్పాటుచేస్తారు?"

బక్షనాశుడు కలుగజేసుకున్నాడు "మీరు దీనికి

అనుజ్ఞ ఇచ్చారు. అంతే చాలు, మిగతా పనంతా నేను చూడ గలను యువరాజా".

"అయితే కానివ్వండి."

సామ్రాజ్యపు ఆధిపత్యం క్రింద, యువరాజు సూచనపై, ఒక పురజనబృందాన్ని సమీకరించడం కొద్దిరోజుల్లోనే సాధ్య మైంది. వారి వెంట కొద్దిమంది హూణులు మార్గదర్శకులుగా ఉంటారు. తనఎడ విధేయత, ఉజ్జయిని-బాహ్లీకల సౌభ్రా తృత్వమును గూర్చి వాదించడంలో సమర్థతల ప్రాతిపదికపై బకునాశుడే ప్రతినిధివర్గపు సభ్యులను ఎన్నికచేశాడు. ఈ ముక్క వినగానే ఎన్నికైనవారు ఆనందంతో గంతులు వేశారు. "మేమీ మహాదృష్టాన్ని గురించి కలలోకూడా అనుకోలేదు" అన్నారు కొందరు. "బకునాశుడు నిజంగా ఎంత ఉదారుడు!" అన్నారు మరికొందరు. "మేమొక యాత్రకు వెళ్తున్నాం" అన్నా రింకొందరు. 'పాఠశాలలు వదలిన తర్వాత మా జీవితాలలో ఉత్తమమైన పాఠాలను నేర్చుకునే మహదవకాశం ఇది' అన్నారంతా.

ఒక సుప్రభాతవేళ ఈ బృందమంతా గుఱ్ఱాలపై నగరంనుండి బయల్దేరింది. ఈఅవకాశం రాని పౌరులు తమ దురదృష్టానికి తమనే నిందించుకున్నారు. తమవిధేయత తగి నంత తీవ్రముగాలేదుగాబోలనుకున్నారు. ఇకముందైనా మంచి విధేయత ప్రదర్శించాలనుకున్నారు. శ్వేతహూణుల యొక్క, వారి సమర్థకులయొక్క అనుమానాస్పదప్రవర్తనలను గురించి చికాకు పడుతున్న ప్రజానీకముమాత్రము "ఈపీడ

విరగడైనది. ఇక ఈ ఛండాలురు అక్కడే శాశ్వతముగా ఉండిపోతే బాగుండు" ననుకున్నారు.

*   *   *

ఆరోజు జరిగిన కధ సంతా నిఖిలుడు కాళిదాసుకు వివరించాడు. "ఇక మనం కిష్కింధ కాండలో ఉన్నాం" అన్నాడు.

"అనంతరము లంకాయుద్ధ కాండ రానున్నది" అని వ్యాఖ్యానించారు మహాకవి.

౧౨

ఉజ్జయినినుండి బాల్హిక్‌కు కొన్ని వేలయోజనాల దూరం. చాలా విసుగుపుట్టించే ప్రయాణం. క్లిష్టమైన కొండ కనుమలు, నీరు లేని ఎడారులు, ప్రమాదకరమైన కొండవాళ్లు, సుళ్లుతిరిగే వాగులు – ఎన్నెన్నో దాటి పోవాలి. హూణుల మార్గదర్శకత్వంలో రోజుల తరబడి ప్రయాణించి, ఈ ఆశ్వికు లంతా వాయవ్యసరిహద్దులలోని సింధునదీ ప్రాంతం చేరారు. దాటడానికి వీలైన స్థలం ఎన్నుకున్నారు. దాటుతూదాటుతూ ఆ మధ్యాహ్నసూర్యుని వెలుగులో, ఆకాశానికి నదికి మధ్యగా నిలచి ఉన్న ఆకొండ కొమ్ముమీద ధ్యానంలో ఉన్న ఆ వ్యక్తిని చూచారు. అతడు పశ్చిమాభిముఖుడై ఉన్నాడు. ఉజ్జయినీ పౌరులు గౌరవపురస్సరముగా ఆవైపుకు తిరిగి నమస్కరించారు.

"మీరు నమస్కరించిన దెవరికి?" హూణులు అడిగారు.

"అక్కడఉన్న పూజ్య ఋషిపుంగవునకు"

"సిగ్గుచేటు. ఈమాదిరిగా మాదేశములో చేయరు"

"ఏమి? ఎందువల్ల?"

"ఋషులు, సాధువులు, యోగులు వీరంతా ప్రజల పాలిటి చీడపురుగులు".

"వారు చేసే అపకార మేమిటి?"

"ప్రత్యక్షముగా ఏ అపకారమూ చేయరనుకోండి. కాని మతము, ప్రార్థన, ధ్యానము, పూజ, పర్వాదినావలంబనలు, కర్మకాండ ఇవన్నీ సాంఘిక దురాచారాలు. ఈ సంప్రదాయా లన్నీ మానవుని సాంఘిక శ్రేయోమార్గమునుండి దూరము చేస్తాయి. 'ముక్తి ముక్తి' అంటూ చేసే ఈ నినాదాలవెర్రి సామాన్యప్రజానీకాన్ని పెడత్రోవలు పట్టిస్తుంది".

ఈ వేదాంతప్రలాపన అంతా ఆపౌరులకు చాలావిచిత్ర మనిపించింది. గట్టిసమాధానమివ్వాలని వారికి అనిపించింది. కాని వారికి హఠాత్తుగా ఏమిచెప్పడానికి తోచిందికాదు; పైగా ఆసమయంలో హూణుల మాటకు విభిన్నంగా ఏమిచెప్పే సాహసము వారికి లేదు. అయినా ఒకరిద్దరడిగారు:

"అయితే సాంఘిక శ్రేయస్సుకు మార్గ మేమి టంటారు?"

"ఏమున్నది? నృత్యము, గానము ఇత్యాదులన్నీ మీకు తెలిసినవేగా!" అన్నాడొక శ్వేతహూణుడు.

మరియొకడు: "వీటన్నిటిని సాంస్కృతిక కార్యకలాపా లంటారు. వీటివలన మన విజ్ఞానం పెరుగుతుంది; ఇవి మనస్సుకు చురుకుదనాన్ని పెంచుతాయి. విజ్ఞానము, చురుకుదనము ఈ రెండూ సమాజాన్ని వికాస పరుస్తాయి. ఇదే సాంఘిక శ్రేయస్సుకుమార్గము" అని పూర్తిచేశాడు.

పౌరులకు ఇంకా కొంత మెదడు మిగిలి ఉన్నందున ఈ వివరణ వారిని సంతృప్తిపరచలేదు. అయితే వారు ఎదురు వాదనమాత్రం చేయలేదు. తమకు అర్థంగాని విశేష మేదో హూణుల తత్వంలో ఉన్న దేమో అనుకున్నారు. కాల క్రమంలో తమకు అర్థం చేసుకునే శక్తివస్తుంది లెమ్మని తమకు తాము సర్ది చెప్పుకున్నారుకూడా.

మరికొన్నిరోజుల ప్రయాణం తర్వాత ఆబృందమంతా హిందూకుష్ పర్వత శ్రేణి దాటి చివరకు ఆక్సస్‌నదీతీరాన ఉన్న బాక్త్రియారాజధానికి చేరింది.

అది చాలా ఉల్లాసవంతమైన నగరంగా కనిపించిం దీ యాత్రికులకు. నగరమంతా అలంకరణలు; ఇళ్లన్నీ వెల్ల వేసి, రంగులద్ది శోభాయమానంగా ఉన్నాయి. వీధుల నిండా రంగు రంగుల దుస్తులతో, ప్రజా సమూహాలు; ప్రతిచోటా భేరీ వాద్యాది ఘోషలు. ఇదంతా చూచి యాత్రికులు తమ మార్గదర్శుల నడిగారు: "ఇవాళ ఇక్కడేదైనా ఉత్సవ దినమా?" అని.

"అవును. నేడు మా ప్రజలకు ఉత్సవదినమే. మీా

ఆగమనోత్సవమే అది" అన్నాడొక శ్వేతహూణుడు. యాత్రికులకు మహదానందం కలిగింది.

పురమందిరానికి చేరగానే శ్వేతహూణుల రాజైన తోరమానుడు స్వయముగా, తన మంత్రివర్గముతో వచ్చి స్వాగతము పలికాడు. గంభీరంగా, క్లుప్తంగా స్వాగత వాక్యాలు పలుకుతూ ఆతడు—

"బాల్హిక్ రాజ్యపు సుదిన మిది. భూమండలములోని వైభవోపేత మహానగరమగు ఉజ్జయినికి చెందిన ఉత్తమ పౌరులు ఇచట పాదము మోపిన పవిత్రదిన మిది. ఉజ్జయిని—బాల్హిక్ రాజ్యముల మధ్య మైత్రీ సంధి ద్వారా ఏర్పడిన సువర్ణ బాంధవ్యం, నిర్భేద్యమైన ప్రేమ, గౌరవములతో స్థిరపడిన దినమది" అన్నాడు.

ప్రతినిధులు ఉబ్బితబ్బిబ్బయినారు. ఆనంద, ఆశ్చర్య సాగరపు టలలతో వారికి భూమిపై కాలూనలేదు. అందుకు తగినంత కారణముకూడా ఉన్నది. వారిలో ఒక్కరుకూడా తమ సమాజములో ప్రతిష్ఠ, స్థాయి ఉన్నవారు కారు. అంతా మధ్యరకపు తెలివితేటలు, అర్హతలున్న బాపతు; వారిలో ఉన్న విశిష్టత ఏమీలేదు; వారెప్పుడూ రాజులు, యువరాజుల మధ్యకు వెళ్ళలేదు; మంత్రులతో మాట్లాడే అవకాశమైనా వారికి కలుగలేదు. అట్టి స్థితిలో— నేడు రాజు స్వయముగా స్వాగతమీయవచ్చినాడు; తమను గూర్చి ప్రజాసమక్షమున ఎంతగానో ప్రశంసించినాడు. నిజముగా తాము సామాన్యులు కాదన్నమాట. తమలో ఏదో విశేషమైన అర్హతలుండి

ఉండాలి. రాజంతటివాడు తమను గురించి అంతగా ప్రస్తా వించడానికి తమలో ఏదో గొప్పదనం ఉండి ఉండాలి— ఇలా అనుకున్నారు వారు. దానితో వారికి వేరే ఊహాలూ పొటమ రించాయి: 'ఉజ్జయిని సాంఘికవ్యవస్థ లోపభూయిష్టమై ఉండాలి; బాహ్లిక్ రాజ్యములో ఆదర్శప్రభుత్వ వ్యవస్థ ఉన్నది. ఆర్యావర్తమంతా బాహ్లిక్ అడుగుజాడలలో నడిచే రోజు రావాలి'—వారి కోరికలు ఈప్పుంతన పడ్డాయి.

అమర్నాడు పుర మందిరములో ప్రత్యేకమైన సన్మాన సభ జరిగింది. ఆ సన్మాన ప్రసంగాలలో తోరమానుడు, ఆయన మంత్రివర్గము, ఉజ్జయినీ పౌరులపై వర్షించిన ప్రశంసలు భట్రాజుల పొగడ్తలను మించిపోయాయి. ఇంతవరకు యువ కవిగా పేర్కొనబడుతున్న పుండరీకుని ఆర్యావర్తపు ఉత్తమ మహాకవిగా వర్ణించారు. అతడి "శ్వేతపుష్పము"ను అమర కావ్యమన్నారు. అతని మేదస్సు ముందు వ్యాసవాల్మీకుల మేదస్సు ఏపాటిదన్నారు. కాళిదాసు ప్రస్తావనే లేదు. ఓహ్! ఇక ఆ యాత్రికుల ఆనందమును, ఆశ్చర్యమును ఏమని వర్ణించాలి?

"మన ఘనత ఎట్టిదో నేడుకదా మనకు తెలిసివచ్చింది! ఒక వ్యక్తియొక్క గొప్పదనమును గుర్తించుటలో ఒక్కొక్క దేశ ములో ఒక్కొక ప్రమాణము ఉంటుంది. మన విజ్ఞాన వివేకాదులు సామాన్యమైనవికావు"— ఇలా అహంకారము కేంద్రముగా సుళ్లు తిరిగాయి వారి ఆలోచనలు. అహంకారమునుండి ఆశలు రేకెత్తాయి;ఆశలు దురాశలై అధిక్యతాకండూతిగామారాయి. తమ దేశములో స్వీయప్రతిభవల్ల గొప్పవారైన ప్రతి

ఒకరిని గురించి తమ అభిప్రాయాలు మార్చుకున్నారు. అంతా పనికిమాలిన దద్దమ్మలు; రాజుగారి ప్రాపకము సంపాదించి ఘనులైనట్లు తిరుగుతున్నవారు. వారి ఆధిక్యాలను అణచివేయాలి. తిరిగి వెళ్ళగానే వారి సంగతి ఆలోచించాలి.” ఇలా సాగిపోతున్నాయి వారి భావాలు. “అయితే వారి ఆధిక్యాలను రద్దుచేయడం ఎలా? కుట్రలు, ద్రోహము, వ్యూహముల ద్వారానా?... అందులో తప్పేమీ కనిపించడం లేదు. ఒక ఫలితాన్ని సాధించేందుకు ఏమార్గంస్వీకరించినా తప్పులేదు–” వారి బాక్ట్రియాపర్యటనలో వారికి వంట బట్టిన దిది. “మార్గాల మంచి చెడ్డలనుగురించి ఆలోచిస్తూ కూర్చోవడం ఛాందసం మాత్రమే; వెనుకబడ్డ భావనావిధానమే. అధికారాలు చేజిక్కించుకొని, వదలడానికి ఇష్టపడని వక్రబుద్ధులే ఈ‘నీతి’ ‘అవినీతి’ ‘యోగ్యములు’ ‘అయోగ్యములు’అంటూ ముద్రలు వేశారు. వారికి మద్దతు స్వార్థపరులైన మతబోధకులు, పూజారులు, సన్యాసులు, కాళిదాసువంటి కవులు. వీరందరికి అండ, ఆశ్రయము, నిరంకుశుడైనరాజు” తాము కనిపెట్టిన ఈ నూతన సిద్ధాంతానికి తామే మురిసిపోయారు, ఆ మూఢ యాత్రికులు.

ఈ ‘విప్లవాత్మకసిద్ధాంతా’న్ని వారు ఒక్కరోజులో కనిపెట్టలేదు. నిరంతరసన్మానాలు, ప్రశంసలు, బాల్హిక్ వేదాంతుల ప్రవచనాలు, సిద్ధాంతాలు — ఇత్యాదులన్నీ వరుసగా వారి నీ నిర్ణయానికి తీసుకొనివెళ్లాయి. చివరకు వీడ్కోలు సమయములో బాల్హిక్ రాజు తన అభిమానానికి చిహ్నముగా ప్రతిఒకరికి బంగారు నాణేల సంచులు కానుకలివ్వ

డంతో తమ పాతభావాల అవశేషాలు సైతం తొలగిపోయి, నూతన సిద్ధాంతం వారి మనస్సులో బాగా పాదుకొన్నది. అందు అంకురించిన బీజాలు మహావృక్షాలైనాయి. సిద్ధాంతానికి సువర్ణము కూడా తోడయ్యేసరికి, ఇక ఆ సిద్ధాంతం మందకొడిగా కూర్చొనలేదు. విజృంభించింది. ఈ వికృత విశ్వంలో అపరంజి లేని ఆదర్శాలు విషాద విషయాలే కదా!

ఉజ్జయినీ ప్రతినిధులకు అద్భుతమైన అతిథి భవనాలలో నివాసము లేర్పాటుచేశారు. నవరత్నములు పొదిగిన పాల రాతి గదులలో, మత్తెక్కించే వాసనలతో, మైకం కమ్మించే సురాపానపు టేర్పాట్లు... హంసతూలికా తల్పములను మించి పోయే శయ్యలు. అందమైన అంగనలచే అంగలార్పులు... ఉక్కిరి బిక్కిరయ్యే విలాసాలమధ్య వారికి బసలు; అన్నిటికీ మించి ప్రతి అతిథికి ఒక అద్భుతసౌందర్యవతిచే నృత్యగానాది కళాప్రదర్శనలు... వీరందరు అన్నివేళల అన్ని అవసరములు తీర్చేందుకు వీలుగా అతిథులవద్ద ఉండవలెనని ప్రత్యేకమైన రాజాజ్ఞలు; ఈ విదేశములో ఈ 'యజమాను'ల కేలాంటి అసౌకర్యము లేకుండా చూస్తూ, వారికి సంపూర్ణసంతృప్తిని కల్పించడం వీరందరి బాధ్యత.

ఒకరోజున ఈ ప్రతినిధులను బాహ్లీక్‌లోని మేధావర్గమైన కవులు, రచయితలు, కళాకారులకు పరిచయం చేశారు. పుండరీకునికి పౌరసన్మానం చేశారు; ఆ స్వాగతవచనాలు వ్యాసవాల్మీకులలో సైతము అసూయను కల్గించునేమో!

అనంతరం పరస్పర పరిచయాలు జరిగాయి. ఉజ్జయినీ పౌరులకు బాహ్లిక్ భాష రాదు; బాహ్లిక్ పౌరులకు ఉజ్జయినీ పౌరుల భాషా రాదు. అందువల్ల సంభాషణలన్నీ దుబాసీల ద్వారా జరిగాయి. ఎవరినో చూపించి బాహ్లిక్ మహాకవి అనగానే ఆయనెవరో, ఆయన వ్రాసినదేమిటో అసలేదైనా వ్రాశాడో లేదో తెలియకపోయినా ఈ ప్రతినిధులు ఆయన అద్భుత కవితా విజయానికి సంబంధించిన భావావేశంతో ఉక్కిరి బిక్కిరయినారు! భారతదేశపు మహాకావ్యములగు రామాయణ, మహాభారతములకు బాహ్లిక్ అనువాదములంటూ రెండు పెద్ద కట్టలను మహాపవిత్రములుగా తీసుకువచ్చి వీరికి ప్రదర్శించారు. ఆనందముతోను, గర్వముగాను అతిధులు వాటిని కన్నుల కద్దుకున్నారు. బాక్ట్రియనులదేశం విద్యా విజ్ఞానపీఠమై ఉండాలనే నిర్ణయానికి వచ్చారు వారు. "అటు చూడు! ఆ మహాగ్రంథాలను చక్కగా బంగారు పేటికలలో ఉంచారు! మనదేశంలో ఇలాంటి వెరుగుదుమా?" అనుకున్నారు పరస్పరము.

దీనివెంటనే నగరమంతా ప్రత్యేక పర్యటనను నడిపించారు. వెళ్ళిన ప్రతిచోట ప్రతినిధులకు సుఖశాంతులు, బ్రహ్మాండమైన సంపదలు కనిపించాయి. వీరికి చూపించిన ప్రతిఇంటా లక్ష్మి నాట్యంచేస్తోంది; సౌందర్యం చిందులు వేస్తోంది; పేదరికము, కష్టము లనేవి వీరి కెక్కడా కనిపించనే లేదు.

"చూడు! ఇక్కడ ఏ స్త్రీని చూచినా, ఏ పురుషుని చూచినా చిరునవ్వుతో కళకళ్లాడే ముఖమేకదా" అన్నాడు ప్రక్కవానితో ఒక ప్రతినిధి.

"అందులో పెద్ద ఆశ్చర్యమేముంది? వీరు ఉజ్జయిని జనం కాదుగా! పన్నులు వసూలుచేసేవారు, రాజభటులు; ఈ బెడదలేవీ వీరికుండవు" అన్నాడు మరొకడు.

ఇంకొకాయనగారు కేక పెట్టాడు, "అసలిక్కడ బిచ్చ గాళ్లు లేరు చూచారా విచిత్రం! ఇదేం ఉజ్జయి ననుకు న్నారా?" అని.

వేరొకాయన క్లుప్తంగా గంభీరంగా "ఈదేశంలో ఎక్కడా లేమి, పేదరికం అనేవి లేవు" అని సారాంశం తేల్చాడు.

తాము ఉజ్జయిని తిరిగి వెళ్లగానే స్వదేశాన్ని ఈ పద్ధ తులపై సంస్కరించివేయా లనుకున్నారు అంతా కలిసి. తా మీమహత్తరమైన బాల్హిక్ లోజన్మించక ఆపాడు ఉజ్జయి నిలో జన్మించినందుకు తమ దురదృష్టాన్ని నిందించుకున్నారు.

వారు తిరిగి వెళ్ళవలసిన రోజు వచ్చింది. తోరమా నుడు, మంత్రులు ముఖ్యపౌరులు అంతా అశ్రుసిక్త నయనా లతో వీరికి వీడ్కో లిచ్చారు. ఇద్దరు ముగ్గురు ప్రతినిధులు ఈ భూలోకస్వర్గాన్ని విడవవలసి వచ్చినందున బిగ్గరగా విల పించారుకూడా. విచారంతో బరువెక్కిన హృదయాలతో, ప్రేమ, స్నేహము, ఉదారతలకు సంబంధించిన అనేక

స్మృతులతో, ప్రతినిధులు ఈ భూలోకస్వర్గమునుండి, మళ్ళీ తమ పాడుకొంపలకు వెళ్ళేందుకుగాను గుఱ్ఱములనెక్కారు. వచ్చేటప్పుడు మార్గదర్శనముచేసిన శ్వేతహూణులే మళ్ళీ మార్గదర్శకులు. ఈసారి వీరిఅశ్వసమూహానికి తోడుగా ఒక ఒంటెల గుంపుకూడ; వాటి వీపులనిండా – బంగారునాణేలు, వజ్రవైఢూర్యాలు, అమూల్యకళాఖండాలు ఇత్యాదులతోకూడిన సంచులు; కొద్దిరోజులక్రితము స్వదేశానికి విధేయులై ఉన్న పౌరులబృందం, నేడు ఒక పంచమాంగదళంగా, స్వదేశమంటే అసహ్యద్వేషాలతో, దురాశలతో తిరిగి వచ్చింది.

వారు సింధునది వద్దకు వచ్చేసరికి కొండ కొమ్ముమీద యోగి అలాగే నిలబడి ధ్యానంలో ఉన్నాడు. ఈసారి వీరు అటుతిరిగి నమస్కరించలేదు. బాహ్లిక్‌లో నేర్చిన పాఠాలఫలితాలు ఇక్కడినుండే కానరానారంభించాయి. మానవజాతిని పరిశీలిస్తే, అసంఖ్యాక వైవిధ్యములతో ఈ జగత్తును శాసించే, మహా శక్తివంతుడు నిపుణుడునైన దేవుడొకడు ఉన్నాడనే నిశ్చితాభిప్రాయం తప్పకుండా కలుగుతుంది !

౧

పుష్యభూతి మంచినీరు తీసుకు వెళ్లేందుకని తన గుహనుండి క్రిందికి దిగివచ్చేసరికి అక్కడ చాలీ చాలని దుస్తులలోఉన్న ఒక వనిత కొంచెము తేనె మొదలైనవి అర్పిస్తూ ఉన్నది. పుష్యభూతి ఆమెను చూచి "ఎవరమ్మా నీవు ? ఇక్కడున్నావెందుకు ?" అని ప్రశ్నించాడు.

"స్వామీ! నేనొక అభాగ్యురాలను. అంతకన్న నా గురించి ఇంకేమి చెప్పను" అన్నదామె.

"నేను నీ కేమి సహాయము చేయగలనమ్మా?"

"భగవంతుడు చేయగలిగిన సహాయమేదైనా ఉంటే అది మీ రొక్కరే చేయగలరు. తన చేతిలో ఇంకేమీ మిగల నప్పుడు మానవుడు భగవంతు నాశ్రయిస్తాడు"

"నేను దేవతనుకాదు తల్లీ ! నేనూ ఒక మనిషినే."

"మీరొక యోగి పుంగవులు. మానవుల కన్న ఎక్కువైనవారు. దేవునికి చేరువలోనివారు."

"సరేననుకుందాము. ఇంతకూ నీవు వచ్చినపని చెప్ప లేదు. నా చేతిలో ఏదైనా ఉంటే నీకు తప్పక ఆ ఉపకారం జరుగుతుంది. కాని నా శక్తిని గురించి మరీ పెద్ద అభిప్రా యాలు పెట్టుకొనవద్దు. నేనూ ఒక మామూలు మనిషినే. మానవాతీతమైన శక్తులేమీ నావద్ద లేవు."

ఈ మాటలతో కొంచెము ఉత్సాహపడి ఆ స్త్రీ "స్వామీ! అయితే వినండి. నేనొక అభాగ్యురాలైన వితం తువును. నాకున్న సర్వస్వము నా చిట్టిబిడ్డ ఒకడు. మరొకటి చిన్న పొలము. అందులో కాస్త గోధుమ పండించుకొని జీవితం వెళ్లదీస్తుంటాము. ఈఏడు అడవిపందుల బెడద ఒకటి వచ్చి పడినది. రాత్రంతా పొలమును నాశనము చేస్తు న్నాయి ఇది ఇలాగే మరికొన్నాళ్లు సాగితే నాకు, నా బిడ్డకు వచ్చే ఏడంతా తిండి ఉండదు." అన్నది.

"అయితే నీవు వాటి నెందుకు తరిమివేయరాదు?" అన్నాడు పుష్యభూతి.

"నా చేతనయ్యేపనా? నేనొక అబలను కదా"

"నీ పక్కింటివారి సహాయం తీసుకోనవచ్చునుగదా?"

"ఎవరి పొలాలు వారికి ఉండనే ఉన్నాయి. వారికి అక్కడే సరిపోతోంది. ప్రక్క పొలాలలో తరిమివేయబడ్డ అడవి పందులన్నీ మా పొలంమీద పడుతున్నాయి."

"మరి నన్నేమి చేయమంటావు?"

"మీరు ఏదైనా మంత్రిస్తే నా కీబెడద వదలిపోతుంది స్వామీ!"

పుష్యభూతి మెల్లగా నవ్వాడు. "అమ్మా, మంత్రాల వల్ల ఆపని జరిగితే నేను తప్పకుండా మంత్రిద్దును. కాని అది సాధ్యంకాదు. పైగా నాకు వేరే ఏ ఇతర ఇంద్ర జాలమూ తెలియదు."

ఆ స్త్రీ నిరాశతో రోదించ నారంభించింది. వృద్ధ పీరుని హృదయం కరిగిపోయింది.

"అయితే మీ గ్రామం ఎక్కడ?"

"అదిగో ఆ కానవచ్చేకొండకు ఉత్తరాన మా ఊరు"

"మీ ఊళ్లో మీ పొల మెక్కడ ఉంది?"

"కొండ ప్రక్కనే. మీరు ఊళ్లోకి అడుగు పెట్టగానే మొదటి పొలం నాదే"

"సరే, నీవు వెళ్లు. చేయగల సహాయం సంగతి ఆలోచిస్తాను"

ఈ వాగ్దానంతో, మహదానంద భరితయై ఆమె సాగిలపడి మ్రొక్కి తిరిగి వెళ్లిపోయింది.

*　　*　　*　　*

ఉదయపు ఘడియల్లో పుష్యభూతి తన కొండకు తిరిగి వచ్చాడు. పైకి ఎక్కుతూ ఎక్కుతూ ఆగి, కత్తినఉన్న నెత్తురు కడిగివేసుకున్నాడు. ఇక తిన్నగా పైకివెళ్లి గుహను చేరాడు. కాస్త నిద్ర వస్తోంది. ఆ సంఘటనంతా గుర్తుకు వచ్చి అతనికి నిద్ర దూరమైంది.

ఆ వనిత వెళ్లిపోగానే తన శక్తినుపయోగించి ఆ అడవి పందిని వధించగల ననుకున్నాడు. వార్ధక్యం వచ్చినా తన శరీరం ఆ పని చేయగలదనే అనుకున్నాడు. భయంకర మైన అర్ధరాత్రివేళ కత్తిపుచ్చుకొని బయల్దేరాడు. ఆమె చెప్పిన గుర్తులను గుర్తుంచుకొని ఆ పొలాన్ని చేరాడు. అక్కడ మూడు అడవి పందులు పొలాన్ని నాశనంచేసి వేస్తున్నాయి. ఒకదాన్ని నరికివేశాడు. మరొకదానికి గట్టి దెబ్బ తగిలింది. మూడవది ముందే పారిపోయింది. ఇక ఒక ఏడాదివరకు ఆ స్త్రీ భోజనానికి పర్వాలేదు అని చాలా సంతృప్తి కలిగింది. అందులో గర్వించదగినదేమీ లేదు. శకులను, హూణులను తరిమి తరిమి చావగొట్టిన గుప్తసామ్రాజ్య సర్వసైన్యాధిపతికి అడవిపందులను కొట్టడం ఒక పెద్దపని కాదు. అయినా చాలా కాలముగా ఆయన ఎరగని సంతృప్తి, ఆనందము ఆయన మనస్సు నాక్రమించాయి.

అభాగ్యుల నాదుకొనడమే నా ఖడ్గానికి పని అను కున్నాడు. పదవీ విరమణచేసి ఉజ్జయినిని వదలిననాడు "ఇక ఖడ్గానికి, ఉజ్జయినికిసెలవు" అనుకున్నాడు. కాని అలా కాలేదు. నేడు ఈ ఏకాంత ప్రదేశములో అనుకోకుండా తనకూ తన ఖడ్గానికీ పిలుపు వచ్చింది. ఆ వనిత ప్రార్థన— ఈ ఖడ్గము ఆ ఒరలో తుప్పుపట్టిపోరాదని ఈ వృద్ధవీరునికి చేసిన ఉద్బోధ యేమో !

ఈ జీవితంలోని విచిత్ర సంఘటనలను గురించి తల పోస్తూ పుష్యభూతి పక్కపై ఒక్కసారి ఒత్తిగిలాడు. "నా వారికి నా ఖడ్గము వలన ఇంకా ప్రయోజనం ఉన్నదేమో ! నేనిక్కడ ఏకాంతముగా నిరర్థక జీవితము గడుపుతున్నా నేమో. విధి ఆ వనితరూపములో వచ్చి నా ఖడ్గమును వెలికి తీయించి కర్తవ్యాన్ని గుర్తుచేస్తున్నదేమో ... శౌర్య సాహస కృత్యములు, సర్వసంగపరిత్యాగము ఈ రెండూ సంబంధములేని మార్గములైనా పథికు లుభయులకూ ఒకే పారితోషికం వస్తుంది. నేను ఏ మార్గము స్వీకరించను ? సర్వ సంగ పరిత్యాగమా ? అయితే ఈ ప్రాపంచిక ప్రబోధము నా వద్ద కెందుకు వచ్చినది ?" తనలో తనే ఇలా ఎన్నెన్నో తలపోస్తున్నాడు.

మరునా డుదయం ఆ స్త్రీ ఫలపుష్పాదులతో దర్శనా నికి వచ్చింది — మంత్రశక్తితో పందులను వధించినందుకు ! పుష్యభూతి నవ్వి ఆమె నాశీర్వదించి పంపాడు.

ఉజ్జయిని ప్రతినిధులు బాక్ట్రియానుండి తిరిగివచ్చి నగరద్వారానికి చేరగానే వారికి మహదాశ్చర్యం వేసింది– ఎందరో పౌరులు పూలమాలలు పుచ్చుకొని, రాజ్యధ్వజము తీసుకొని ఎదురైనారు. సంగీత వాద్యాలతో, మేళతాళా లతో అనేక బృందాలు వీధులనిండా కానవస్తున్నాయి. ఇదంతా తమ స్వాగతానికేనని ప్రతినిధులిట్టే అర్థంచేసుకున్నారు. ఇలా జరగక తప్పదనుకున్నారు కొద్దిపాటి గర్వముతో. ఒక వస్తువు వీధిలో విక్రయస్థానానికి వెళ్లితేగాని దాని విలువ తెలియదు. అలాగే ఒకవ్యక్తి విదేశాలకు వెళ్లి వస్తేగాని స్వీయజనులకు అతని విలువ తెలియదు – అనుకున్నారు.

వారి హృదయాలు గర్వముతోపాటు, శ్వేతహూణుల ఎడ విశ్వాసముతో కూడా నిండిపోయాయి. తమ కాతిథ్యమిచ్చి, బాల్హిక్‌ను దర్శించే అవకాశం కల్పించి, తమ ఘనతను వెలుగుకు తెచ్చిన శ్వేతహూణులకు హృదయములో కృతజ్ఞతలు తెలుపుకున్నారు. తమ ఘనతకు వారలా మురిసి పోతుండగా, రోమని వయ్యారినడకలతో, చిరునవ్వులు చిందుకుంటూ దోసిలిలో పూలహారా న్నుంచుకొని, మందగమనయై మురిపాలు కురిపిస్తూ వారిని సమీపించింది. ప్రతినిధివర్గములోని ప్రతివారు ఆ హారముకోసం మెడలు చాచారు ఆమెకు కాస్త ఇరకాటమైంది. ప్రతినిధివర్గనాయకునికి మాత్రం పూలహారం వేద్దామనుకుంటే అందరూ

మెడలు చాచారు! ఇంతలో ఎవరో పౌరుడు ముందుకు దూకి ఆ హారాన్ని గుంజుకొని ఆమె మెడలో వేసేసరికి ఆమె బెడద వదిలిపోయింది. హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

ఆమె సైగ చేయగానే ఆమె ప్రతినిధి ఒకరు, ప్రతినిధి వర్గ విజయాన్ని ప్రశంసిస్తూ ఘనమైన స్వాగత పత్రాన్నొకదానిని చదివాడు. ఆ పత్రము వింటుంటే వారి చెవులకు ఏదైక సత్యం ఒకటి వింటున్నట్లనిపించింది. ప్రతి వ్యక్తీ ఆ ప్రశంస అంతా తనను గురించే చేసినట్లు, ఇతరులను గురించి కూడా ఏవో నాలుగు వాక్యాలు కలుపబడ్డట్లు భావించాడు. ఈ మహాసంరంభం జరుగుతూంటే ఎవరిదో గొంతుక ఒకటి—

"వీరంతా ఏ మహాయుద్ధంలో విజయంగాంచి వచ్చారు ?"

అని ప్రశ్నించింది. అందరి కళ్లు అటు మళ్లాయి. ఆ ప్రశ్న ఎవరిదో కాదు — విదూషకునిది.

"ఓహో ! వసంతకుడా ?" అన్నాడొకడు.

"కాదు. మధాభ్యుడు" అన్నాడింకొకడు.

"మీ బిరుదాలు నాకెందుకు ? నా వంశ నామం చాలు నాకు" అన్నాడు విదూషకుడు.

"అదీ బాగానేఉంది కాని ఇది ఇంకాస్త బాగుంటుంది" అన్నాడింకొకడు.

"అంతమంచివి అనవస్థాలకెందుకు? నీకోసం ఉంచుకో" అన్నాడు విదూషకుడు.

జనం పగలబడి నవ్వారు.

"ఇదే ఇంకొకరైతే చావగొట్టి ఉందును" అన్నా డెవడో గుంపులోనుండి.

"వాడి పెదవులమీద హాస్యం చిందులాడుతుంటుంది. దానితో బ్రతికి పోతున్నాడు" అన్నా డింకొక డెవడో.

"నేను నోరు తెరవగలుగుతోంది అందువల్లనేనే పిచ్చి నాయనా? ఇంతకూ నాప్రశ్నకు సమాధానం వచ్చిందికాదు. వీరంతా ఏమహాయుద్ధంలో గెలుపొందివచ్చారూఅని?" మళ్లీ ప్రశ్నించాడు విదూషకుడు.

"చచ్చు పెద్దమ్మవి, నీకేం తెలుసు? ముద్దపప్పులో చారెడు నేయిపోస్తే పట్టెడేసిముద్దలు పట్టిస్తావు. లేదా కంచెడు చద్దిఅన్నం గడ్డపెరుగుతో సేవించమంటే సేవిస్తావు" అన్నా డొకడు.

"అబ్బే నా కవీ దొరకడంలేదు" అన్నాడు విదూషకుడు ఎదురు కొడుతూ.

"నీకు కావల్సినది దొరకటం లేదని ఒప్పుకుంటున్నా వన్నమాట. అయితే ఈఅదృష్టవంతులకువలె బాహ్లిక్ వెళ్లు. నీకు తినేందుకు బోలెడు దొరుకుతుంది, మూఢుడా!"అన్నాడు కసిగా ఒకడు.

"ఓహో అదా? వీరు బాహ్లిక్‌ను సందర్శించివచ్చిన మహనీయులా? ఆఁ. ఆదేశంలో బోలెడు తిండితిన్నారా వీరు? ఇంకేమి ఘనకార్యం చేశారు?"

"అక్కడ ఇంకేమి చేస్తారు ?"

"ఇంకేమీలేదూ ? వెళ్లి ఊరికే తిరిగిరావడమేనా ?"

"అదైనా ఎంతమందికి చేతనవుతుందోయ్ ?"

"నిజమే, నిజమే; నేను అంగీకరిస్తున్నాను. వారికి మంచి స్వాగతం ఏర్పాటుచేశారు; బాగానేఉందిగాని చక్కని బిరుదములుకూడాఇచ్చి ఉండవలసింది" అన్నాడు విదూషకుడు స్నేహపూర్వకమైన స్వరముతో.

అదీ నిజమేననిపించింది చాలామందికి. మంచి బిరుదం ఇవ్వకపోవడం పొరపాటే ననుకున్నారు.

"అయితే విదూషకా! ఇప్పుడే నీవే ఏదో తగిన బిరుదును సూచించి సహాయపడవలసింది" అని కోరారు ప్రాధేయపూర్వకముగా.

"అదేమంత పెద్దపని మిత్రులారా? వీరందరికి 'తామర పాదులు' అనే బిరుదం చాలా తగిఉంటుంది." అన్నాడు విదూషకుడు శ్లేషగా.

"తామరపాదులా? అంటే ?"

"ఏముందీ? పద్మపాదులకువలెనే ఇదీ ఒక చక్కనిపేరు. అంతదూరం ప్రయాణంచేసి, సుఖంగా తిరిగివచ్చారుకదూ? (స్వాగతంలో కండూతి తీర్చుకొని అనుకొని) అందువల్ల వారి పాదాలకుచెందాలి ఈఘనతఅంతా" అని వివరంచెప్పాడు.

"ఏదో వ్యంగ్యంగా అంటున్నట్లున్నావు"

"మీరేమనుకున్నా సరే. అన్నివిధాలా పనికివచ్చే బిరుదమిది అని నా అభిప్రాయం"

అని విదూషకుడు ఆ ప్రతినిధులవద్దకుచేరి "మిత్రులారా! అచటి ప్రజలు మన ప్రజలకువలెనే ఉన్నారా లేక ఇంకా ఏదైనా విశేషంగాఉన్నారా?" అని అడిగాడు.

"మానవులే, కాని చాలా అభివృద్ధిచెందినట్టివారు" అన్నా డొక ప్రతినిధి.

"అంటే మనకన్న ఎక్కువ పొడుగు ఎదిగి ఉన్నారనా?"

"ఆ అభివృద్ధి కాదు!"

"మరి ఇంకే అభివృద్ధి?"

" నేను ఒక్క ముక్కలో అంతా చెప్పలేను"

"పోనీ చెప్పగలిగినంతే చెప్పు"

"అక్కడంతా మంచులా తెల్లగా ఉంటారు."

" కాకులు కూడానా?"

"పరిహాసా లాడుతున్నావు"

"నావృత్తి అదేకదా? కోప్పడకండి. ఇక సెలవు తీసుకుంటాను" అని తన వంకరకఱ్ఱ భుజాన వేసుకుంటూ వెళ్ళిపోయాడు విదూషకుడు.

ఒక ప్రతినిధి గొంతు చేసుకున్నాడు:

"పోనీ సామ్రాట్టుకు తీరుబడి లేకపోతే, మన స్వాగతానికి యువరాజైనా రాకూడదా?"

"అసలు సామ్రాట్టే ఎందుకు రాకూడదని? తోరమానుడు రాలేదా?" ఇంకా గట్టిగా అన్నాడు మరొక ప్రతినిధి.

"పోలిక లెందుకు? తోరమానుడికి మర్యాద, మన్ననలు తెలుసు" అన్నాడు వేరొకడు.

అంతా ఎవరిఇండ్లకు వారు వెళ్లిపోయారు. విదూషకు డిచ్చిన బిరుదం వత్తి వెక్కిరింతే అయినా కొందరు ప్రతి నిధులకు అదేదో ముచ్చటగాఉంది. "తామరపాద" అని గుణించుకున్నారు. పదే పదే మురిసిపోయారు. అందంగా చెక్కించుకొని తమ ఇండ్లలో తగిలించుకున్నారు. పరి హాసాన్ని, ప్రశంసను విచక్షణ చేయగలిగే శక్తి నశించనంత కాలం మానవుడు మూఢమతిగా ప్రవర్తించడు. అది నశిస్తే తన స్థితి తనకే తెలియదుకదా!

విదూషకుడు తన వంకరటింకరకర్ర పోటువేసు కుంటూ శీలవతి ఇంటికి చేరాడు.

"రా! రా!" అని స్వాగతించిందామె.

"చచ్చిన గుర్రాన్ని చంపే దేమిటి? వచ్చినవాణ్ణి రమ్మనేదేమిటి?" అంటూ లోపలికి చేరాడు విదూషకుడు.

"మహాకవి ఏరీ? నిఖిలుడుకూడా రాలేదా?" అడిగాడు.

"వస్తారు. కూర్చో." అన్నదామె.

"ఓయ్, విదూషకా! ఇక్కడున్నావన్నమాట" అంటూ కాళిదాసు ప్రవేశించాడు.

"నా విన్నపం సమర్పించుకోవడానికి వచ్చాను" అన్నాడు విదూషకుడు.

"విన్నపా లాలకించేందుకు తగినస్థలం రాజసభ కదా?"

"ఈ రోజులలో రాజసభ ఏ కోవకు చెందినదో పరిశోధకులు తేల్చిచెప్పాల్సిన విషయం"

"అంటే ?"

"ఇంతవరకు ఈరాజసభ మధువల్లరి నివాసంలో జరుగుతుండేది. ప్రస్తుతం రోమని ఇంటికి మారింది"

"రాజసభ ఎక్కడైనా జరగనీ - శీలవతి నివాసం కాకపోతేసరి!"

" ఏమీ పర్వాలేదు. రాజకవి మహాసభ ఇక్కడే జరుగుతోంది కదా?" అని విసిరింది.

"సరే విదూషకా! ఇంతకు ఏమిటీ నీవిన్నపం.?"

"నీ ప్రభావంతో నాకు నా వంశ బిరుదం నిలుపుకోవడం కష్టమవుతోంది. నన్ను వసంతకుడనిగాక మధాభ్యుడని పిలుస్తున్నారు."

అప్పుడే ప్రవేశిస్తున్న నిఖిలు డందుకొని "నీవు నీబిరుదపు వారసత్వానికి సంబంధించి బాధపడుతుంటే, నాకు ఈ రాజ్యవారసత్వానికి సంబంధించే బాధ కలుగుతోంది." అన్నాడు.

"నీకుకూడా ఒక రాజ్య మున్నదేమిటీ ? చెప్పావు కాదే" అన్నాడు కాళిదాసు.

" ఇదేమీ కొత్త విషయముకాదు. ఈ రాజ్యం నా ఒక్కడిదేకాదు. మీఅందరిదికూడా"

"అదెలాగయ్యోయ్ ?"

"ఈ సంస్కృతి, విజ్ఞానం, విద్య, వికాసం, మతము, సాంప్రదాయాలు, భాషలు, ఆశయాలు, ఆకాంక్షలు – ఇవన్నీ మన వారసత్వం కాదా ? మనలో వీటికి వారసుడు కానిదెవరు ?

"అవన్నీ ఎక్కడికి పోతున్నాయిప్పుడు ?"

"ఇంతటి పండితులు మీారు నన్నెందుకు అర్థంచేసు కోవడంలేదు ?"

"శ్వేతహూణుల ప్రభావానికి నీవు భ్రమపడిపోతు న్నావు"

"ఆ భ్రమలనుగురించి చెప్దామనే నేను వచ్చాను" అని అందుకున్నాడు విదూషకుడు. ఉదయం జరిగిన సంఘ టన, స్వాగతోత్సవం, సన్మానాలు అన్నీ పూసగుచ్చినట్లు చెప్పాడు. ప్రపంచం ఎలా తయారవుతోందీ ఆయన శ్రోత లకు బాగా తెలుసు. భవిష్యత్తును వారు స్పష్టంగా ఊహిం చుకోగల్గుతున్నారు. కాని దానిని నివారించలేని అసహాయ స్థితిలో ఉన్నారు. గంటల తరబడి అలా నిశీధంలోకిచూాస్తూ కూర్చున్నారు.

౧౫

బాల్హిక్‌ను దర్శించివచ్చిన గౌరవనీయులగు ఉజ్జయినీ పౌరులంతా చక్కని బాల్హిక్ స్తోత్రబృందంగా తయారైనారు. అందుకు కారణాలు రెండు : భౌతికము, మానసికము. కానుకల

రూపములో భౌతికముగా వారికి కల్గిన ప్రయోజనము తక్కువది కాకపోయినా మానసిక కారణంకూడా చాలా ప్రబలంగా పనిచేస్తోంది. తమ బంధుమిత్రు లెవరికీ లభించని భాగ్యము — అద్భుత దేశ సందర్శనభాగ్యము — వీరికి లభించింది. వారికి లభించిన గౌరవము, ఆతిథ్యము అనన్య సామాన్యము. తమ సోదర దేశీయులు ఇంకా అజ్ఞానాంధకూపములో పడిఉండగా తమకీ మహత్తర జ్ఞానోదయావకాశం లభించింది. ఇవన్నీ వారి మనస్సులపై మహాచురుకుగా పనిచేసినవి. చాలామంది దుఃఖభాజన జీవితం గడుపుతుంటారు — ఇబ్బందుల్లోకూడా జీవితాన్ని అనుభవించడం వారివంతు! ఆ పొంగు వెనుక అన్యులు అసూయపడే ఒక గర్వం, అన్యులు తమనుగురించి న్యూనపడే ఒక ఆధిక్యభావం! బాల్హిక్ వెళ్ళివచ్చిన ఈ గౌరవనీయులంతా సభలు, సమావేశాలు నిర్వహించేందుకు చిన్న పెద్ద సాకులు కనిపెడ్తుండేవారు. ఇద్దరు ముగ్గురు కలిస్తే చాలు అతిశయోక్తులు, అద్భుతవర్ణనలతో ఉపన్యాసాలు ప్రారంభించేవారు. తమఅతిథుల గొప్పదనాన్ని వర్ణించడంలో తమలో తామే పోటీపడేవారు. బాక్ట్రియా వైభవాన్నిగురించి వారి రసవత్తర వర్ణనలు అన్నిపరిధులు దాటి చివరకువాస్తవాలకు ఏమీ సంబంధంలేని కరుడుకట్టిన స్తోత్రాలుగా మారే వరకు వెళ్లాయి. వారిస్తోత్రాల తీవ్రత ఎక్కడ ఆగాలోకూడా తెలియనంతగా పెరిగిపోయింది.

ఉదాహరణకు అందులోఒకడు "బాక్ట్రియాలో ఇళ్లన్నీ ఏడంతస్థుల మేడలే" అనేవాడు. "ఏడేమిటి? పధ్నాలుగైతే?"

అనేవా డింకొకడు. "ఛఛా మీరు సరిగా చూడలేదు. అవి అరవైనాలు గంతస్థుల మేడలు" అనేవాడు వే రొకడు. "అక్కడ స్త్రీపురుషులు యావన్మందీ ఏ వయస్సులోనివా రైనాసరే చక్కగా చదువుకున్నట్టివారు" అని ఒక డంటే, మనకాళిదాసుగాని, వరాహమిహిరుడుగాని పాండిత్యంలో అచటి సామాన్య పౌరునికి కూడా చాలర"నేవాడు వేరొకడు. "అక్కడ ప్రతివాడూ ధనికుడే లేమి అనేది వారికి తెలియదు"అని ఒకడంటే, "మన కోటీశ్వరులుకూడా వారి పేద వారికి సరిపోలరు" అని మరొకడు కోసేవాడు.

యువకవి పుండరీకుడు తనకు హూణులు జరిపిన స్వాగతసన్మానాలగురించి మేళం వాయించుకుంటూ బయద్దేరేవాడు. కాళిదాసు ఎదుటపడే ధైర్యం అతడికి లేదు. అందువల్ల మిత్రులతో "నాకు జరిగిన సన్మానాదుల సంగతి ఆయనతో చెప్పండి"అంటూ విర్రవీగేవాడు. వారు బాహ్లిక్ నుంచి తెచ్చుకున్న అమూల్య బహుమానాలన్నీ వారి భార్యలపరమైనాయని వేరే చెప్పనక్కరలేదు. వారు ఇరుగమ్మకు, పొరుగమ్మకు వాటిని ప్రదర్శించి తమ అదృష్టాన్ని గురించి, తమభర్తల గొప్పతనాన్నిగురించి, హూణుల వైభవాన్నిగురించి ఉపన్యాసాలు ప్రారంభించేవారు. తమ కాయోగంపట్టలేదే అని గుడ్లనీరు గుడ్లను కుక్కుకునేవారు ఆ ఇరుగుపొరుగు అమ్మలక్కలు. వారంతా ఇంటికితిరిగివచ్చి "ఎన్ని నగలూ నాణ్యాలో" అని లొట్టలు వేసుకుంటూ

ప్రచారం చేసేవారు - తమకు లేవేలని లోలోన గుటకలు వేసుకుంటూ.

నగరమంతా బాక్ట్రియా వైభవస్తోత్ర గానాలతో నిండిపోయింది. మధ్యమధ్య ఆంతరంగిక మిత్రులతో బాక్ట్రియన్ 'రంభల'నుగురించి వర్ణిస్తుండేవారు. తమలోతాము పగలబడి నవ్వుకుంటుండేవారు.

అచిరకాలంలోనే ఈ ప్రచారమంతా ఫలితాల నీయనారంభించిది. బాక్ట్రియాను దర్శించనివారి కది కలలో స్వర్గమైంది. వారిస్వప్నదృశ్యాలముందు, వారికి స్వదేశము, స్వపరివారము, భార్య, బిడ్డలు, తోడిపౌరులు, అంతా అసహ్యంగా కనిపించేవారు. ఈ దౌర్భాగ్యపు దేశంలో పుట్టినందుకు వారు తమను తామే నిందించుకునేవారు.

వారిబుద్ధికి తోచని సత్యాలు ఈ ప్రపంచానికి సంబంధించి కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు- మానవ నివాస యోగ్యమైన ప్రపంచభాగమంతా మట్టితో కూడినట్టిదే. ఇందులో స్వర్గభాగమంటూ ప్రత్యేకమైన దేదీ లేదు. ప్రతి దేశానికి దానిప్రత్యేకతలు కొన్నిఉంటాయి. ఇందులోకొన్ని ఎక్కువని కొన్నితక్కువని భావించలేం. ఈ వైవిధ్యాన్ని అర్థం చేసుకోలేక అన్యదేశాలను ప్రశంసించడంలో, స్వదేశాన్ని కించపరచుకుంటూ, తమ వికృతమనస్థితియొక్క దుష్పరిణామాలనైనా అర్థంచేసుకొన లేనివారు అచిర కాలంలో పతనం చెందక తప్పదు. ప్రస్తుతము ఉజ్జయినిని ఎదుర్కొన్న పరిస్థితికూడా అట్టిదే.

## ౧౮

అదిసాయం సమయము. రోమని నివాసము. యువరాజు పురగుప్తుడు మామూలుగా విచ్చేశాడు. అర్ధరాత్రి వరకు అక్కడే కాలక్షేపం చేస్తాడు. అప్పటివరకు ఆమెతో ముఖ్యసంప్రదింపు లేవో చేస్తున్న బక్షనాళుడు యువరాజు రాగానే మెల్లగా తప్పుకున్నాడు. పురగుప్తుడు ఆసనం అలంకరించగానే రోమని స్వహస్తాలతో ఫలహారాదులు తెచ్చింది.

"రోమనీ! మాదేశంలో ఎవరి పెదవులమీదనైనా ఇవాళ మీ ప్రియమైన దేశపునామమే!" ప్రారంభించాడు పురగుప్తుడు.

"ఏమి జరిగింది సామ్రాట్?" అని నాలుక కొరుక్కొని "యువరాజా?" అని సర్దుకుంటూ అడిగింది.

"మీదేశాన్ని చూచి వచ్చిన పౌరులు అచటివైభవాన్ని గురించి వేనోళ్ళ పొగడుతున్నారు".

"ఉత్తమత్వాన్ని ప్రశంసించడం కూడా ఉత్తమత్వమే కదా ప్రభూ? మీ పౌరులలోఉన్న మంచితనంవల్లనే వారు మా దేశంలోని మంచితనాన్ని గుర్తించగలిగారు. అదీగాక ఇక్కడినుండి వెళ్లిన మాదేశపౌరులుకూడా అక్కడ ఉజ్జయిని సంస్కృతీనాగరికతల గురించి ఎంతగానో ప్రస్తుతిస్తారు. మేము అంతగా గౌరవించే రామాయణ, మహాభారతాదిపురాణముల అనువాదాలను ఉజ్జయిని నుండి వెళ్లిన పౌరులు ప్రత్యక్షంగా దర్శించారు."

"జౌనౌను"

రోమని మాటలన్నీ నిజానికి అబద్ధాల పుట్టలు. ఉజ్జయినినుండి వెళ్ళిన హూణు డెవరూ ఉజ్జయినిని గురించి పొగడ లేదు. పైగా చాలామంది అల్పంగా ప్రస్తావించేవారు. ప్రభుత్వబలహీనత, కార్యనిర్వాహకుల అలసత్వం, ప్రజలలో వ్యాపించిన అసంతృప్తి - ఇవన్నీ వర్ణిస్తూ 'గట్టి దెబ్బ తీస్తే వారే మోకరిల్లుతారు' అంటుంటారు. అయితే పురగుప్తుడికివేమీ పట్టవు. ఎదుటఉన్న సౌందర్యముతో అతడికి కన్నులు పొరలుగమ్మాయి. వాస్తవపరిస్థితి అతనికెంత మాత్రము తెలియదు. ఆయన కళ్ళముందు అద్భుత సౌందర్యం తారాడుతుంటే పెదవులమీద బాహ్లిక్ సురాభాండం వ్రాలిఉంటుంది. బుద్ధిమాంద్యపీడితు డాతడు. ఆయనకు మంచిచెడ్డ చెప్పేవారంతా దేశవిద్రోహపుటంచులకు చేరినవారే. బాహ్లిక్ వెళ్ళివచ్చినవారు శ్వేతహూణుల ప్రచారబృందంగాను, ఉజ్జయినికి సంబంధించి దుష్టప్రచారకులుగాను తయారైనారు. ఈ దుస్థితి నంతటిని సమర్థవంతంగా ఎదుర్కొనదగిన ఏకైక వ్యక్తి పరిస్థితుల కుట్రకు బలియై ఏకాంతవాసంలో ఉన్నాడు.

"యువరాజా! మి మ్మొకటి కోరవచ్చునా?"

"అది నాచేతిలోని విషయమైతే నీవుచెప్పడమే తరువాయిగా నీ కోరిక ఈడేరినట్లే ననుకో"

"బాహ్లిక్ ఉజ్జయినీలమైత్రి చాలా దృఢముగా ఉన్నదని మీకు తెలుసు. దానిని దృఢతరం చేసేందుకు ఉజ్జయినీ

పౌరులతో మిత్రమండలి నొకదానిని ఏర్పాటు చేద్దామని ఉంది.”

“అద్భుతమైన ఆలోచన!”

“మీకు నచ్చినదంటే అద్భుతమైనదన్నమాటే. మా దేశంలోకూడా చాలాకాలంక్రితం ఇలాంటిది చిన్న దొకటి ప్రారంభింపబడ్డది”

“దాని కార్యకలాపా లేమిటి?”

“ఉజ్జయిని కళలను, విద్యావిజ్ఞానాలను, సంస్కృతీ సాహిత్యాలను, వ్యాప్తిచేసేందుకు సాంస్కృతిక కార్యకలాపాలు నిర్వహిస్తారు; ఉజ్జయిని సంగీతసమ్మేళనాలు, కావ్య గానాలు నిర్వహిస్తుంటారు; ఇంకా అనేక మానవసేవా కార్యకలాపాలుకూడా నిర్వహిస్తారు.”

నిజానికి ఇది అంతా పట్టి కట్టుకధలపుట్ట. అయినా పురగుప్తుడికి ఇది అర్థమయేస్థితి ఉంటేగా? “అద్భుతమైన ఆలోచన. వెంటనే ప్రయత్నాలు ప్రారంభించు. నీకుకావలసిన ఆర్థికసహాయం నీవెంటనే ఉంటుంది” అన్నాడు ఆతృతగా.

“ప్రభుత్వ ధనాగారంనుండి విరాళాలు సేకరించడం నాకు ఇష్టంలేదు. మా దేశంలో ఈమాదిరి కార్యకలాపాలను మానవకల్యాణకార్యకలాపా లంటాము. అలాటివాటిని ప్రజల విరాళాలద్వారా నిర్వహించాలి.”

“మరి చాలాధనం అవసరం ఉంటుందిగా ?” సందేహం వెలిబుచ్చాడు పురగుప్తుడు.

"ప్రజలు సహకరిస్తారు."

"అంటే మీ దేశంలో ప్రజలు ఈ ఆశయానికి సాను భూతితో ఉంటారన్నమాట."

"యువరాజా, మీరు సానుభూతితో ఉన్నప్పుడు, దీనిని చూచి ముఖం చిట్లించుకునే ధైర్యం ఎవరికుంటుంది ?" అన్నది చిరునవ్వులు చిందిస్తూ. అప్పుడా పెదవులమధ్య స్వర్గాన్ని దర్శించాడు పురగుప్తుడు.

"చాలా అలసిపోయాను" అంటూ భారంగా లేచాడు పురగుప్తుడు. నడుముచుట్టూ చెయ్యివేసి అతడిని ప్రక్కగది లోకి తోడుకొని పోయింది రోమని.

౮

ఆరోజు సంత. ఉజ్జయినిలో అలవాటు ప్రకారం వారంలో కొన్నిరోజులు మహాకాళీశ్వరాలయ ప్రాంగణపు ముందుభాగం సంతకు ఉపయోగిస్తూ ఉంటారు. మూలమూల పల్లెలనుండి ఆదివాసిస్త్రీలు రకరకాల కూరలు, పండ్లు అమ్మ కానికి తెచ్చారు. ఒకప్రక్కన ఇత్తడి కంచుసామానుల దుకాణాలున్నాయి. ఇంకొక ప్రక్క బట్టలదుకాణాలు. చౌక బారు గుడ్డలు మొదలు మేలురకపువస్త్రాల వరకు చీరలు, ధోవతుల వరకు అన్నీ అమ్మకానికి పెట్టారు. ఇంకొక మూల కళాఖండాలు, దంతపు, కొమ్ము బొమ్మలు, ఆటవస్తువులు. ఒకమూల పప్పుదినుసులు, ఇంకొక మూల గోధుమలు, గోధుమపిండి, రవ్వమొదలైనవి. వీళ్లకు కాస్తదూరంగా

వేడివేడి పకోడీలు చేస్తూ ఒకవ్యాపారి; అతడి కావల ఫేడా, జిలేబీ అంటూ అన్నిరకాల మిఠాయి దుకాణాలు. రకరకాల దుస్తుల్లో స్త్రీపురుషులు ఒకరినొకరు త్రోసుకుంటూ కోలాహలంగా తిరుగుతున్నారు. వెదురుతో చేసిన వేణు వొకటి నాదంటే నాదని ఇద్దరు కుర్రవాళ్లు దెబ్బలాడు కుంటున్నా రొకచోట. బేరాలమీద బేరాలు, ధరలకు సంబం ధించి వాదాలు, 'కొన్నావులే పొమ్మని' కొందరు, 'అమ్మే బేరమేనా' అని కొందరు; 'ఏమండోయ్ గుర్తున్నానా?' అంటూ చుట్టరికాలు తిరగేసేవారు కొందరు. సంతంతా మహాసందడిగా ఉంది.

వీధిమధ్యన ఎత్తుగా నిలబడి నలుగురిదృష్టినీ ఆకర్షిస్తు న్నాడు బాల్హిక్ మిత్రమండలి యువకసభ్యు డొకడు. తల పాగా పైన 'శ్వేత (లిల్లీ) పుష్పము' నొకదానిని ధరించాడు. గళగ్రాహిగా వాగేస్తున్నా డేమిటో. ఎవరైనా వింటున్నారా లేదా అనేది అతడికి పట్టలేదు. వాడికున్నదల్లా అంతులేని ఓపిక. ఓపికగా ఊపిరాడకుండా అరుస్తున్నాడు. "ఈపక్క కూర్చొనివున్న బిచ్చగానిని చూడండి. కొందరు ఓకాని విసిరివేస్తే వేస్తున్నారు. మరికొందరు అటుచూడనైనా చూడకుండా పోతున్నారు. పగలంతా ఇట్లాపడిఉండి రాత్రి గుడిసెకు చేరేసరికి పట్టెడు మెతుకులైనా దొరుకుతాయో దొరకవో? ఎంత దుర్భర జీవిత మితనిది! ఎందుకవుతున్న దిలా? మనదేశపు దౌర్భాగ్య మిది. బాక్ట్రియాలో బిచ్చగా డనేవా డుండడు. తిండి లేకపోవడం అనేది వారికి తెలియదు. ఎంత

అల్పునికైనా ప్రభుత్వ ఆదరణ ఉంటుంది. ప్రభుత్వ సంక్షేమ శాఖ పేదలకు తిండి, గుడ్డ, ఇల్లు ఏర్పాటు చేస్తుంది. అయితే బాక్ట్రియా ప్రజలకు పేదరికం ఉండదుకూడా. నేచెప్తున్న దీనినంతా బాక్ట్రియా వెళ్ళివచ్చిన మనపౌరులు కళ్ళారా చూచారు"... వాగేస్తున్నాడు ఆ యువకుడు. వినే వాళ్ళు ఆట్టే లేరు. ఏ మందులవాడోననుకొని ఒకరిద్దరు ఆగినా, అదికాదని తేలగానే తమత్రోవన తాము వెళ్లేవారు. ప్రజలు విన్నాసరే వినకపోయినాసరే అతడికేమీా పట్టలేదు.

వన్నెల విసనకర్రల బృందమొకటి తళుకుబెళుకులు చూపుకుంటూ ఆసంతలో తిరుగుతోంది. వారంతా బాల్హీక్-ఉజ్జయినీ మిత్రమండలికి చెందిన సుందరాంగులు. ప్రతివారు ఒక అందమైన పళ్ళెంపుచ్చుకొని జాతులమధ్య ప్రేమసహకార ప్రబోధాలు వినిపిస్తూ విరాళాలు సేకరిస్తున్నారు. ఎలా సంబోధించి జనాన్ని ఆకర్షించాలో వారికి బాగా తెలుసు. అమ్మా, అన్నా, అక్కా, అయ్యా అంటూ మనిషినిబట్టి సంబోధిస్తూ విరాళా లడుగుతున్నారు. అడపాదడపా ఒక నాణెం పళ్ళెంలో పడడంకూడా జరుగుతోంది. చాలామంది అటువైపు చూడకుండాకూడా వెళ్తున్నారు. అయితే ఈ వింతభిక్షుకత్వం ఏమిటో, ఎందుకోమాత్రం ఎవరికీ తెలియదు.

ఇద్దరు బిచ్చగాళ్ళు జనసంచారం ముమ్మరంగాఉండే తమ మామూలు స్థానాల్లో కూర్చొని ఉన్నారు. ఏడేళ్ళుగా వా ళ్ళక్కడే కూర్చుంటున్నారు. ఆస్థలము వారికి వారితల్లి

దంద్రులనుండి సంక్రమించిన వారసత్వం. ఆస్థలంలోనే తమ వృత్తిని నిర్వహించాలని ఈ కుమాళ్ళ అభిప్రాయం. అందులో ఒకడన్నాడు. "ఇకమనం మాడిచావక తప్పదు"

"ఏం? ఏంజరిగింది?" అదిరిపడి అడిగాడు రెండవాడు.

"వాళ్ళు మనకు పోటీకివస్తే మనకు బిచ్చంవేసే దెవరు?" అన్నాడు వన్నెల విసనకర్రలవంక చూపిస్తూ.

ఆ రెండవవాడికి ఒక కన్ను లేదు. రెండవది సరిగా కనిపించదు. అయినా అటుపక్కకు చూచాడు. ఏమీ కనిపించలేదు. "నాకెవరూ పోటీదారులు కనిపించడంలేదే?" అన్నాడు.

"ఆ ఉన్నకంటితో సరిగాచూడు. నాకుకనిపించేవారు నీకూ కనిపిస్తారు"

"నిజమే, అక్కడెవరో ఉన్నారు. అయితే బిచ్చంవేసే వాళ్ళేగాని అడిగేవాళ్లుకాదే?"

"అయితే వెళ్ళి అడుగు వేస్తారేమో" అన్నాడు మొదటివాడు.

ఆ ఉన్న ఒంటికంటితో వెదుక్కుంటూ వెళ్ళి అడిగాడు "అమ్మా! ధర్మం చేయండి" అంటూ.

ఆ వన్నెలవిసనకర్రకు ఒళ్ళుమండింది. "అమ్మా అంటావు. కళ్ళుకనిపించడంలేమా?" అంది.

"అయితే నాదురదృష్టం మీకూ కొంత పట్టిందన్న మాట" అన్నాడు గ్రుడ్డివాడు శ్లేషగా.

"అంటే?"

"నాది గుడ్డికన్ను నే విషయం తమకు కనిపించడం లేదన్నమాట..."

ఆవిడకు మరీ ఒళ్ళుమండిపోయింది. అయినా కాస్త తమాయించుకుంది 'మండలి సభ్యుడు లేదా సభ్యురాలు ఎవరూ బయట కోపం తెచ్చుకోకూడదు' అనే మండలి సూక్తిని గుర్తుచేసుకున్నది. కోపాన్ని దిగమింగి మామూలు స్వరంతో అన్నది: "నీకు ఒక కన్ను కనిపిస్తుంది కదూ! మరి నన్ను అమ్మాఅని పిలుస్తున్నావు నీకు బుద్ధిపమైనా మందగించిందా?"

"ఒక్క కన్ను కనిపిస్తోందికనుకనే అమ్మా అని పిలిచాను."

"రెండూ కనిపిస్తే ఏమనిపిలిచేవాడివేం?"

"అలా అయితే అమ్మమ్మా అని పిలిచేవాణ్ణి" అన్నాడు బిచ్చగాడు కొంచెం బిరుసుగా. ఇక ఆవిడ అక్కడ నుండి కోపంతో చరచరా వెళ్ళిపోయింది.

గుడ్డివాడు స్వస్థానానికి వచ్చి "పర్వాలేదు. మనకు వారి పోటీ బెడద ఏమీలేదు" అన్నాడు మొదటివాడితో.

"అదెట్లా?"

"సరియైన బిచ్చగాడు వాదనకు దిగడు. ఈవృత్తిలో జయంపొందాలంటే అవమానాలు దిగమింగడం నేర్చుకోవాలి. చిరుబుస్సులాడితే లాభంలేదు."

"నీవన్నది నిజం. అయితే వాళ్ళట్లా ఎందుకు ప్రవర్తిస్తారంటావు?"

"వాళ్ళకు ఇదో వినోదం. డబ్బున్న వాళ్ళకు కొన్ని వెర్రులుంటాయి. బిచ్చగాడి ఆట ఆడుకుందా మనుకున్నారు. వచ్చారు. అంతే."

"అంతే కదా. బ్రతికాం" అంటుండగా ఎవరో వ్యాపారి అటువచ్చాడు.

"గుడ్డోళ్ళం బాబూ. ధర్మం చేయించండి. మహా కాళస్వామి మిమ్మ రక్షించాలె" అంటూ గిన్నెలు జాపారు. చెరొక నాణెం విసరి దూరంగా ఉన్న ఓ వయ్యారివంక చూచుకుంటూ గబగబా వెళ్ళిపోయాడా వ్యాపారి.

౮

పురగుప్తుని సానుభూతిచలవన, రోమని, బక్షునాథుడు తదితర శ్వేతహూణుల కృషిచలవన ఉజ్జయినికి ఒక పెద్ద మిత్రమండలి ఏర్పడింది. ఎందరో స్త్రీ పురుషులు సభ్యులుగా చేరారు ప్రతిసభ్యునికి, సభ్యురాలికి నెలనెలా మంచి పారితోషికం ముట్టుతోంది. అయితే వారి వారి పారితోషికాలమీద ఒక రహస్యపు తెరవుంది. ఎవరికెంత ముడుతోందో ప్రక్కవారికి తెలియదు. ఈసొమ్మంతా ఎక్కడనుండి వస్తోందో ఎవరికీ తెలియదు.

"మీకీ డబ్బంతా ఎక్కడిద"ని ఎవరైనా అడిగితే మృదువుగా "ప్రజాసేవా కార్యకలాపాలకు ప్రజలే విరాళాలిస్తున్నారు. మండలిసభ్యులు బహిరంగంగా ప్రజలనుండి విరాళాలు సేకరించడం తాము చూస్తూనే ఉన్నారు కదా?"

అని సమాధానమిచ్చేవారు. అయితే గణితానికి పక్షపాతం తెలియదు. విరాళాల పేరుతో వచ్చే నాలుగు డబ్బులూ, ఈఅంతులేని మాసికవేతనాలలో (అది ఎంతో ఎవరికీ తెలియదు) లవలేశమైనా ఉందని గణితం అంగీకరించదు. ఈ రాబడి విషయ మొక దుర్భేద్యమైన రహస్యం. దీనికి సంబంధించి అనేక సందేహాలు వ్యాపించాయి గాని అవి ఋజువుకు అందడంలేదు. ఋజువులు దొరకని వాస్తవాలు ప్రపంచంలో అనేకం ఉంటాయి. ఋజువులు దొరకనంత మాత్రాన అవి అసత్యాలు మాత్రం కాబోవు.

ఈ మిత్రమండలి ఎలాపనిచేస్తున్నదో వివరించే ఒకటి రెండు ఉదాహరణలు మనకు కనిపిస్తాయి. దాని పద్ధతులు వాటి వల్ల అర్థ మవుతాయి. బాక్ట్రియాఎడ స్తోత్రగానాలు, ఉజ్జయిని మీద నీచ ప్రచారాలు - ఈ మండలి కార్యకలాపాలలోని ముఖ్యాంశాలు. ఎదుటివారిని మెప్పించేందుకు మొదట బ్రహ్మాండమైన స్తోత్రం చేయడం జరుగుతుంది. ఇలా ఒకటి రెండుసార్లు జరుగగానే దానిని ఉపసంహరించుకోన డానికి ఇరకాటం వస్తుంది. పదిసార్లనడంలో పచ్చిఅబద్ధం కూడా నిజమై ఊరుకుంటుంది.

మిత్రమండలి కార్యకలాపాలు అతి విచిత్రాలు. అవి సమ్మోహనం కల్గించే విచిత్రాలు. అవకాశం లభిస్తేచాలు— శ్వేత (లిల్లి) పుష్పధారుల ఊరేగింపొకటి తీస్తారు. వందల మంది యువతులు, యువకులు రంగురంగుల దుస్తుల్లో చేతుల్లో శ్వేతపుష్పాన్ని ధరించి బారులుతీరి నడుస్తారు.

జానపదనృత్యాలు, గీతాలు (అవీ శ్వేతపుష్పం మీదనే) వినాదాలు జరుపుతారు. సమయాసమయాలతో నిమిత్తం కూడా లేకుండా "శ్వేతపుష్ప దినోత్సవా"లంటూ కోలాహలంచేస్తారు. తరచు వాటన్నిటిని నృత్య గాన వినోదాలుగా, బుట్టబొమ్మలాటలుగా, కథా కాలక్షేపాలుగా, బుర్రకథలుగా నిర్వహిస్తారు. ఆయా సందర్భాలలో వచ్చేపోయే వారికి శ్వేతపుష్ప బహూకరణలు చేస్తారు. ఈమాదిరి హడావిడి జరిగిన ప్రతిచోట జనం గుంపులుగుంపులుగా మూగుతారనేది వేరే చెప్పనక్కరలేదు. జనం గుంపులుగా చేరిన ప్రతిచోట మిత్రమండలి సభ్యుడో సభ్యురాలో అవతరించి బాక్ట్రియా స్తోత్రగానాలు, ఉజ్జయినీ విషాద గీతాలు ఆలపించడం మొదలెడతారు.

మిత్రమండలి కేంద్రకార్యాలయాన్ని "శ్వేత పుష్ప" మనే అందమైన భవనంలో ఏర్పాటుచేశారు. లోగడ అది సున్నపుగుల్లను నిలువచేసే గిడ్డంగు. దానినంతా ప్రస్తుతం మార్చివేసి అద్భుతంగా తయారుచేశారు. దానికి కొత్త రూపము, కొత్తనామము ఇచ్చారు. భవనం లోపలిభాగంలో సమస్తవిలాసాలు స్వాగతం పలుకుతుంటాయి. అమూల్య వస్తుసంపద ఆశ్చర్యం కల్గిస్తూ ఎదురవుతుంది. ఇదంతా ప్రజావిరాళాలవలన వచ్చినవనిచెప్తారు.ఎప్పుడైనా ఓ బిచ్చగాడటు వెళ్లడం కద్దు. "బిచ్చం వేయండమ్మా"అని అడిగితే "పోయి ఏదైనా పని చేసుకోరాదూ" అంటూ తిట్లతో సహా గెంటివేయడం మామూలు. అక్కడికి ఒకసారి సాతాని

జియ్యరొకడు వెళ్లాడు. ఏవో హరినామస్మరణలు చేసి భిచ్చాని కెదురుచూస్తున్నాడు. మామూలుగా లోపలినుండి "పోయి ఏదైనా పని చూసుకోరాదూ?" అంటూ ఒక పొలికేక వచ్చింది. జియ్యరు ఊరుకోక "హరికీర్తనం పని కాదూ?" అన్నాడు. ఇంకొకరోజున విదూషకుడు వసంతుడు అటు వెళ్తుంటే అతడికి వినబడేట్లుగా ఆ భవనంనుండి ఒకడు "సోమరిపోతులకు ఈనగరంలో బ్రతికే అధికారం లేదు" అని అరచాడు. వెంటనే విదూషకుడు "మీ ఆదాయవ్యయా లెవడికి తెలుసు? ఈతిండి అంతా మీ కెక్కడినుండి వస్తోందో అడిగేవా రెవరు?" అని ఎదురు పొలికేక పెట్టాడు.

సుఖసంపదలకు నోచుకోనిపౌరు లనేకమంది, ఈ ప్రచారాల ప్రభావాన శ్వేతహూణులంటే మోజుపడి పోతున్నారు. అయితే హూణుల పలుకుబడికి యువరాజాశ్రయం, కొందరు మంత్రులసానుభూతి ముఖ్యకారణాలని అంగీకరించాలి. అసలు ప్రధానమంత్రే రోమనికి నిత్య అతిథిగా తయారు కావడంతో వారి అదృష్టం పండినట్లే అయింది. సురపాలునికి ఇటీవలివరకు మధువల్లరిమీద అభిమానం. నేడు ప్రధానమంత్రి, యువరాజు, సేనాపతి ముగ్గురూ రోమని కనుసన్నలలోని వారైనారు. నేడు పౌర, రక్షణ విభాగాలు రెంటిమీద ఆమెకు అధికారం చిక్కినట్లయింది. ఒకప్పుడు రోమనికి మధువల్లరి అడ్డంకుగా ఉండేది. నే డాపరిస్థితిలేదు. ఇప్పుడు ఆమెకు ఉన్నఅడ్డంకు అంతా సామ్రాట్టు అయిన బుధగుప్తుడే. ఆయన అమాత్యవర్గమంతా ఆత్ర గాళ్లయిన

స్వార్థపరులకు నిలయం. ఇప్పుడు వారందరి కార్యస్థానము రోమని నివాసస్థానమైన మణికుటీరానికి మారింది. బక్షు నాశుడు కనుసైగ చేయగానే ఆమె అర్థం చేసుకున్నది— ముఖ్యమంత్రి, యువరాజు, సేనాపతుల వంక గోముగా చూస్తూ "ప్రభుత్వోద్యోగాలను ఉజ్జయిని - హూణ మైత్రీ ప్రియులకు ఇస్తే బాగుంటుందని" సూచన విసిరింది. ముగ్గురికీ ఈ ఆలోచన బాగానే ఉందనిపించింది. ఆమె సూచనకు ఆమోదముద్ర వేశారు. ఆమె ఆమోదం పొందినవారినే మంత్రులు, కార్యదర్శులు, ఉపకార్యదర్శులు, లాంఛన విభాగ ప్రముఖులు, సైన్యసాధనోత్పత్తి శాఖా ప్రముఖులు, యుద్ధ తంత్రజ్ఞులు, సాంస్కృతికవిభాగాధికారులు — ఈ మాదిరి ప్రతిఅధికారములోను శ్వేతహూణులకు అనుకూలమైన వారు చేరారు. ఈమైత్రీ సంఘే వారికి మార్గదర్శి. రోమని చూపులకు సమ్మోహితులై వారంతా మోహంతో అగ్నిలోపడే శలభాలుగా తయారైనారు.

౧౯

మధువల్లరి అభిమానులు క్రమంగా తగ్గజొచ్చారు. క్రమంలో ఆమెభవనంలో కలకలం దాదాపు శూన్యం కాజొచ్చింది. మొదట్లో దీని నామె గమనించనేలేదు. తీరా అది పూర్తయేసరికి వేదాంతిలాగా పట్టించుకోలేదు. వెళ్ళ వలసినవారు వెళ్ళిపోక తప్పదనుకుంది. ఊగికే ఇన్నిరకాల వాళ్ళు వస్తూండడంమాత్రం ఎందుకులెమ్మనుకుంది. ఒక

రోజున ప్రధానమంత్రికూడా రాకపోవడం గమనించింది. ఆతర్వాత వరుసగా పదిరోజులవరకూకూడా ఆతడు రాలేదు. మధువల్లరికి ఇప్పుడు కొంచెం గుచ్చుకున్నది. ప్రధానమంత్రి సామాన్యుడుకాడు. రాజ్యంలో తన కీ వైభవం ఉన్నది ఆయనవల్లనే. చివరకు ఒకరోజున ఆమెదాసి అతణ్ణిగురించి వర్తమానం తెచ్చింది. అతడి ఆరోగ్యం మొదలైనవన్నీ బాగానే ఉన్నాయనీ, పెద్దపనులలోకూడా ఏమీ మునిగి లేడనీ, ప్రస్తుత మాతడు రోమని భవనంలో చేరుతున్నాడనీ, ఒక్క సాయంత్రంవేళమాత్రమే కాకుండా, అవకాశం చిక్కినప్పుడల్లా అక్కడే గడుపుతున్నాడనీ తెలియజేసింది.

మధువల్లరి చప్రున లేచింది. క్రోధంతోను, అసూయతోను ఆమెకన్నులు కెంపులయినాయి.

"ఎక్కడికమ్మా బయల్దేరుతున్నారు?" అని అడిగింది దాసి.

"పనివున్నది" అని చెప్పింది ముక్తసరిగా.

"అయితే నేను సహాయపడవచ్చునా?" అన్నది దాసి మృదువుగా.

"నీ విక్కడేఉండు" అని ఆజ్ఞచేసి ఆచీకట్లో బయల్దేరింది. రోమని భవనంలో వెలుగుతుండే దీపాలు ఆమెలక్ష్యం. అటువైపే వెళ్ళింది.

అక్కడ అప్పుడే సురాపానాలవిందు పూర్తయింది. యువరాజు పురగుప్తుడు రోమనివద్ద సెలవుతీసుకొని వెళ్ళి

పోయాడు. రోమనికూడా మెల్లగా రాత్రి భోజనం ముగించుకొని, పళ్లు గుచ్చుకుంటూ ఒంటరిగా తన గదిలో కూర్చుని ఉంది. మధువల్లరి భీకరరూపంతో ఆగదిలోకి జొరబడింది. ఆభవనానికి వెళ్ళడం ఆమె కిదే మొదటిసారి. ఆమెను చూడగానే ఏదో గొడవ తప్పదనుకున్నది రోమని. అయినా తమాయించుకొని మృదుమధురంగా "రా! అక్కా! నీ ఆగమనంతో నామందిరం పావనమైంది" అంటూ ఆహ్వానించింది.

ఈ వినయ వచనాలేమీ మధువల్లరిపై పనిచేయలేదు. "నేనుకూడా వంచనాశిల్పములో ఆరితేరినదానినే. నీవొక్కతెవే అందులో నిపుణురాల వనుకొనవద్దు. నీనటనలు నావద్ద వద్దు. వాటిని నీవిలాసగాండ్రవద్ద ప్రయోగించు. ఏమిటి నీవ్యవహారం? నాకు చెప్పుముందు" అన్నది చాలా కఠినంగా.



వ్యాపారస్తునికి పెట్టుబడివలె, నిగ్రహం అనేది రోమని సొత్తు. అందువల్ల ఆమె చలించలేదు. "ముందు కూర్చో అక్కా! తర్వాత మాటాడుకుందాం" అన్నది.



"నీ స్వాగతాలు, మర్యాదలు చాలు. ముందు నా ప్రశ్నకు సమాధానమివ్వు" అరచింది మధువల్లరి.

"అక్కా! నీవు చాలా అలసినట్లున్నావు. కాస్త మాధవీమధురాన్ని సేవిస్తావా?"

"నీ మధురపానీయాలను, మధురవచనాలను నీ యువరాజుకోసం ఉంచుకో"

"రోజూ యువరాజు నా భవనాన్ని తమపాదధూళితో పావనం చేసి నా మధురపానీయాలను సేవిస్తూనే ఉన్నారు. ఈమధ్య కొత్తగా ప్రధానమంత్రివస్తున్నారు. నా పానీయాలంటే ఆయన మరీ మోజుపడిపోతున్నారు" అన్నది కొంచెం కొంటెగా రోమని.

"నీ మధురవచనాలకు కూడా ఆయన మోజుపడి పోతున్నారనుకుంటాను" అన్నది మధువల్లరి.

"నీ మాట కాదనలేను. నీవు సరిగానే ఊహించావు".

"నీ మధురావేశాలను ఆయన మీదకూడా ఎందుకు కుప్పిస్తున్నావు ?"

"అది ప్రతిపురుషునికి కావల్సినది. పైగా ఆయన పూర్వసహచరి ఆయనకు దాన్ని చాలినంతగా కుప్పించినట్లు లేదు."

"అదేమీ లేదే ?"

"అయితే ఆయన ఇటువైపు ఎందుకు వస్తారు ?"

"అది నీ వ్యూహంవల్ల !"

"అని నీ అభిప్రాయం. ఈ ప్రశ్నలన్నీ నీవు నన్ను అడిగేబదులు ఆయననే అడగరాదూ ?"

"రోమనీ! ఇటుచూడు. నీకు కొన్ని వాస్తవాలు చెప్తాను. ధైర్యంఉంటే అవి మనసుకు పట్టించుకో. నా మధురవచనాలు కేవలం ఆయన హృదయాన్ని వశం చేసుకునేంతవరకే. ఆయన హృదయం నాకు వశమయ్యే ఉన్నది. ఇక నీమధుర ప్రసంగాలో ? వాటి అంతర్యాలు వేరు."

"ఏమిటో ఆ ఆంతర్యాలు?"

"నీ తళుకుబెళుకులతో నీవు అధికారులను వశంచేసుకుంటున్నావు. ఆతర్వాత రాజ్యవ్యవహారాలనే వశంచేసుకోవాలని చూస్తున్నావు."

"అవన్నీ నాకెందుకు?"

"నీప్రశ్నకు సమాధానము నీకే తెలుసు."

"కాస్త నీభావంకూడా వివరంగా వినిపించు"

"అయితే విను. శ్వేతహూణులు ఈ నగరంలో ఏర్పాటుచేసిన పంజరానికి నీవు. ముఖ్యులను వశంచేసుకొని శ్వేతహూణుల అధికారాన్ని ఎక్కువచేయడం నీ పని"

"కాని ఎందుకు నే నాపనిచేయడం?"

"ఎందుకా? హూణులైన మీరంతా గుప్తసామ్రాజ్యాన్ని వశంచేసుకో జూస్తున్నారు కనుక."

"అదే కావాలంటే యుద్ధం చేసుకోకూడదు?"

"మీరు కొంతకాలంక్రితం అదీ ప్రయత్నించారు మీ వీపులమీది గాయా లింకా మానలేదు. ఇప్పుడు కొత్త పథకం వేశారు."

"ఆహా. మరి ఈ కొత్తపథకపు వివరా లేమిటో?" ఎగతాళిగా అన్నది రోమని.

"నగరంలో అరాచకత్వం రేపి, ప్రభుత్వ యంత్రాంగాన్ని వికలంచేయడం."

"ఓహో! బాగు బాగు! మంచి కొత్తకొత్త యోచనలే!"

"కొత్తయోచనలో పాతయోచనలో అదంతా నాకు పట్టదు. మీవాళ్ళు మాదేశంలో అరాచకబీజాలు వెదజల్లి, మా దేశాన్ని ధ్వంసం చేయాలని చూస్తున్నారనిమాత్రం నాకు తెలుసు."

"అమ్మాయీ! నీ కేదో కొత్త వెర్రి పట్టినట్లున్నది?"

"అది జరగలేదు కనుకనే నేనీమాత్రం ఆలోచనతో మాట్లాడుతున్నాను."

"అదే నిజమైతే, నావంటి ఒక అబల ప్రభుత్వాయంత్రాంగాన్ని వశంచేసుకోవడం, ఈ అధికార రాజకీయాలలో ఈదులాడడం ఎలా సంభవ మనుకుంటున్నావో కొంచెం ఆలోచించి చెప్పు."

"కేవలం మామూలు స్త్రీలకది సాధ్యంకాదని నాకూ తెలుసు. కాని వ్యభిచారులకు అది సాధ్యమైన విషయం."

"అయితే నీవు నన్ను..." అని రోమని ఉక్రోషంగా అంటుండగానే మధువల్లరి పూర్తిచేసింది— "వ్యభిచారి" అంటున్నాను. "నీవు వ్యభిచారివి. పడుపుగత్తెవు. విషకీటకానివి. ఇంకా..." అంటుండగానే రోమని విరుచుకు మీదపడ్డది— "నీకు చావుమూడింది. నీవో నేనో ఒక్కరమే ఇక బ్రతుకుతాం" అంటూ.

"రావే. నీచపు..." అంటూ మధువల్లరికూడా ఎగ

బడింది. ముండా, ముతకా, కుంకా, కుక్క, నక్క అను కుంటూ ఒకరినొకరు తిట్టుకోవడం ప్రారంభించారు.

భగవంతుడు మామూలుగా స్త్రీలకు కండలలో శక్తి నివ్వడు. శక్తినంతా నాలికకు ఇస్తాడు. కాని ఇక్కడ ఉన్నది తెగతిని బలిసిఉన్నవాళ్ళిద్దరు. పరిస్థితి నోళ్ళుదాటి చేతులవరకు వెళ్ళింది. ఒకరిజుట్టు ఒకరు పట్టుకున్నారు. గీక్కున్నారు. రక్కుకు న్నారు. గుడ్డలుచింపుకున్నారు. ఒకరిరక్తంఒకరు కళ్ళజూచారు. నున్నని ఆబండలమీద, మెత్తని తివాచీలమీద దొర్లాడు కుంటూ కొట్టుకుంటున్నారు. నోటికివచ్చిన తిట్లను ప్రయో గిస్తున్నారు. వారి నోటినుండివస్తున్న బండబూతులకు ఎంతి లజ్జలేని నీచాతినీచమైన స్త్రీకూడా సిగ్గుపడిపోయేలా ఉన్నాయి. వారి నాగరికత, సంస్కృతి, సున్నితత్వం, మృదుత్వం, మాధుర్యం అన్నీ ఎక్కడికిపోయాయో! త్రాచుపాము కుబుసాన్నివదలి బయటపడ్డట్లు వీటన్నిటిని వదలి బరితెగి, నగ్నంగా, నీచంగా, రోతగా తమ ప్రవృత్తులన్నీ బయటపెట్టుకుంటూ తిట్టుకుంటున్నారు. కొట్టుకుంటున్నారు. ఇదే ఒక రణరంగంలో అయితే ఎవరు గెలుస్తారోకూడా చెప్పడం సాధ్యంకానంత సమఉజ్జీలుగా ఉన్నా రిద్దరూ. ప్రస్తుతరంగం అలాంటిదికాదు. రోమనిభవన మది. అందు వల్ల ఆమె దాసదాసీజనం పరుగెత్తుకు వచ్చారు. రోమని కనుసన్నలకోసం చూస్తూ—

"దాని ప్రాణం తీస్తాం" అని ఒకరు.

"భటులను పిలవనా?" అని ఒకరు.

"భటులెందుకు? మనమే ఈముండను అంతంచేద్దాం" అని ఇంకొకరు అరుస్తున్నారు. ఇంతలో మధువల్లరి రోమని గుండెలపై కూర్చొని గొంతు పిసికివేస్తోంది. రోమనికి ఊపి రాడక "ఓ మల్లికా నాగదిలో కత్తెర తెచ్చి ఈ దయ్యాన్ని పక్కకు గుంజండి" అంటూ కేకపెట్టింది. నల్గురూకలిసి మధు వల్లరిని గుంజి నేలమీద అదిమిపట్టారు. రోమని లేచి మధు వల్లరి తలను అంటకత్తెర వేసింది.

తన జీవితమంతా సుందరంగా పోషించుకుంటున్న పట్టుకుచ్చులవంటి సుదీర్ఘములైన కేశములను నేలమీదచూచి మధువల్లరి నేలకరచుకు ఏడ్చింది. ఇంతకన్న ప్రాణంతీసిఉంటే అంత బాధపడేదికాదు. ఒక స్త్రీకి ఇంతకన్న ఘోరమైన శిక్ష ఉండదు. ఒక స్త్రీ తప్ప మరెవరూ అంతటి ఘోరమైన శిక్ష నమలు చేయలేరు.

మధువల్లరి ఇక అక్కడ ఉండలేకపోయింది వళ్ళు తెలియనిస్థితిలోనే పారిపోయింది పోతూపోతూ ద్వారంవద్ద ఉన్న నిలువుటద్దంలో తన వికృతాకారం చూచి భోరున విల పించింది. ఒక్క నిముషం దుఃఖాన్ని దిగమ్రింగింది. ఆ అద్దంలో మరొకసారి చూచుకున్నది. ఎవరీ కుర్రవాడు? చిన్ననాడే తనకు దూరమైపోయిన తమ్ముడా? మళ్ళీ వెంటనే కుమిలికుమిలి ఏడ్చింది. ఇక నిలువలేకపోయింది. ఆ కటిక చీకటిలో కలిసిపోయింది.

ఆ చీకట్లో పరుగెత్తింది. విసుగెత్తేవరకు పరుగెత్తింది. చినిగిపోయిన దుస్తులు, ముఖమంతా రక్కులు, గాట్లు,

నెత్తుటిచారలు. ఒళ్ళంతా నొప్పులు. భరింపలేని బాధపడ్డది. ఆమెకు తెలియకుండానే కాళ్ళు లక్ష్మీనారాయణ మందిరానికి చేరవేశాయి ఆమెను. ఆమెవద్ద ఎప్పుడూ ఆ దేవాలయపు రెండవ తాళంచెవి ఉంటుంది. తలుపు తెరిచింది. భోరున విలపిస్తూ స్వామిపాదాలపై పడిపోయింది. తల బాదుకుంది: "స్వామీ ఇదా నీదాసికి శిక్ష? జీవితమంతా నిన్నే నమ్ముకుని ఉన్నానే? తన మన ధనముల ధారబోసి నిన్నే సేవించానే? చివరకు నన్నీగతికి తెస్తావా స్వామీ? నా నోముల ఫలిత మిదా ప్రభూ? అమ్మా లక్ష్మీ! చూడు తల్లీ నా స్థితి. నాకు నగలు నాణ్యాలు ఏమీవద్దు. అన్నీ తీసుకో తల్లీ. నా కురులు నాకిప్పించు తల్లీ. నేను ప్రపంచంముఖం ఎలా చూడను? నా ముఖాన్ని ఎలా చూపించను? నీవైనా కనిక రించవా తల్లీ?" అంటూ గోడుగోడున విలపిస్తుండగా ధారలు కట్టి ప్రవహిస్తున్న రక్తం చేతికి తగిలింది ఒక్కసారి దుఃఖా న్నంతా దిగమ్రింగింది. లేచింది. ఇక చరచరా వెళ్ళిపోయింది. ఎక్కడికి వెళ్ళిందో, ఏమైందో ఎవరికీ తెలియదు. మరునాటి నుండి ఆమహానగరంలో ఆమె మళ్ళీ ఎక్కడా కనిపించలేదు. దేవదాసీల రాణి అయిన మధువల్లరి గుర్తుకూడా తెలియ కుండా అదృశ్యమైపోయింది!

## ౨౦

వర్షంతో సింధూనది వరదలెత్తిపోయింది. అతివేగంగా కొండజాలుల్లో పడి జారుకుంటూ, దొర్లుకుంటూ, హోరు మంటూ, ధనధన లాడుకుంటూ, తుంపర్లు రేపుకుంటూ, సుళ్లు

తిరుగుతూ ప్రవహిస్తోంది గులకరాళ్లు అలలవెంటబడి ఒక దాని నొకటి పోటీలతో త్రోసుకుంటూ ముందుకు పరుగెడు తున్నాయి. నురగలు, బుడగలు వెర్రెత్తినట్లు పరుగిడు తున్నాయి. ఘన గంభీరమైన ఆ మహా ప్రవాహపు హోరు దేనినీ లక్ష్యం చేయకుండా, తనపై తిరుగాడుతున్న నౌకలతో కూడా నిమిత్తం లేకుండా, కట్టలవద్ద ధనధన శబ్దాలతో నిమిత్తం లేకుండా నిరంతరమైన పవిత్రప్రణవనాదంతో లీనమైపోతున్నట్లుగా వినిపిస్తోంది. ఆ రాళ్ళదీవికి నేడు ప్రపంచంతో సంబంధమే లేదు. దీవికి ఉత్తరాన, దక్షిణాన, ఇటు అటూ, దూరాన దగ్గర - ఎక్కడ చూచినా ఒకేఒక అఖండ ప్రవాహం. దూరంగా మంచుతెరల్లో ఉన్నట్లుగా గట్లు కనిపిస్తున్నాయి. ఉత్తర దక్షిణాలలో అవీ లేవు. అనంత సాగరంలా కనిపిస్తోంది. మధ్యన అది ఒక బ్రహ్మాండమైన పద్మమువలె ఉన్నది.

వర్షఋతువులో నదికి హద్దుల్లేవు. కొండవద్దకు యాత్రికులు తమ కానుకలతో, ఫలపుష్పాదులతో రావడం అసాధ్యమైపోయింది. పుష్యభూతికి అది నిజంగా పరీక్షా సమయమైనట్లయింది. ప్రకృతి వైచిత్ర్యాలే లేకపోతే అత డీపాటికి ఆకలితో మాడి మరణించి ఉండవలసిందే! ఆ కొండ గుహల్లో రకరకాల పక్షులు, గబ్బిలాలు తల దాచు కుంటాయి. అనేక పక్షులు గూళ్ళు కట్టుకొని ఉన్నాయి. అవి తెచ్చి దాచుకున్న పండ్లు, ఫలాలు, పప్పులు కొన్ని అక్కడక్కడా పడిఉన్నాయి. వాటితో పొట్ట పోసుకొని

ప్రాణం నిలుపుకున్నాడు. అతడికి కావల్సినదెంత? పట్టె డాహారం చాలు ప్రాణం నిలుపుకోడానికి. గట్లమీద ప్రజలు ఆ 'యోగి'ని గురించి ఆశ్చర్యపడి పోతున్నారు—'ఆ విపరీత సమయంలో కడుపుకు తిండైనా లేకుండా అత డా కొండ కొమ్మమీద ఎలా బ్రతుకుతున్నాడా' అని. యోగాభ్యాస ప్రభావాన ఆహారంలేకుండా ఉన్నాడు గాబోలు అను కున్నారు. ఆయనపై వారి భక్తివిశ్వాసాలు మరింత గాఢమై నాయి.

* * *

లోగడవలెనే కాలం మామూలుగా ఉన్నట్లయితే మధువల్లరి అదృశ్యం కావడం నగరంలో విపరీతమైన సంచ లనం కలిగించి ఉండవలసింది. కాని ప్రస్తుతం ఆలోపం ఎవరికీ కనిపించలేదు. ఆమె అభిమానులు, పెద్దపెద్ద అధికారులు చాలాకాలంక్రితమే ఆమెను విడచి వెళ్ళారు. అసలామె ఉన్నట్లే వారికి పట్టలేదు. ఇక వెళ్ళినట్లు మాత్ర మెందుకు అనిపిస్తుంది!, దేవదాసీలకు మాత్రం తమ నాయకురాలు వెళ్ళిపోయిన సంగతి తెలిసిపోయింది. ఎక్కడికివెళ్ళిందో, ఎందుకు వెళ్ళిందో మాత్రం వారికి అంతు చిక్కలేదు. కాసేపు కొంచెం తమలోతాము గుసగుసలాడుకున్నారు. ఆతర్వాత పూర్తి నిశ్శబ్దం వహించారు అసలు చాలా కాలంగా తమ నాయకురాలి ప్రభావం క్రమంగా తగ్గిపోవడం వాళ్ళు గమనిస్తూనే ఉన్నారు. ప్రధానమంత్రికూడా ఆమెకు దూరంకావడం వారికి చాలా ఆశ్చర్యం కల్గించింది. ఇది

తమకు, తమనాయకురాలికి దుశ్శకునమని ఏనాడో అనుకున్నారు. అందువల్ల ఆమె హఠాత్తుగా మాయంకావడం విపరీతమైన ఆశ్చర్యాన్ని మాత్రం కల్గించలేదు ఆమె వెళ్ళిపోవడానికి సంబంధించి ఊహాగానాలు చేశారు. ఏవేవో అపార్థాలు కల్పించుకున్నారు. శంకలు, సందేహాలు పడ్డారు. తమ భవితవ్యాన్ని గురించి ఆలోచనలు వచ్చేసరికి భయపడి పోయినారు వారి గొంతులు విచారంతో పూడుకుపోతున్నాయి. రోమనికి ఇష్టంలేని తమవారందరికీ క్రమంలో అదృశ్యం కావల్సిన గతి పట్టింది వారిసంగతి నగరానికి తెలియనే తెలియదు. అక్కడ ఇక్కడ విన్న ముక్కలనుబట్టి వారికిమాత్రం పరిస్థితి కాస్త అర్థమవుతోంది. మధువల్లరికి కూడా ఆగతే పట్టిఉంటుందని ఊహించుకున్నారు.

ఈ విషయాన్ని బహిరంగంగా చర్చించుకోవడం ప్రయోజనం లేదు సరిగదా ప్రమాదకరం కూడా రోమనికి గాని, బక్షనాశునికి గాని మరే శ్వేతహూణునికి గాని ఇష్టం లేని ఒక్కముక్క ఏదైనా అంటే బాల్హిక్ మిత్రమండలి వారి పనిపడుతుందని విశ్వసించారు. అలాంటివారిని ద్రోహులని, గూఢచారులని మిత్రమండలి దుమారం రేపుతుంది. బోలెడు 'సాక్ష్యం' సృష్టించి వారిఅంతు తేలుస్తుంది. 'నేరస్థుల'కు మరుక్షణాన, నిర్దాక్షిణ్యంగా శిక్షలు తప్పవు. కొందరిని కడతేర్చడం కూడా జరుగుతోంది. పాపం! ఇవన్నీ తలచుకొని ఆ దేవదాసీలు భీతావహులై పోతున్నారు. పెదవి మెదల్చడానికి గడగడలాడి పోతున్నారు.

పతనదశలో పడిపోయిన గుప్తసామ్రాజ్య పరిస్థితిని గుర్తించి తప్పించాలనుకున్నాడు మాఖారి అనే ఒక అధికారి. వెంటనే శ్వేతహూణులు దుమారం లేపారు. దానితో యువరాజు, ఇతర ఉన్నతాధికారులు ప్రస్తుతం అతడిని గుప్తుల ప్రత్యర్థిగాను, సామ్రాజ్యపు ప్రబల విరోధిగాను భావిస్తున్నారు!

చాలామంది దేవదాసీలు భీతావహులై నగరంనుండి ఎగిరిపోయినారు. ఉన్న కొద్దిమంది లక్ష్మీనారాయణస్వామి భక్తురాండ్రు. స్వామికి దూరం కావడం ఇష్టంలేక అక్కడే ప్రాకులాడుతున్నారు.

సంధింపబడిన విల్లు సంసిద్ధతకు చిహ్నం. చేయి వదలితే చాలు శరము దూసుకువస్తుంది. ఉజ్జయినీనగరం కూడా అలాంటి ఎక్కుపెట్టిన విల్లువలెనే ఉంది. ఏక్షణాన ఏమివిజృంభిస్తుందో అన్నట్లుంది. చరిత్రలో అది ఒక విషమఘట్టంలో ఉన్నది. బాధతో మూలుగుతోంది. భవితవ్యానికి సంబంధించిన అనిశ్చితస్థితిలో ఊగిసలాడి పోతోంది అయినా పౌరుల కెవరికీ ఇది అర్థంకావడంలేదు. పొంచిఉన్న ప్రమాదం వారికి బోధపడడంలేదు. ఏ క్షణాన ఎక్కడ గండిపడుతుందో ఏమీ వారికి ఊహాకందడంలేదు. భవిష్యత్తునూహించడంలో అశక్తత, ప్రమాదాన్ని చూచాయగా గ్రహించగల శక్తి — ఈరెండిటివల్ల వారిలో భయసందేహాలు ఇనుమడించాయి.

ప్రళయానికిపూర్వం ప్రశాంతంగా ఉంటుంది. ఉజ్జయిని స్థితికూడ అలాగే ఉంది. అక్కడ పెద్దగా వినవస్తున్నది "బాల్హీక్ - ఉజ్జయినీ మైత్రి వర్ధిల్లాలి" అంటూ మిత్రమండలి చేసే నినాదాలుమాత్రమే. పౌరులు మాత్రం వివరం తెలియనిభయంతో ఉన్నారు. బిడ్డ ఏడిస్తే తల్లి ' "ష్, వాళ్లొస్తున్నారు" జాగ్రత' అని బజ్జో పెడ్తోంది.

నినాద జీవులు ఉజ్జయినీనగర వీధులలో ఊరేగింపొకటి లేవతీశారు. "బాల్హీక్ - ఉజ్జయినీ మైత్రి వర్ధిల్లాలి" అంటూ గొంతులు చించుకుంటున్నారు. "ష్, వాళ్లొస్తున్నారు" అని గుసగుస లాడుకుంటూ తలుపులు వేసు కుంటున్నారు పౌరులు. "ష్, వాళ్లొస్తున్నారు" అంటు కిటికీలు మూసుకుంటున్నారు స్త్రీలు. "ష్, వాళ్లు రానేవచ్చా"రనుకుంటూ చేతిలో భజన చెక్కలుకూడా వదలి ఉడాయిస్తున్నారు వృద్ధులు. మిత్రమండలి వాళ్లని ఎవరినైనా పిలిచి "ఎవరయ్యా వాళ్లు?" అని అడిగితే- "ఉజ్జయినీ శత్రువులు. మా ఖారి మిత్రా వాళ్లు" అని సమాధానం వచ్చేది!

## ౨౧

దృశ్యము మళ్ళీ మారింది ...

సింధూనదీ జలాలచే ఆవరించబడిఉన్న రాళ్ళ దీవి ... దానిమధ్య గగనాన్ని చుంబిస్తూ కొండకొమ్ము ... దానిచివర ఎవరికీ అందనంత ఉన్నతంగా మానవాకృతి ... అతడి దృష్టి

అస్తాద్రిని లగ్నమై ఉంది ఆ కేసరవర్ణపు కిరణాలు క్రమంలో ఆకాశపుటంచుల్లో కలిసిపోతున్నాయి. కొండకు కుంకుమ పులిమినట్లుగా ఉన్నది. ఎండిన పొలాలు నీరెండ చీరెను కట్టుకున్నాయి. పశ్చిమాద్రి అరుణము పులుముకున్నట్లు, సువర్ణము నలముకొన్నట్లు శోభతో ప్రకాశిస్తోంది. కొండ కొమ్మునుండి చూస్తున్న వ్యక్తికి సూర్యబింబము అంతకంతకు తక్కువతక్కువగా కానవస్తోంది. నీలపుటద్దంలావున్న నీటిలో గూళ్ళకుచేరుతున్న పక్షులు అప్పుడప్పుడు ప్రతిబింబిస్తున్నాయి. ఒంటెల గుంపొకటి మూపులమీద సామానులతో, గంటల గణగణలతో, గజ్జెల ఘల్లులతో మైదానం వెంట పడిపోతోంది. క్రమంగా నీడలు పొడవవుతున్నాయి. చీకటి దట్టమవుతోంది. నీటిమీద, నేలమీద నిశ్శబ్దం ఎక్కువవుతోంది. సూర్యబింబపు ఆఖరిలేశం కూడా భూగర్భం క్రిందికి వెళ్ళిపోయింది. కొండకొమ్మమీద పురుషుడు మాత్రం అలాగే నిలచివున్నాడు. ఉలుకు, పలుకు లేదు. కదలిక లేదు.

అతడు ఆలోచనలలో మునిగిపోయినట్లుంది. "ఎంత కాలమయింది నేనిక్కడకు వచ్చి! ఎన్నివసంతాలు గడచిపోయినాయి?" అనుకుంటున్నట్లుంది. అతడెలా లెక్కించుకోగలడు? ఆతడి నివాసం మానవాళికి దూరాతిదూరాన ఉన్నదే! సంవత్సరాలు, నెలలు, వారాలు, రోజులు అతడెలా గుర్తించగలడు? కాలగమనంలో అతనికి తెలిసినదల్లా రెండే రెండు—సూర్యోదయం, సూర్యాస్తమయం. ఇంకే

వైనా అతనికి తెలిస్తే—వానలు, వరదలు, వసంతము, ఎండలు, చలి – ఇవిమాత్రం తెలుసు. అవన్నీ ఎన్నెన్నిసార్లు వచ్చాయో, వెళ్లాయో అతని కేమి తెలుసు? చరిత్రలో అత్యవసరమైన కాలమాన సూచిక అతడి వద్దలేదు.

అయినా కాలమాననిర్ణయంలో అతడికి ఉన్న అల వాటువల్ల గడచిన కాలాన్ని కాస్త ఊహించుకోజూస్తాడు. ఆ ఊహా లోకంలో గతానికి, వర్తమానానికి మధ్యనున్న దూరం చాల తక్కువే నని పిస్తుంది. ఇప్పుడు ఉజ్జయినీ సువర్ణ సింహాసనం మీద ఇంకెవరో సామ్రాట్టు ఉండి ఉంటాడు” అనుకుంటాడు ఒకక్షణం. “నా ప్రభువు బుధగుప్తుడు మరణించి ఉంటాడు. ఆయన అనంతరం సింహాసన మెవరెక్కి ఉంటారు? వారసుడు పురగుప్తుడేకాని అరాచక మేఘాలు కమ్మి ఉన్నాయే? బలవంతుడిదే అయి ఉంటుంది రాజ్యం. అయితే ఆ బలవంతు డెవ్వరై ఉండవచ్చు? ఆ శ్వేత హూణుల నాప గలిగే వా రెవ్వరై ఉంటారు? నా మిత్రులు కాళిదాసు, నిఖిలుడు, శీలావతి—— వారంతా ఇప్పు డెక్కడున్నారో? నేను వారిని ఆఖరిసారి కలిసేటప్పటికే వారంతా చాలా వృద్ధులై ఉన్నారు”... అంటూ ఏమేమిట్లో ఊహాలలో మునిగి పోయినాడు.

చటుక్కున తాను వృద్ధుడైపోయినాడనే విషయం స్ఫురణకు వచ్చింది. మానవసంఘానికి దూరంగా బ్రతుకు తున్నందువల్ల కాబోలు తన వార్ధక్యం సంగతి అతడికి దృష్టిలో లేదు. అయినా వయసు ఆగదుకదా! “నాకు చాలా

వయస్సు వచ్చింది. అయినా మహాకాళుడు నన్నింకా ఎందుకిక్కడే ఉంచాడు? ఎందుకీ మారుమూల ప్రదేశాన బంధించి ఉంచాడు? ఈ ఆర్యావర్తపు పనికిమాలిన కాపలాదారుని ఎందుకింకా సచేతనుడుగానే ఉంచాడు? భగవల్లీలలు అనూహ్యములు కదా!" అనుకున్నాడు.

"కాని ఆయన చేష్టలు నిజముగా అనూహ్యములేనా? తానే నాకీ సన్యాసివేష మిప్పించాడు. మానవసంఘాన్ని దూరంచేసి తనను తనవద్ద ఉంచుకున్నాడు. దీనికి ఆంతర్యమేదో ఉండి తీరాలి" ఈ ఆలోచన రాగానే మరొక్కసారి ఉద్రిక్తుడై పోయినాడు. "లేదు, నేనో సన్యాసిని. నేను సన్యాసినిగానే ఉండిపోతాను. ప్రాపంచిక వ్యవహారాలన్నీ వదలివేశాను. నేను సేనాపతినీ కాదు; గృహస్థునూ కాదు ప్రపంచం బాగుపడితే నాకేమి! నశించిపోతే నాకేమి? నాకు దానితో ఏమిటి సంబంధం?" ఇలా ఆ మహాయోధుడు అతి కఠినంగా తన హృదయారాటాలను అణుచుకో యత్నిస్తున్నాడు. వివశుడై పోతున్నాడు. దారి తెన్ను కానక అలా తల రాతికేసి బాదుకుంటున్నాడు. "ప్రభూ! ఏమిటి నాకీ అయోమయ స్థితి? కనికరించి దారిచూపు" అంటున్నాడు.

"మహాకాళేశ్వరా! సన్యాసికి తగని ఈలౌకిక వ్యాపార సంబంధమైన ఆలోచనలను నామనస్సునుండి పారద్రోలు. ఈ బంధనాలనుండి నన్ను విముక్తుణ్ణి చేయి" అని మరీ మరీ ప్రార్థిస్తున్నాడు.

అన్ని శబ్దాలు అణగారిపోయినాయి. తర్వాత అంతా ప్రశాంతమే.

"ఎంత విచిత్రమైన కల వచ్చింది!" అనుకుంటూ లేచాడు పుష్యమిత్రుడు. తాను నిదురించిన వ్యాఘ్రచర్మంపై కూర్చున్నాడు.

"ఎందుకొచ్చిన ట్లీ కల? ఏది ఆ మహానగరం? ఎవరా పవిత్రమూర్తి? అది కలే అయినా ఎంత స్పష్టంగా ఉన్నది!" అతడి వీనులలో ఆ సాగరఘోష ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉంది.

గుహనుండి వెలికి వచ్చాడు. ఆకలిత నిద్దరను వదలించు కున్నాడు. చిత్రం! ఇంకా ఆసాగరఘోష వినవస్తూనేవుంది! ఎందుకో అనుకోకుండా అటు పశ్చిమముగా చూచాడు. ఆ దృశ్యం చూచేసరికి భయంతోను, ఆవేశంతోను కంపించి పోయాడు. నరాలలో రక్తం ముప్పొంగిపోయింది. "ఏమిటి నే చూస్తున్నది" తనకళ్ళను తానే నమ్మలేక తనలో తనే ప్రశ్నించుకున్నాడు వణకే పెదవులతో.

"ఎవరు వారంతా? ఎవరై ఉంటారు?" భయసందేహా లతో అనుకున్నాడు. మరుక్షణాన ఆ భయసందేహాలన్నీ పటా పంచలై పోయినాయి. పరిస్థితిని పూర్తిగా ఆకళించు కున్నాడు. "కనుక వాళ్లు రానే వచ్చారన్నమాట! వాళ్ళే. ఏమీ సందేహం లేదు వాళ్ళే" అనుకున్నాడు. "శ్వేత హూణాలు! శ్వేతహూణులు ఆర్యావర్త విధ్వంసనానికి సాగి

వస్తున్నారా ?" వెర్రిఆవేశంలో కేకపెట్టాడు. "శ్వే...త... హూ...ణు...లు" పళ్లు పటపటలాడించాడు. ఆ ప్రశాంత చిత్తము, సన్యాసి సాధుత్వము అన్నీ వదలిపోయాయి. క్రుద్ధుడై విజృంభించాడు. అతని డోలాయమానస్థితి, భీరుత్వము, సంకోచము అన్నీవదలిపోయినాయి. గుప్తసామ్రాజ్య సర్వ సేనాధిపతియైన పుష్యభూతిగా విజృంభించాడు.

యోధుడు తన నిశిత దృష్టితో ఆ దృశ్యాన్ని పరిశీలించాడు. ఆకాశపుటంచులనుండి వెలికివస్తున్న ఆయుధపాణులైన హూణులు పదిలక్షలకు పైగా ఉండవచ్చుననుకున్నాడు. హూణులు బయల్దేరినప్పుడల్లా తమ పిల్లజెల్లా సంసారం, ఆయుధాలు అన్నిటితో బయల్దేరుతారని పుష్యభూతికి తెలుసు. కేవలం ఆయుధప్రయోగంతో గెలవడం ఒక్కటే వారి పద్ధతికాదు. గెలిచిన దానిలో వలస వచ్చి ప్రక్క ప్రదేశాలను హూణశిబిరాలుగా మార్చడం వారి పద్ధతి. తనకంటబడిన ఆదృశ్యం అలాంటిదే పెద్దది ఒక్కటై ఉండాలి. ఆసాగివస్తున్న సేనావాహిని వెనుక మరి అనేక దళాలుండి తీరాలి అనుకున్నాడు పుష్యభూతి.

సింధూనది పశ్చిమ భాగాన రెండు మూడు మైళ్లకు అవతల దురాక్రమణదారులు తమ గుడారాలను వేశారు. గుప్తులు గుడ్డ గుడారాలు వేసుకుంటారు. కాని వీరి గుడారాలు చర్మములతో చేసినవి, అయితే అవి ఏమంత ఎక్కువ సంఖ్యలో లేవు. దూర దూరంగా ఆ విశాల మైదానమంతా ఉన్నవి. దుమ్ము ధూళి లేకుండా ఉన్న ఎడారి, వాతావర

ణంలో దూరాన వారు స్పష్టంగా కనిపిస్తున్నారు. పొట్టి గుర్రా లపై నెక్కి చురుకు చురుకుగా కొందరు సాగి వస్తున్నారు. కొందరు ఆ మైదానాలమీద తిన్నెలమీద కూర్చొని ఉన్నారు. కొందరు గుంపులు గుంపులుగా చేరి కూర్చొని ఏమేమో చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు. అక్కడ డక్కడా చలి కుంపట్లు కనిపిస్తున్నాయి. నదికి సమీపమున ఉన్నవాళ్లు చర్మపు దుస్తులు ధరించి చేత విల్లంబులతో ఉన్నారు. పుష్యభూతికి అనిపించింది: తన మనస్సులో విన వచ్చిన సంక్షోభం ఎక్కడో జరిగిన సాగర ఘోషలు కావని! అదే అయి ఉంటేనే బాగుండేది కదా అనుకున్నాడు. ఆవల దురాక్రమణదారుల కోలాహలం, తన మనస్సున రేగిన సంక్షోభాన్ని ధృవ పరుస్తోంది. తాను కన్న పీడ కలను మరువరాని దానినిగా చేస్తోంది.

గుప్తసామ్రాజ్యానికి చరిత్రలో ఇది అతి క్లిష్టమైన ఘడియ అనుకున్నాడు తనలోతాను. అక్కడ గుడారాలు వేసుకుని ఉన్నవారి దురాలోచనలకు సంబంధించి తనకెలాంటి సందేశమూ లేదు. సైన్యాల కదలికల విషయం అతనికి బాల్యమునుండి తెలుసు. అందువల్ల వీరు ఉజ్జయిని చేరడానికి కనీసం మూడునెలలైనా పడుతుందని తేలికగా అంచనా చేశాడు. ఇంకా అది ఎక్కువకూడా కావచ్చు. ఎందువల్ల నంటే హూణసైన్యాలు తిన్నగా సాగి వెళ్ళవు. దారిలో వున్న గ్రామాలను, నగరాలను ధ్వంసం చేసుకుంటూ పడు స్తాయి. దారిలోని కొండరాజులు, ఇతరపాలకులు గట్టిగా

నిరోధిస్తే ఇంకా ఎక్కువసమయంకూడా పట్టవచ్చు. ఈ వ్యవధినంతా చక్కగా సద్వినియోగం చేసుకొని ఉజ్జయినిని విజృంభింపజేసి, సమరానికి ఆయత్తంచేయవచ్చు నను కున్నాడు. గుప్తసామ్రాజ్యం నిలువద్రొక్కుకుంటే ఆర్యావర్తము నిలువద్రొక్కుకోగలదు. గుప్తసామ్రాజ్యము నశిస్తే ఆర్యావర్తమున మిగిలే దెవరు?

పుష్యభూతి క్షణాలమీద నిర్ణయానికి వచ్చివేశాడు. గుహలో ప్రవేశించాడు. భద్రంగా దాచి ఉంచిన సైనిక దుస్తులు ధరించాడు. ఖడ్గ కవచాదులతో మహాయోధుడై వెలికి వచ్చాడు. మోకరిల్లి మహాకాళేశ్వరుని స్మరించు కున్నాడు "మహాప్రభూ! దెబ్బతిన్న ఆత్మగౌరవం నన్ను ఈ గుహలోకి తరిమింది. ప్రమాదకర సమయం వచ్చేసరికి నీవు నాకు కనువిప్పు కలిగించావు. సన్యాసము నాబోంట్లకు కాదని, నేనెప్పుడూ సమరసైనికునేనని తెలియజేశావు. ప్రభూ! సన్యాసి, సైనికుడు ఇరువురూ నీ దృష్టికి సమానమే కదా! ఆత్మవిశ్వాసము మానవునికి ఉండవలసిన ఉత్తమ తత్వమని బోధించావు. వయస్సుమళ్ళి, వార్ధక్యంతో జమికి పోయిన ఈ శరీరంతో నన్ను, నాకు తగిన కార్యరంగము లోనికి పంపిస్తున్నావు! విజయ పరాజయాలతో నాకు నిమిత్తంలేదు. కాని విధి నిర్వహణలో నేను ప్రమత్తుడను కాకుండా కాపాడు స్వామీ" అంటూ మౌనంగా ప్రార్థనలు చేశాడు. ఇక బయలుదేరాడు. ఆ భయంకర స్వప్నం నిర్హేతుకం కాదని ఋజువైనది.

కొండ దిగుతుండగా తన మిత్రుడు కాళిదాసు తనకిచ్చిన బిరుదం ఒకటి గుర్తు కొచ్చింది. సింధూతీరపు కావలి వాడని పిలిచేవారు తనని. ఆర్యావర్తపు సరిహద్దుల కావలికి తన నా కొండ గుహపై నివసించమని నిర్దేశించిందికూడా మహాకాళే శ్వరుడేనని గుర్తించాడు. మైదానములోనికి వచ్చిన తర్వాత తక్షశిలా మార్గాన్ని అనుసరించాడు.

## ౨3

తక్షశిలలో పదిబంగారు నాణేలిచ్చి పుష్యభూతి ఒక మంచి గుర్రాన్ని కొనుక్కున్నాడు. తాను ఫదవినుండి విర మించినప్పుడు మిగిలిపోయిన ఆ కాసిని నాణేలు నేడిలా విని యోగమైనాయి. గుఱ్ఱముపై నెక్కి తక్షశిల రాజసభా ప్రాంగ ణానికి వెళ్లాడు. రాజును దర్శించి హూణులు సింధూనదీ తీరమున గుడారములు వేశారని చెప్పాడు. సైన్యము నాయత్తపరచవలసినదిగా ఉద్బోధించాడు. రాజు దానివిని "మాకది తెలుసు. కాని అవి సైనికశిబిరాలు కాదు. అవి దేశ దిమ్మరుతండాలు మాత్రమే. హూణప్రభువైన తోర మానునితో మేము మైత్రీ సంధి చేసుకున్నాము. అందువల్ల హూణుల దురాక్రమణ భయం మాకేమీలేదు." అని సమా ధానమిచ్చాడు.

రాజుకు విజ్ఞత కలిగించాలని పుణ్యభూతి అనేక విధాల ప్రయత్నించాడు. అదంతా చెవిటివాని ముందు శంఖము ఊదడమే అయింది. అతడి మంత్రులూ అదే స్థితిలో

ఉన్నారు. హృదయవేదనతో పుష్యభూతి తిరిగివచ్చాడు. చంద్రభాగానదిని దాటి సాకల మహానగరాన్ని చేరాడు. ఆరోజున ఏదోపండుగ. ఎక్కడచూచినా నృత్యగానవినోదాలు. ఆబాలగోపాలం మహోత్సాహంలో ఉన్నారు. తక్షశిలలో తనకు రాజదర్శనమైనా లభించింది. ఇక్కడ దానికికూడా అవకాశం లభించలేదు. ఉల్లాసంగా తండోపతండాలుగా వెళ్తున్న జనం ఒకక్షణం ఆగి సైనిక దుస్తుల్లో ఉన్న తనను వింతగా చూచేవారు. వెంటనే వినోదమందిరంవైపు పరుగులు తీస్తూ వెళ్లేవారు.

పుష్యభూతి మళ్లీస్వారి ప్రారంభించాడు. శతద్రూ (సట్లెజ్) నదిని దాటి జలంధర్ చేరాడు. జలంధర్ నుండి స్థానేశ్వరం, స్థానేశ్వరంనుండీ ఇంద్రప్రస్థం— ఈ ప్రకారం స్థానస్థానాన హెచ్చరికలు చేసుకుంటూ ప్రయాణం చేశాడు. ఎక్కడా తనకు అనుకూలభావమనేది కానరాలేదు. కొందరు కొంచెం అశ్రద్ధతో వినేవారు. మరికొందరు అదికూడా లేదు. అవసరానికి/సంబంధించినంతవరకూ అంతా ఒకటే. అందరూ బాక్ట్రియా మైత్రీ భ్రాంతిలోపడి ఉన్నారు. తమపై ఎవర్లో దురాక్రమణ దండయాత్రలు జరుపుతారనే భావమే వారికి అనూహ్యంగా ఉన్నది. ఆసంగతి తెలియజేస్తే అదంతా మతిపోయిన ముసలివాని కాకమ్మ కథలనుకుంటున్నారు. పుష్యభూతిని వెర్రివాని క్రిందకట్టి నవ్వేవారు. కొందరు తనను మారిన ప్రపంచాన్ని అర్థం చేసుకోలేని పాతకాలపు ముసలితొక్కు అనుకునేవారు. కొందరు వట్టిమొద్దు అనుకునేవారు.

మరికొందరు యుద్ధోన్మాది అనేవారు. తనమాటను ఎవరూ నమ్మేవారు కాదు. పట్టించుకునేవారు కాదు. ఒక్కనిట్టూర్పు విడచి మళ్లీ బయల్దేరాడు. జమునానదిని దాటి దక్షిణాభిముఖుడై ప్రయాణం సాగించాడు.

ఒక్క ఉజ్జయిని మాత్రమే కాకుండా ఆర్యావర్త మంతా మైకంలో పడిపోయిందని గుర్తించాడు. తమకు ప్రపంచంలో శతృవులెవరూ ఉండరనే భ్రమతో వారి బుద్ధి మందగించి పోయింది. పుష్యభూతికి ఒక ఉపమానం గుర్తుకు వచ్చింది! మునిగిపోయేవాడు గడ్డిపరక పట్టుకొని అది తనను ఉద్ధరిస్తుందని భ్రమిస్తాడు. అలాగే పతనోన్ముఖమైన జాతి ఇలాంటి మైత్రీ సంధుల చిత్తుకాగితాలను పట్టుకొని తనకు భద్రత కల్గుతుందని భ్రమిస్తుంది అనుకున్నాడు. నాశనం చేయబోయే ముందు, బుద్ధులను పాడుచేయడం దేవుడికి ఇష్టం!

ఆరావళి పర్వతాల తూర్పు అంచునబడి దక్షిణంగా సాగివెళ్తున్నాడు పుష్యభూతి. మార్గంలో అక్కడక్కడా పల్లెలు, గుడిశలుఉన్నాయి. అంతా ఎడారి. పగలంతా పెళపెళా కాచేఎండ. రాత్రివేళ రక్తం గడ్డకట్టే చలి. అయినా పుష్యభూతి రాత్రింబవళ్లు తెరపిలేకుండా ప్రయాణం చేశాడు. క్షణం ఆగాలంటే ఉక్కిరి బిక్కిరయేవాడు. డస్సిపోయి, అడుగుసాగలేని స్థితివస్తే గుక్కెడు నీళ్లుత్రాగి కాసేపు నిద్రపోయేవాడు భరింపరాని ఆకలివేసినప్పుడు ఏగుడిశ వద్దకో వెళ్లి ఆభిల్లు జాతి ప్రజలు ఇచ్చే పట్టెడు ఆహారం పుచ్చుకునేవాడు. గుఱ్ఱానికి గడ్డిమేపుకునేందుకో, నీరు పట్టేందుకో ఒక

క్షణం ఆగుతుండేవాడు. ఇది తప్పిస్తే మిగతాదంతా నిరంతర ప్రయాణం ఎన్నెన్నో మహానగరాలను దాటివెళ్లాడు. సింహపురము, మయూరపురము, దశపురము, నలపురము, బిదీషా, ఇంకా అనేకనగరాలు దాటివెళ్లాడు. అక్కడ ఉండే ప్రజలంతా ఏ చీకుచింతా లేకుండా వినోదాలలో మునిగి తేలుతున్నారు. వారికి ప్రపంచమే పట్టడంలేదు. వారికి తన సందేశం ఏమీ పట్టడంలేదు. పైగా కొందరు ప్రబుద్ధులు ఒక మిత్రదేశాన్ని గురించి దుష్ప్రచారాలు చేస్తున్ననేరానికి శిక్షిస్తామని కూడా బెదరించారు.

వృద్ధుడింకా సాగివెళ్లాడు. ఈలోపున ఈశాన్యదిశనుండి వస్తున్న బాటసారులు కొందరు తక్షశిల, సాకల మహానగరాలను హూణులు సర్వనాశనం చేశారని చెప్పారు. ఈ వార్తనుకూడా ఎవరూ నమ్మడంలేదు. అయినా తనవారైన ఉజ్జయినీ పౌరులు తన మాటను నమ్ముతారని పుష్యభూతి విశ్వాసం. పట్టుకుప్రాకులాడడానికిగాను బతికున్న ప్రతివాడికి ఏదో ఆశఉండాలి కదా! మహాప్రళయ మధ్యంలో కూడా ఏదో ఆశతో పెనగులాడుతాడు మానవుడు.

ఒకానొక మధ్యాహ్నసమయాన దక్షిణంగా దూరాన వింధ్యాద్రి కనిపించింది. అక్కడ ఉంది తన గమ్యస్థానం తన ప్రియతమ మహానగరమైన ఉజ్జయిని. తానిక గమ్యానికి చేరువకు వచ్చాడు.

## ౨౪

పుష్యభూతి ప్రభాతసమయానికి ఉజ్జయినీపొలిమేరలనుచేరాడు. సముద్రగుప్తుని రణభేరి మామూలుగా సింహద్వారం వద్ద మట్టిగొట్టుకొని వ్రేలాడుతోంది. వెళ్ళి దానిని మ్రోగించాడు. మరచిపోయిన చరిత్ర కోణాలనుండి వేల విజయాలను, లక్షలమంది సైనికుల వీర సాహసాలను గుర్తుచేస్తూ భేరీమ్రోతలు దిక్కులు పిక్కటిల్ల జేశాయి. భేరీ మ్రోతను మరచిపోయిన ప్రజలు చెవులు రిక్కించుకొని విని, భయంతో కంపించి పోతూ విన్నారు.

క్రమంగా ఒకరు... ఇద్దరు... వందలు... ఇలా సింహద్వారం కడకు చేరారు. కుతూహలం, ఆశ్చర్యం, సంచలనం, ఉద్రేకం– వీటితో ఇళ్ళువిడచి పరుగెత్తుకు వచ్చారు. ఏమీ తోచక కొందరు పరుగెత్తుకు వచ్చారు. వారిని వీరిని చూచి పరుగెత్తుకు వచ్చారు ఇంకా కొందరు ప్రజాసమూహము అనంతసంఖ్యలో అక్కడ చేరింది. వారిని చూచి పుష్యభూతి గంభీరస్వరంతో ఇలా ఉద్బోధించాడు : "పౌరులారా! నేను పుష్యభూతిని. మీసైన్యాధిపతిని. రక్షణ మంత్రిని. ఈ విషయము వినండి. లోగడ అనేకపర్యాయములు మీకు నేను మన విజయవార్త లందిస్తూఉండేవాడిని. నా ప్రభువులైన కుమారగుప్త స్కంధగుప్తులకు ప్రథమ సందేశ సమాచారాలను అనేకమారులు నేనే అందించేవాడిని. ఇప్పుడు కూడా నేను ప్రథమ వార్తాహారునిగానే వచ్చాను. కాని

ఈసారి విజయ వార్త లేవీ తీసుకు రాలేదు. శత్రువు త్వరితంగా మనమీదికి వస్తున్నాడని, ప్రమాదము ముంచుకు వస్తోందని హెచ్చరించేందుకు వచ్చాను. ఓ పౌరులారా! మిమ్ము సకాలములో హెచ్చరిస్తున్నాను. సకాలములోవచ్చిన హెచ్చరిక విజయ వార్తవలె అమూల్యమైనది. లెండి. కటిబద్ధులుకండి."

ఈవార్త ప్రజలను ఆశ్చర్య చకితులను చేసింది. పుష్యభూతి ఒక దేశద్రోహియని, ముఖారితో కలిసి కుట్రలు పన్నేందుకు రాజును విడిచి వెళ్ళాడని వారు అనేక కథలు వింటున్నారు. నేడు అదే పుష్యభూతి తిరిగి వచ్చాడు. వచ్చి రానున్న ప్రమాదాన్నిగురించి హెచ్చరిస్తున్నాడు. ఏమీ అర్థంకాక పౌరులు ఒకరిముఖాలొకరు చూచుకుంటున్నారు.

"మన సైన్యాధిపతి నిజంగా దేశద్రోహియేఅయితే ఈమాదిరి ప్రమాదవార్త నెందుకు తెస్తాడు?" అని తమలో తాము గుసగుస లాడుకున్నారు కొందరు.

"వారి మాటలు మనం నమ్మకూడదు. మన సేనాపతి మీద అభాండాలు వేసి ఆయనను అప్రతిష్ఠపాలు చేయ యత్నిస్తున్నారు" అన్నాడొకడు.

"ష్, మెల్లగా! ఎవరైనా వింటే మన ప్రాడు తెగు తుంది" అని గుసగుసగా హెచ్చరించాడు అతడి ప్రక్కవాడు. అయితే ఆ జనంలో దుష్ప్రచారాలను విశ్వసించిన మందబుద్ధులు కొందరున్నారు "ఇంతకాలము తర్వాత ఇతడు రావడం సందేహానికి తావిస్తోంది. మన శత్రువులే తమ

వ్యూహాలను అమలు చేసేందుకు ఇతడిని పంపిఉంటారు. ఇక్కడికి వచ్చి ఈమాదిరి హెచ్చరికలతో మనకు కుళాయి తగిలిస్తున్నాడ"నుకున్నారువారు.

వారి సంకోచసందేహాలను గమనించిన పుష్యభూతి "ఓ పౌరులారా! మీలో చాలామంది కుమారగుప్త, స్కంధగుప్త మహారాజుల ధ్వజముక్రింద వీరోచిత పోరాటాలు జరిపినట్టివారు. మీ భుజబలానికి లొంగిపోయిన శత్రువుల కోటలపై మన ధ్వజముల నెగురవేసినట్టివారు. మహారాజు నుండి స్ఫూర్తిపొంది వాడియైన మీ బాణాలతో శత్రువుల హృదయాలను ఛేదించినట్టివారు. నా యాజ్ఞలతో శత్రు సేనా వాహినుల చీల్చి చెండాడినట్టివారు. ఆయా వీరాధివీరుల నందరిని ఇక్కడ చూస్తున్నాను. మళ్లీ మీరూ నేనూ ఒక చోట చేరాము. దేనికి మీ సంకోచము సోదరులారా?" అన్నాడు.

"అయితే శత్రువెవరు?" గుంపులోనుండి ఎవరో అడిగారు

"శ్వేతహూణులు"

"శ్వేతహూణులా?" సందేహ సంభ్రమాలతో అనేక గొంతులు వినిపించాయి. "వారు మన మిత్రులుకదా" అన్నారు

"శ్వేతహూణులు మీ శత్రువులు. గుప్తసామ్రాజ్యానికి శత్రువులు — కాదు — ఆర్యావర్తానికే శత్రువులు. మన కున్న శత్రువులు కేవలం వారే."

"ఈ సమాచారము మీకెక్కడినుండి లభించినది?"

"ఎక్కడనుండీ లభించలేదు. స్వయముగా నా కళ్ళతో చూచాను. సింధూనదీ పశ్చిమతీరాన కవాతులు చేస్తున్న శ్వేతహూణ సైన్యాలను చూచాను. వారు ఏ పదిమందో పదిహేనుమందో కాదు. అసంఖ్యాకులు. సింధునది ఇసుక రేణువులవలె లెక్కింప వీలులేని సంఖ్యలో ఉన్నారు."

"నీవన్నట్లు వారు అక్కడెక్కడో ఉంటే ఎందు కిప్పటినుండే ఆందోళన ?"

"ఆందోళన ఎందుకా ? సింధూనది ఆర్యావర్తపు సరిహద్దు. శత్రువు వాకిట్లోకి వస్తే నీవు జాగ్రతపడనక్కరలేదా?"

సంవత్సరాలకొలది సుఖలాలసజీవితంతో ఉజ్జయిని కండలు మెతకబడ్డాయి. శాంతియనే భ్రాంతికన్యకౌగిట్లో అవి మహదానందం పొందుతున్నాయి. దానితో "మీ ఆందోళన అర్థరహితం. దారిలో చాలామంది రాజులున్నారు. వారు శత్రువును తేలికగా తరిమికొట్టగలరు" అన్నాడొకడు.

"వారేమినిరోధించగలరు? మహాశక్తివంతమైన తక్షశిల, సాకల రాజ్యములు పతనమైనవి. హూణులు ప్రచండ జలపాతమువలె యుద్ధమార్గమున ముందుకు దూకుతూ వస్తున్నారు. ఈసరికి వారు స్థానేశ్వరము, ఇంద్రప్రస్థములను కూడా ధ్వంసముచేసి యమునానదిని దాటి వచ్చిఉండవచ్చు".

సుఖలాలసజీవనులు తమకు నచ్చని వాస్తవాలను ప్రక్కకునెట్టి తమ సుఖమును పొడిగించుకొనడంలో చాలా

తెలివైనవారుగా ఉంటారు. అందువల్ల వారిలోనుండి ఒకడు "హూణుల మార్గములో ఉన్న అంతు లేని ఎడారులు, భయంకరమైన అరణ్యము వారిని నిరోధిస్తాయి లెమ్మ"ని ఆశ వెలిబుచ్చాడు.

"శత్రుసేనావాహినులు ఎడారులను ముంచెత్తి ముందుకు రాగలవు. మిత్రులారా! కాలయాపన చేయక త్వరిత ముగా ఆయత్తులు కండి" అని పుష్యభూతి ఉద్బోధించాడు.

ఇంతలో అక్కడికి ఒకచిన్న సైనికుల బృందము వచ్చింది. తమకు బాగా పరిచయమున్న సేనాధిపతిని గుర్తించి ఆనందముతో "వారు మళ్లీ మన మధ్యకు వచ్చారు. మన నాయకుడు మనల నొదిలి ఎలా ఉండ గలరు?" అను కున్నారాప్యాయతతో.

"ఆ దురాత్ములు మనకు చెప్పినవన్నీ అబద్ధములే"అని గొణిగా డొకడు.

"ఆఁ. నిజం తెలిసిపోయింది! మన సైన్యాధిపతి శత్రువుల జాడలు తెలుసుకోవడానికి నగరం విడచి వెళ్లారు. ఈ సమయంలో ఆ దురాత్ములు వీరిపై దుష్ప్రచారాలు ప్రారంభించారు" అన్నాడు కొత్త విషయం కనుగొన్న వాని ఆనందముతో.

ఆ సైనికులంతా ముక్తకంఠముతో నినదించారు: "సైన్యాధిపతికీ జై, బుధగుప్త సామ్రాట్టుకు జై" అని. ఉత్సాహంలో పడి జనము కూడా నినాదము నందుకున్నారు.

పుష్యభూతి సంతృప్తితో ఊపిరి పీల్చాడు. "నా ప్రియమైన ఉజ్జయిని చేయి జారి పోలేదు" అనుకున్నాడు ఆనందముతో.

ఇంతలో ప్రస్తుత సేనాధిపతి నరపాలుడు అశ్వముపై రంగములోనికి వచ్చాడు. సింహద్వారముకడ చాలామంది మూగి ఏదో విశేషమును చూస్తున్నారని అతడు విన్నాడు. అతడిలో ఎన్ని అవలక్షణములున్నా నరపాలుడు మందబుద్ధి మాత్రము కాదు. ఒక్కసారి చూచి పరిస్థితిని గుర్తించాడు సైనిక దుస్తులలో పుష్యభూతి, ఉత్సాహపూరితులైన జన సందోహము, సర్వ సన్నద్ధులై ఉన్న సైనికులు— ఈ దృశ్య మును చూడగానే నరపాలునికి ముందుసంగతి తేలికగా అర్థ మయినది. ప్రజలను చెదరగొట్టేందుకై బిగ్గరగా "ఉజ్జయినీ సైనికులారా! ఈ వచ్చినవాొక దేశద్రోహియని మీ కంద రకూ తెలుసు. వెంటనే ఇతడిని హతమార్చండి" అని కేక వేశాడు.

"అతని మాటలు దేశద్రోహి మాటలకువలె లేవే" ఎవరో సందేహముతో అన్నారు గుంపులోనుండి.

"దేశద్రోహిని గుర్తించడం అంత తేలికకాదు. వెంటనే సంహరించండి" మళ్ళీ హుంకరించాడు నరపాలుడు.

గాద్గదిక స్వరంతో పుష్యభూతి ఇలా అన్నాడు: "నరపాలా, ఎవరిని నీవు చంపుతానని బెదరిస్తోంది? యుద్ధరంగ ములో ఎన్నిసార్లు తెగించి పోరాడానో, మృత్యుగహ్వరము నుండి ఎన్నిసార్లు తప్పించుకున్నానో నీకేమైనా తెలుసా? ఈ సైనికుల నడుగు. వారికి తెలుసు."

"నిజం. నిజం." చాలా గొంతు లొక్కసారిగా అన్నాయి.

"మరి నీవో నరపాలా ? సుస్త్రీ చేసినప్పుడు మంచము మీద తప్పించి నీవెప్పుడైనా మృత్యువు నెదుర్కొన్నావా ?"

"తప్పత్రాగి పశువువలె పడిపోయినప్పుడు తప్పించి ..." అనికూడా కలిపాడు జనములోనుండి ఎవరో.

'శ్వేతహూణ యువతుల కౌగిళ్ళలో ఉక్కిరి బిక్కిరైనప్పుడు తప్పించి ..." అని మరొకరు దెప్పిపొడిచారు.

వాతావరణం తనకు వ్యతిరేకంగా ఉండడం చూచి నరపాలుడు చకితుడైనాడు. పుష్యభూతివైపు తిరిగి నోరు చేసుకున్నాడు:

"దేశద్రోహీ ! మహాఖారిస్ గూఢచారివి నీవు ..."

"...అని నీ యజమానులైన శ్వేతహూణులు నీకు నేర్పారుకదూ?" పుష్యభూతి వాతపెట్టాడు.

"జాగ్రతగా మాట్లాడు. నా యజమాని బుధగుప్త సామ్రాట్టు."

"...అయివుండవలసింది. నీవు నీచుడవేకాదు, విశ్వాస ఘాతకుడవుకూడా. సామ్రాట్టును జోకొట్టి శత్రువులకు నగరంలో ఆశ్రయమిచ్చావు."

"ఎవరా శత్రువులు ?"

పుష్యభూతి సమాధాన మీయవలసిన అవసరం లేక పోయినది. పలువురు "శ్వేతహూణులు, శ్వేతహూణు"లని

కేకలు వేశారు. "శ్వేతహూణుల కిరాతకముల వలన మన వర్తక వ్యాపారములు స్థంభించిపోయినవి. మన మతబోధకుల, పురోహితుల నోళ్ళు నొక్కి వేయబడినవి. సాంప్రదాయములు అడుగంటిపోయినవి. మన స్వేచ్ఛ అరికట్టబడినది. ఊరూ పేరూ లేకుండా వచ్చి మన నెత్తిన ఎక్కిన ఆ శ్వేతహూణులే మన జాతికి శత్రువులు".

మరొక ప్రక్కనుండి "అసంఖ్యాకములైన వారి సైన్యాలు మనమీదకు దండెత్తివస్తున్నాయి. మన సేనాపతి మన కీసమాచారం తెచ్చారు" అని కేకలు వినవచ్చాయి.

ప్రజలు మాట్లాడడమే జరిగితే ముక్తకంఠంతో మాట్లాడుతారు. వారి గంభీరగర్జనలకు ఉత్సాహపడిన పుష్యభూతి "మాతృదేశానికి ద్రోహి ఎవరో ఇప్పుడు మీరే నిర్ణయించుకోగలరు మీసైన్యాధిపతి ఎవరో, ఎవరిని మీరు విశ్వసించాలో, ఎవరి ఆజ్ఞలకు మీరు బద్ధులు కావాలో మీరే నిర్ణయించుకోగలరు."అన్నాడు.

ప్రజానీకం ముక్తకంఠంతో సమాధానమిచ్చింది: "నరపాలుడు దేశద్రోహి. పుష్యభూతియే మా సైన్యాధిపతి."

ప్రజలు తనఎడ విపరీతమైన వ్యతిరేకత వహించారని నరపాలుడు గుర్తించాడు. సైనికవర్గముకూడా తనమాట వినే స్థితిలో లేదు. ఇలాగే మరొకక్షణము గడిస్తే తన ప్రాణానికే మోసము జరుగవచ్చు. ప్రస్తుతానికి చల్లగా తిరిగివెళ్ళి,

తర్వాతసంగతి ఆలోచించుకోనడం విజ్ఞత అనుకున్నాడు. ఆ ఉద్దేశముతో గుఱ్ఱమును వెనుకకు త్రిప్పాడో లేదో, ఇంతలో తటిల్లతవలె ఒక సంఘటన జరిగింది.

కుడిచేత కత్తి నుంచుకొని ఉత్సాహముతో ప్రజలను, సైనికులను ఉద్బోధిస్తున్న పుష్యభూతి హృదయములో ఎటు నుండో దూసుకువచ్చిన శరమొకటి బలంగా నాటుకుంది. మరొకటి .. ఇంకొకటి... హృదయమును ఛేదించుకుపోయి నవి. అసువుల బాసిన పుష్యభూతి కళేబరము గుర్రముపై నుండి జారి నేలపై పడింది. "అయ్యో! అయ్యో! ఎవరిదీ దుశ్చర్య!" విషాదాశ్చర్యాలతో వేల గొంతుకలు విన వచ్చాయి.

నరపాలునికి చాలా ఆశ్చర్యం వేసింది. తాను చేయ దలచి, చేయజాలని ఈపనిని అజ్ఞాతమిత్రులెవరో చేసిపెట్టారు. అణచుకుందామన్నా అణగని చిరునవ్వొకటి అతడి పెదిమలపై కనిపించింది. సంతృప్తితో, తేలికపడిన హృదయముతో నగరములోనికి ప్రవేశించాడు. ప్రజలుకూడా భీతావహులై, మూకవారిపోయి, ఎటువారటు వెళ్ళిపోయారు. సైన్యాధిపతి దుస్తులలోని ఆ మృతకళేబరము, అక్కడే, పడినచోటనే, ముట్టుకునేవారుగాని, శ్రద్ధ తీసుకునేవారుగాని లేకుండా దుమ్ములో ఉండిపోయింది.

౨౨

పుష్యభూతికి నరపాలునికి మధ్య వాగ్యుద్ధం జరుగుతుండగా రంగానికి దూరంగా మరొక తంతు జరుగుతోంది. కావలి స్తంభంమీదనుండి నాలుగుకండ్లు ప్రజల ప్రవర్తనను పరిశీలిస్తున్నాయి. ఆచూస్తున్నవారొక చెట్టుచాటున ఉన్నందువల్ల ప్రజ లెవరికీ వారు కనిపించలేదు. అందులో ఒకరు భారతీయుడు. రెండవవారు విదేశీవ్యక్తి. తెల్లని మేను, బూడిదరంగు కండ్లతో ఉన్నాడు. ముఖమండలముమీద కేశములనేవి ఎక్కడాలేవు. భారతీయుని చేతిలో విల్లు, అంబులు ఉన్నాయి. విదేశీవ్యక్తి చేతిలో శ్వేతపుష్పమొకటి ఉన్నది.

"ఇక బాణంవేస్తాను" అన్నాడు భారతీయుడు.

"కొంచెము ఆగు. ఆమూకల ప్రవర్తన ఎలా ఉంటుందో చూద్దాము."

"ప్రజ లుద్రిక్తులై ఉన్నారు. నరపాలుడు ప్రమాదములో చిక్కుకున్నాడు."

"అలాగే ఉంది; పాపం! నరపాలునికి ప్రజలను పురికొల్పడం తెలిసినట్లు లేదు."

"చూడు, చూడు; జనం నరపాలునిమీదకు రెచ్చిపోతున్నారు."

"మాదేశంలో ఈమాదిరి చర్యలన్నీ చాలా రహ

స్యంగా జరుగుతాయి. ప్రజలను సమ్మోహితులను చేసే కళ మాకు వెన్నతో పెట్టిన విద్య."

"చూడు, చూడు. మూకలు ఉద్రిక్తమై పోయినవి. ఇక బాణం వదలుతాను."

"అయితే వదలు." విదేశీవ్యక్తినుండి ఆజ్ఞ జారీ అయింది.

ఆరితేరిన ఆవిలుకాడు బాణం వదలిన తర్వాత ఏమి జరిగినదీ ఇంతకు పూర్వమే చెప్పబడినది. పుష్యభూతి నేలకు వరిగాడు.

ప్రజలు ఇండ్లకు వెళ్లిపోగానే... ...

"నగరాన్ని నీవు దురాత్ముని బారినుండి రక్షించావు. నీవు నిజమైన దేశభక్తుడివి" అని ఆ విదేశీవ్యక్తి విలుకానిని ప్రశంసించి అతని తలపాగాలో శ్వేతపుష్పము నలంకరించడం జరిగింది. ఆ ప్రశంసలకు విలుకాని కండ్లు మెరసిపోయినవి తర్వాత ఇరువురూ, ఎంత రహస్యముగా వచ్చారో అంతే రహస్యముగా తిరిగి వెళ్ళిపోయినారు.

నరపాలుడు బుధగుప్తునికి వందన మాచరించి "ప్రభూ! నగరము ప్రవేశించదలచిన శత్రువుల గూఢచారి నొకనిని వధించాను" అని విన్నవించాడు.

"మంచి పని చేశావు" అంటూ బుధగుప్తు డాతనిని ప్రశంసించి బహుమతి నిచ్చాడు.

నరపాలుడు పుష్యభూతి పేరును మాత్రము చెప్పలేదు. ఇతని ఆజ్ఞలపై భారత్-హూణ మిత్రమండలికి చెందినవారు

పుష్యభూతి కళేబరమును నగరములోని ఒక నిర్జనప్రదేశములో పారవేశారు. వారి పద్ధతి ప్రకారము చంపబడిన గూఢచారికి అంత్యక్రియలు జరగరాదు.

మిత్రమండలికి చెందిన ఊరేగింపొకటి నృత్య, వాద్య వినోదాదులతో నగరమంతా తిరిగింది. మాఖారిన్ పంపిన గూఢచారి ఒకడు హతమార్చబడినాడు అనే వార్తను నగరమంతా వ్యాపింపజేశారు. "ఆ దురాత్ముడు నగరాన్ని ప్రవేశింపజూస్తుండగా పట్టుబడినాడు. ఇదిగో అతడిగుర్రము" అంటూ సాక్ష్యములతో సహా ప్రచారము జరిగింది.

అసలు సంగతిని కన్నులారా చూచిన వారంతా భయంతో మౌనం వహించారు. సత్యాన్ని ప్రకటించడానికి సాహసించలేక పోయినారు. మిత్రమండలి మాటకు ఎదు రాడితే ఏమి జరుగుతుందో వారికి తెలుసు. అదృశ్యహస్తా లేవో వారి ఇండ్లను దగ్ధంచేస్తాయి; వారి పశువుల నెత్తుకు పోతాయి; తమనో, తమబిడ్డలనో హతమారుస్తాయి. అలా ఎదురాడినవారిని గూఢచారులుగా ప్రకటించి, శాశ్వతంగా వారిని మటుమాయం చేయడంకూడా జరుగవచ్చు.

రోజంతా పుష్యభూతి కళేబరము అక్కడే పడిఉంది. అదేమి విచిత్రమో పక్షులు, జంతువులు దాని దరిజేరలేదు– ఆ ప్రశాంతవదనము, అందలి పవిత్రత, గాంభీర్యము అది మృతకళేబరమనే భావం కల్గించనందువలనకాబోలు.

నిఖిలుడు ఆమధ్యాహ్నం ఈవిషయమువిన్నాడు. వెంటనే పరుగుపరుగున ఆ ప్రదేశానికి వచ్చి కళేబరాన్ని

చూచి భయోద్రేకాలతో కుంచించుకుపోయినాడు "అయ్యో! పుష్యభూతియా" అని బావురుమన్నాడు. మరుక్షణమే పరిస్థితిని గుర్తించి, దుఃఖాన్ని దిగమ్రింగి శీలవతి మందిరము వైపు పరుగెత్తాడు—అక్కడ మహాకవి కాళిదాసును కలుసుకొనవచ్చుననే ఉద్దేశముతో.

"మహాకవీ అతిఘోరమైన వార్త."

పతితమైపోతున్న యుగములో ఉన్న కాళిదాసు ఎంతటి ఘోరమ్మునైనా నిబ్బరముగా ఎదుర్కొనడానికి అలవాటుపడ్డాడు. అతడికి ఎలాంటి భయములూ లేవు అతడు శేషజీవన సర్వస్వముగా భావిస్తున్న రఘువంశ కావ్యరచన కూడా పూర్తయినది. "ఏమిటో అంత ఘోరమైన వార్త?" అన్నాడు తాపీగా.

"పుష్యభూతిని హత్యచేశారు." శీలవతి, కాళిదాసులిరువురూ చకితులైనారు. "భ్రమచెందావా ?" అని ప్రశ్నించారు.

"కాదు. కాదు." హృదయభారంతో అన్నాడు నిఖిలుడు. ఇక్కడికి వస్తుండగా దారిలో మిత్రులు పుష్యభూతి మరణానికి సంబంధించి వివరములిచ్చారు. అవి అన్నీ పూసగ్రుచ్చినట్లు వివరించాడు. అంతా నిశ్శబ్దముగా విన్నారు. చాలాసేపు హతబుద్ధులై కూర్చున్నారు. వారి ఇంద్రియములు తాత్కాలికముగా స్థంభించి పోయినవి.

"ఈవార్ధక్యములో అన్నీ హృదయ విదారకములైన

వార్తలే" అన్నాడు మహాకవి భారముగా. శీలవతి కన్నులు తుడుచుకున్నది

కాళిదాసు తనలో తానే అనుకున్నాడు: "పుష్య భూతి ఆర్యావర్తపు రక్షక భటుడుగా నిలచాడు. మృత్యు ముఖాన పడేవరకు ఆమెను రక్షించాడు. ఇప్పుడు ఆర్యావర్తమే తన బాధ్యతను విస్మరించగా, అతనిని నిందించవలసిన పని లేదు. అతనికి స్వర్గము ప్రాప్తించినది". "అయితే చూడు, ఆయన అంత్యక్రియల సంగతి ఆలోచించవద్దూ" అన్నాడు నిఖిలునితో.

'మరణించిన గూఢచారికి అంత్యక్రియలు నిషిద్ధ ములు"

"నిజంగానా ?"

"నిజంగా."

"అయితే నేనే స్వయముగా వెళ్లి మహారాజును సందర్శిస్తాను."

"అది వృథాప్రయాస అవుతుందేమోనని నా అను మానం. అంతకన్న మిత్రమండలి ముఖ్యునికి విన్నపము చేసు కోవడం ఎక్కువ ప్రయోజనకరము కావచ్చు."

"నావల్ల అదిమాత్రము జరగదు. 'యాచ్నామోఘా వరమధిగుణే, నాధమే లబ్ధకామా'. అధముని వరమడిగే కన్న ఉత్తముని అడిగి లేదనిపించుకోనడం మంచిది." మహాకవి నిట్టూర్చి సాలోచనముగా అన్నాడు:

"నే నెప్పుడో వ్రాసిన ముక్క ఇది. ఇప్పు డీవిధంగా ఉపయోగింపబడుతుందని ఎవరనుకున్నారు ?" మహారాజ దర్శనానికి బయల్దేరాడు.

మహాకవిని శ్వేతహూణవర్గము, మిత్రమండలి, కొందరు అధికారులు నిర్లక్ష్యము చేసినా మహారాజుకు ఆయ నంటే అమితగౌరవము, ప్రేమ.

'నా భాగ్యము పండినది. నా మహాకవి వచ్చారు" అంటూ బుధగుప్తుడు ఆహ్వానించాడు.

"నా కిది ఘనసత్కారము. రాజా, నే వృద్ధుడ నైనాను. నేను మునుపటివలె తిరుగలేను."

మహాకవి నేడిలా హఠాత్తుగా రావడానికి ఏదో విశేష మైన కారణముండి ఉంటుందని బుధగుప్తుడు గుర్తించి, "మహాకవీ! తమకు నావలన జరుగవలసిన పని ఏమిటి ?" అని అడిగాడు.

"రాజా, నేను చాలా విచారములో ఉన్నాను. పుష్య భూతిని చంపివేశారు. అతడి కళేబరమును నగరములో పార వేశారు."

"పుష్యభూతిని చంపారా ?" మహారాజు వణకి పోయినాడు.

"అ దెవరో శత్రువుల గూఢచారిదని నాతో చెప్పారే!"

"మీకు సరియైన వివరము లీయలేదు. మీరు తెలుసు కొనదలిస్తే, మరియొక సమయమున విన్నవించుకుంటాను.

ప్రస్తుతము నా మిత్రునికి అంత్యక్రియలు జరుపుకొనడానికి మీా అనుమతికై వేడుచున్నాను.”

“అలాగే”

వచ్చినపని పూర్తి అయి కాళిదాసు బయల్దేరబోతుండగా బుధగుప్తుడు “అంత్యక్రియలను సైన్యాధిపతికి ఉచితమైన సైనికమర్యాదలతో జరిపించండి” అన్నాడు.

“ఆ విషయాన్ని వదలివేయండి మహారాజా ! వాటిని నిరాడంబరముగానే జరుగనీయండి.”

“మీా రనుకున్నట్లే కానివ్వండి”

కాళిదాసు కృతజ్ఞతలు తెలిపి తిరిగి వెళ్లాడు.

అర్ధరాత్రివేళ, సిప్రానదీ తీరమున, మహాకాళేశ్వరాలయచ్ఛాయలలో పేర్చబడినచితిపై పుష్యభూతి మృతదేహమునకు అంత్యక్రియలు జరుగుతున్నవి. చితికి ప్రక్కగా నిఖిలుడు, కాళిదాసు, శీలవతి, మరికొందరు ఆప్తులు విచారవదనములతో నిలచిఉన్నారు. అగ్నిజ్వాలలు భగభగమనిలేస్తున్నకొలది, సిప్రానదీ జలాలు అగ్నికాంతులు ప్రతిబింబించాయి. నదికి ఆవలిఒడ్డున ఉన్నచెట్లు బంగారు కాంతులీనాయి. ఆలయము పైనున్న త్రిశూలము మెరసిపోయింది. మంటలు చల్లారినవి. మరల చీకటి వ్యాపించినది. పరమేశ్వరుని హస్తమువలె నున్న త్రిశూలము ఆకసము వంకకు తిరిగినది ఆర్యావర్తపు నభోమండలము అశ్రువులవంటి తారక

లతో నిండిపోయింది. తారకల మూగవేదన ఒకదానినుండొకదానికి వ్యాపించింది.

ప్రభాతవేళ పుష్యభూతి మిత్రులు నదీజలాలతో ఆ స్థలమును పరిశుభ్రముచేశారు. తర్వాత స్నానముచేసి ఇండ్లకు తిరిగి వెళ్లారు.

## ౨౬

నూలును ఎంతపొడవుగానైనా వడకవచ్చు. దానికి ఎక్కడోక్కడ అంతమనేది ఉంటుంది. కాని ఈ ప్రపంచము మాత్రం నిరంతరంగా వెళ్లిపోతుంటుంది. ఎప్పటికీ అది నిర్వ్యాపారమైపోదు.

పుష్యభూతి మరణానంతరము కొద్దిరోజులకు కుట్రదారులిద్దరు రహస్య సమాలోచనలు జరుపుతున్నారు. వారిద్దరు రోమని, బతునాశులు.

"సామ్రాట్టుపైన ఇక ఆధారపడేందుకు వీలులేదు. పుష్యభూతి అంత్యక్రియలకు సంబంధించి ఎంత గొడవ చేశాడు!" అన్నది రోమని.

"అతడిపై ఎంత తక్కువ ఆధారపడితే విజయము అంత తేలికగా లభిస్తుంది" అన్నాడు బతునాశుడు సాలోచనగా.

"కాని పైన ఉన్నవ్యక్తి ఆధారపడదగినవాడు కాకపోతే మనకు ప్రమాదం ఎదురవుతుందేమో?" సందేహాము వెలిబుచ్చింది రోమని.

"పైన ఉన్నది ఎవరనుకుంటున్నావు? నీవు, నేనే కదా!"

"నేనుమాత్రము కాదు బాబు. కీలకస్థానములో ఉన్నది నీవు. ఇక నేనా? అక్కడ ఉంచబడిన ఒక రంగు రంగుల నెమలిపెట్ట బొమ్మను."

"అదికూడా చాలా ఉపయోగకరమే! ఈ ఆడు నెమలిని చూచి అనేక మగనెమళ్లు చేరుతాయి."

"నాకు చేతనైన దంతవరకే. వాటిని చేర్చేవరకే."

"ఎందువల్ల?"

"నేను నెమలిబొమ్మనుమాత్రమే కదా"

"అంతేనా?"

"అంతకాక మరింకెంత?"

"మరి యువరాజు సంగతేమిటి?"

"అతడు నా చుట్టూ తిరుగుతున్నమాట నిజమే. కాని అంటీఅంటకుండా పూసుకుంటుంటాడు. తప్పత్రాగినప్పుడు మాత్రం ముసురుకుపోతాడు — అది మనిషయినా సరే కొయ్యబొమ్మయినా సరే!"

ఆమె మాటలకు నవ్వొచ్చింది. బక్షునాశుడు ఆమె బుగ్గ చిదిమి "అసాధ్యురాలివి! నీవంటి చురుకైనవాళ్లు లక్షకు ఒకళ్లుంటారో లేదో" అని ప్రశంసించాడు.

"సరే. ఈ కాలక్షేపపు కబుర్లు ఎందుకు? అవి ఇతరులకు వదలివేద్దాం. సామ్రాట్టుగాని మనకు వ్యతిరేకమైతే కథంతా అడ్డం తిరిగి ప్రమాదం ముంచుకొస్తుంది.

"సామ్రాట్టు వ్యతిరేకమైతే వచ్చే నష్టమేమీ లేదు."

"అదెలా?"

"అతడేమీ చేయలేడు. అతడి కాళ్లు, చేతులు, ముక్కు, కళ్లు, చెవులు అన్నీ కట్టుబడిలో ఉన్నాయి"

"అదా? అత డెవరికో—ఉదాహరణకు నాకు—దాసోహ మంటున్నాడంటారు."

"నీ యిష్టం, ఏమైనా అను; కాని అతడు కట్టుబడి ఉన్నదిమాత్రం నిజం. ఆ అంగాంగములే కాదు, అతడి హృదయంకూడా అన్యులవశమై ఉంది".

"మీ రనేది యువరాజును గురించా?"

"అవును. వాళ్లంతా ఈమైత్రీ సాగరంలో పడి జలకాలాడుకుంటున్నారు!"

"నిజమేనండోయ్. తియ్యతియ్యని కబుర్లతో జగత్తునే జయించవచ్చునని నాకింతకు పూర్వం తెలియదు సుమండీ!"

"తీయతీయని మాటలతో ఎందరినో జయించిన ఈ అందాలచిలక నోటినుండి ఈ మాటలు వింటానని నాకూ తెలియదు!" చమత్కరించాడు బటునాశుడు.

"నేను వట్టి మాటలతో ఏమీ జయించలేదు. బంగారం కూడా చాలా వాడాను" ముద్దులు గుడిచింది రోమని.

"కేవలం మాటలతో నా లక్ష్యం ఎప్పుడూ సిద్ధించలేదు. నేనూ చాలా బంగారం వాడాను. ఈ దేశంలో ఇంత కాలం గడిపిన తర్వాత నేనో అభిప్రాయానికి వచ్చాను. ఈ

ప్రజలకు లక్ష్యాలనబడే వాటిమీద చాలా సదభిప్రాయ ముంది. ఏదో ఒక పెద్ద లక్ష్యం ఉంటే చాలుననుకుంటారు. మన అభిప్రాయాలు వేరు. ఏదో ఒక పెద్ద లక్ష్యం ఉండడం మంచిదే కాని రంగురంగుల నెమలిపెట్టకన్న దానికి పెద్ద ప్రాముఖ్యత లేదు. నిజం. కొద్దో గొప్పో ఉపయోగం దాని వల్లనే. కాని బండినంతా అది తిప్పలేదు. అందుకు వేరే బల మైన బాహువులు రెండు కావాలి."

"మరి అయితే ఇంక బంగారమెందుకు ?"

"అదా ? బంగారము బాహువులలోకి సత్తువను పోస్తుంది. ఇదంతా తెలిసే మనరాజు మనలనిద్దరనూ ఇక్క డకు పంపాడు. కదిలితే మెదిలితే నాణేలసంచి విప్పడం నా వంతు; కులుకు తళుకుల వలలతో పాటు వాటిని విసురుతూ ఉండడం నీవంతు."

"...నే నేమి సంకోచించడం లేదే ?"

"నాకు తెలుసు. నీభవంతినుండి బంగారు నదులు... అలా... అలా... ప్రవహించి, ఆకాశంలోకి... అలా... అలా... ఇంద్రధనస్సుల్లాగా అందంగా వెళ్లిపోవడాన్ని చూస్తూనే ఉన్నాను." చేతులు తిప్పుకుంటూ అన్నాడు.

"పాపం, ముఖ్యమంత్రి ! నా వన్నెచిన్నెలకు బానిసై పోయినాడు—ముసిలి డొక్కైపోయిన ఈ పెద్దవయసులో కూడా !" తన తెలివికి తానే మురిసిపోతోంది రోమని.

"అది సహజమే. ఆతని జీవన భాండం అడుగు

జిక్కింది. ఆఖరిబొట్టును పీల్చేవరకు కూడా అతడి దాహం తీరదు."

"అది సరే. ఆ ముఖ్యమంత్రి బాపతు పిల్ల ఏమైంది?"

"మధువల్లరి సంగతా నీవడిగేది? నీ వేడికి తాళలేక దేశం వదలిపోయిందిగా".

"పీడ వదలింది"

"కాని మరొకపీడ..."

"ఆ దయ్యం ఎవరు?"

"ఎవరోమరి. కోపోద్రిక్తుడైన యువకుడొకడు. నగరంలోని యువజనమంతటిని మనపైకి రెచ్చగొడ్తున్నాడు."

"ఏమంటూ డేమిటి?"

"ఏమీ అనడు. వచ్చిన చిక్కే అది."

"మరి అయితే ఇబ్బంది ఏమిటి?"

"ఆకాశం దద్దరిల్లేట్లు ఉజ్జయిని బాల్హీక్ మైత్రికి అందరూ జయజయధ్వానాలు పలుకుతుంటే వీళ్ళు ఉలకరు, పలకరు. మైత్రీ చిహ్నంగా శ్వేతపుష్పాన్ని అందివ్వబోతే ఒకడుగు వెనక్కివేసి మరీ నిరాకరిస్తారు."

"అంత ధిక్కారమా?"

"వారంతా కడుపులో మాట బయట పెట్టరు. నిందకుండలు కాస్తనిదానించు. నే చెప్పే కథ ఇంకా పూర్తి కాలేదు. ఉజ్జయిని గోడలనిండా మనకు వ్యతిరేకమైన నినాదాలు—'శ్వేతహూణులు శత్రుసేనలు' అనీ, 'శ్వేతహూణులు

నశించాల'నీ—నీవు చూస్తూనే వున్నావు. ఓ రోమనీ! ఏమని చెప్పను నీకు! ఒకరోజున ఒక గోడమీద ఒక బొమ్మ వేశా రెవరో. పెద్ద తప్పట ముక్కుతో, పీలకాళ్లతో ఒక మనిషి బొమ్మఅది; దాని క్రింద 'బతుకునాశుడు సర్వనాశుడు' అని వ్రాసి ఉన్నది."

"అయితే ఈసంగతంతా మీరు యువరాజుతో చెప్పి, ఎందుకు చర్యతీసుకొమ్మనలేదు?"

"ఆ నేరస్థులను గుర్తించడ మెట్లా?"

"వాళ్లు ఆ అల్లరిమూకకు చెందినవాళ్లేకదా?"

"అని నీ ఊహ."

"అయితే మరి మీ ఊహ ఏమిటి?"

"ఆ అల్లరిమూకకు చెందినవాళ్లేవనూ"

"ఎక్కడినుండో వచ్చిన ఆ యువకుడి నాయకత్వం లోనే చేస్తున్నారా?"

"నిస్సందేహంగా"

"అయితే అతడిని ఒకసారి మన భవనంలోకి పంపిస్తా రేమిటి?"

"ఏం? తమరు ఆతడిని మార్చివేస్తారా?" వ్యంగ్యంగా అన్నాడు బతుకునాశుడు.

"వీలున్నంతవరకు ప్రయత్నించి చూస్తాను. ఈ యువ కులు చాలా మొండివాళ్లని మీకు తెలుసుకదా. ముసలి

వాళ్లు తేలికగా నాకు బానిసలై పోతున్నారు. సరే. ఏమైనా ఒకసారి ఇటు పంపించండి.''

ఇంతలో బయట పల్లకీమోత వినవచ్చింది. ''ష్. అర వక. యువరాజు వస్తున్నట్లున్నా''డని హెచ్చరికచేశాడు బతునాశుడు.

''అయితే వరద ఎంతదూరంవరకు వచ్చిందేం?'' గుస గుస లాడుతూ అడిగింది రోమని.

''జమునానదివరకు వచ్చినట్లు మన గూఢచారులు వర్తమానం తెచ్చారు. మరిరెండు నెలలలో ఇక్కడికి చేరవచ్చు.''

''ఈ రెండునెలలూ ముఖారి విద్రోహం చేస్తున్నాడనే భయ భ్రాంతులు రెచ్చగొట్టాలన్నమాట.''

''ష్. ఇక ఊరుకో. అడుగుల చప్పుడు వినవస్తోంది.''

వా రనుకుంటున్న వరదలు శ్వేతహూణ సేనావాహినులకు సంబంధించిన వరదలు.

యువరాజు ప్రవేశించాడు. రోమని, బతునాశులు అతి నమ్రతతో నమస్కరించారు. యువరాజు ఆమె ముఖంలోకి కన్నార్పకుండా చూస్తూ ''రోమని అందం రోజురోజుకూ ఎక్కువవుతోంది'' అన్నాడు గుటకలు వేస్తూ.

''నా ముఖంలో ఏమిఉన్నది మహారాజా! నా ముఖాన్ని చూస్తున్న ఆ కండ్లదే ఆ అందమంతా'' అని ఉత్సాహ పరచింది రోమని.

"రండి. వెళ్దాం". అంటూ ప్రక్కగదిలోకి దారి తీసింది.

నమస్కారాలు ముగించుకొని బక్షునాశుడు చల్లగా బయటికి దారితీశాడు. ఏ సమయంలో తప్పుకోవాలో, ఏ సమయంలో ప్రవేశించాలో అతడికి బాగా తెలుసు!

## ౩౮

ఒక దేశంలోని యావత్తు ప్రజానీకము మూఢులు, ఉన్మాదులు, పంచమాంగదళికులు అయిఉండరు. ఉజ్జయినీ ప్రజలలో కూడా కొందరు తమ జీవనంద్వారా ఈసత్యాన్ని ఋజువుచేశారు. రోమని వలపు కులుకులుగాని, బక్షునాశుని బంగారు నాణేలుగాని వారిని వలలో వేసుకొనలేక పోయినవి. తమ మధ్య ఉంటున్న హూణుల చేష్టితాల నన్నిటిని వారు చాలా బాధతో తిలకిస్తున్నారు. ఉజ్జయిని - బాల్హిక్ మైత్రీ వ్యవహారానికి సంబంధించి వారు సందేహంతోను, విమర్శనా బుద్ధితోను ఉన్నారు. వయస్సులో వారంతా పిన్నలే. సమాజంలో వారి స్థాయికూడా పెద్దవిశేషమైన దేమీకాదు. సుఖజీవనవర్గానికి చెందినవారూకాదు. ప్రతియుగంలోనూ, ప్రతిచోటనూ ఈ సుఖజీవనవర్గాలనుండి, అధికారవర్గాలనుండే తరచు మొట్టమొదట విప్లవకారులుగాని, దేశద్రోహులుగాని ఉద్భవిస్తుంటారు. చరిత్రయందంతటా అవే ఉదాహరణలు. నమ్మండి నమ్మకపోండి; ప్రపంచపు తీరేఅంత. అట్టడుగున ఉన్నవాడు పైమెట్టుకు ఎగబాకాలని అనుకుంటూ ఉంటాడు.

తానుకూడా అందుకు అర్హుడనేనని భావిస్తాడు. ఈభావంతో తనలో తనే సణుగుకుంటాడు. అసంతృప్తి చెందుతాడు. ద్వేషభావం కూడా వహిస్తాడు. నిజమైన అన్యాయాలు, అతడి ఊహల్లోని అన్యాయాలు, అసూయావిద్వేషాలు–ఇవన్నీ పేరుకుపోయి, ప్రభుత్వయంత్రాంగాన్ని పటాపంచలు చేసే ట్టుగా తయారవుతాయి. ఉజ్జయిని ప్రభుత్వయంత్రాంగము కూడా అలాగే తయారైనది.

కాని మైత్రీ సంఘపు అడుగుజాడలలో నడువ నిరాక రిస్తున్న యువకులు, చేతిలో ఎలాంటి అధికారమూ లేని సర్వసామాన్యులు మాత్రమే. నెమ్మదిగా, పరోక్షంగా, అతి రహస్యంగా వారు ఈ శ్వేతహూణ వర్గముమీద, మైత్రీ మండలిమీద తమకై తామే యుద్ధం ప్రకటించుకున్నారు. రాత్రివేళ గోడలనిండా ఇంటింటివద్దా నినాదాలు వ్రాసే వారు. అన్నీ శ్వేతహూణులకు సంబంధించినవే. ఇక్కడొక హెచ్చరిక ... అక్కడో వ్యంగ్యోక్తి ... ఇలా, తమకు బహిరం గముగా శ్వేతపుష్పాలివ్వవస్తే మౌనంగా నిరాకరించేవారు. ఇంకా అనేక విధాల శ్వేతహూణులఎడ, వారి సమర్థకుల ఎడ నిరసన వెల్లడించేవారు. శ్వేతహూణులు ఉజ్జయినీ శత్రువు లనీ, మిత్రమండలి జాతీయవిద్రోహశక్తియనే వార్త నగర మంతా రహస్యంగా వ్యాపించిపోవడానికి కారకులు వారు. ఈవార్తలోని సత్యాన్ని గ్రహించినవారు లేకపోలేదు. అయితే ప్రజానీకమంటే కేవలం వీరేకాదు. తమ బుద్ధిని ఉపయోగించకుండా ఎవరినైనా నమ్మివేసే మూఢులు, వాస్త

వాన్ని నమ్మి నిరాకరించేవారు— ఇత్యాదులంతా కలిసి సమాజాలు అవుతున్నాయి. ఉజ్జయినిలోకూడా ఈబాపతు వంతులేకపోలేదు.

ఈ యువకులు చాలామంది ఉన్నా వీరికి ఒకచక్కని నాయకుడులేడు. ఆర్థికస్థోమతు కూడా లేని రహస్య -ద్యమ కారుల బృందము అది. ప్రస్తుతం, దేవుడు పంపినట్లుగా వారికొక పరదేశీ యువకుని నాయకత్వం లభించింది. అతడొక సన్యాసి. చాలా పిన్నవయస్కుడు. ఆకర్షణీయమైన విగ్రహం. కాషాయదుస్తులు ధరించి, నడుము కొక నారతాడు బిగించుకొని ఉంటాడు. వయస్సున అనుచరులకన్నా చిన్నవాడైనప్పటికీ, అతడి వాగ్ధాటి, సంభాషణాచాతుర్యము, ఉత్తేజకర ప్రసంగములు చేయుటలోని ప్రతిభ, ఇట్టే ఆకర్షించే రూపురేఖలు— వీటన్నిటిని మించి నాయకున కవసరమైన లోక సంగ్రహశక్తి—వీటన్నిటివల్ల అతడు మిత్రుల హృదయాలను తేలికగా చూరగొన్నాడు. వారంతా అతనిచుట్టూ చేరారు. అతడు వారిని సంఘటిత పరచాడు. వారికొక లక్ష్యాన్ని, సంస్థకొక పేరును ప్రతిపాదించాడు.

నగరం వెలుపల, రాత్రివేళల ఒకశిథిల గృహంలో ఈ యువకులంతా సమావేశమయినారు. దాదాపు యాభై మంది ఒక గుడ్డిదీపం ముందు చేరారు వారంతా మండలాకారంలో కూర్చునిఉన్నారు. మధ్యన సన్యాసి నాయకుడున్నాడు. అతడి చేతిలో ఒక ఎర్రగలువ ఉన్నది.

"మన సంఘానికి అరుణపుష్పసంఘమని పేరుపెట్టు కుందాం" అన్నాడు.

"చక్కని పేరు" అన్నాడొక యువకుడు.

"శ్వేతపుష్ప సంఘానికి గట్టి సమాధానమిది" అన్నాడు మరియొకడు.

"మనసంఘసభ్యులు ప్రతివారూ చేతిలో ఒక ఎర్ర కలువను ధరించాలి. అది మనసంఘపు గుర్తు" అన్నాడు నాయకుడు.

"మనం ఎర్రకలువలను పంచిపెట్టితేకూడా బాగుం టుందేమో" ఉత్సాహంలో సూచించాడొక యువకుడు.

"దానికింకా సమయము రాలేదు. పైగా విచక్షణా రహితంగా పంచిపెట్టడం సంఘ నిర్మాణాన్ని పాడుచేస్తుంది. మనకు కావల్సింది చాలామందితో కూడిన గుంపులుకాదు. సుసంఘటితులు. సుశిక్షితులునైన కార్యకర్తల బృందము" అని నాయకుడు బోధించాడు.

"మరి వారు అసంఖ్యాకముగా ఉండగా, మనము కొద్దిమందిమి ఏమిచేయగలము?"

"మనము బహిరంగముగా పోరాడితే మనకు చాలా మంది కావాలి మనకది ప్రస్తుతము సాధ్యముకాదు. అందు వల్ల ఎత్తుగడల పోరాటము సల్పవలసి ఉంటుంది."

"మరి మనము ఇంతకూ చేయవలసిన దేమిటి?"

"ప్రస్తుతం మనము చేస్తున్నపనే చేస్తూఉందాం. క్రమంగా ఇతర రంగములు ప్రారంభిద్దాం."

"ఇతర రంగములంటే ?"

"సమయము రాగానే అవన్నీ నిర్ణయించుకుందాం. మీకు తగినంతముందుగానే తెలియజేయబడుతుంది. అవసరమే మన కార్యరూపమును నిర్ణయిస్తుంది."

"మన కర్తవ్యాలలో రహస్యముగా కొందరిని కడతేర్చడముకూడా ఉంటుందా ?"

"ఎర్రకలువే మీకు సమాధానమిస్తుంది." అని సన్యాసి గంభీరముగా అని "ప్రస్తుతము శత్రువుల మార్గములో వీలున్నన్ని అవరోధములు కల్పించడమే మనపని" అని సూచించాడు.

"మన నగరముపై శ్వేతహూణసైన్యములు దాడిచేసే ప్రమాద మేదైనా ఉన్నదా ?"

"ఆ ప్రమాదము ఎప్పుడూ ఉండనే ఉన్నది. శ్వేతహూణవర్గము ఇక్కడ తమ పరిస్థితిని బాగా బలపరచుకున్నది. జనసమూహాలలో ప్రచారానికి మిత్రమండలివారి యంత్రాంగము. పెద్దపెట్టున దాడిచేయడానికి ఇదంతా పూర్వరంగము.

"అయితే మరి మన కర్తవ్య మేమిటి ?"

"నేను మీకు చెప్పనేచెప్పాను. పరిస్థితులే మన కర్తవ్యాన్ని నిర్ణయిస్తాయి."

"వారి నాయకుడు బత్సనాశుడు"

పళ్ళు కొరుకుతూ బిగ్గరగా అరచా డొక బుడుతడు.

"కాని రోమని ప్రభావం మరింత నాశనకరం. ఆ మాయలమారి ప్రతివారిని వశం చేసుకుంటోంది." వ్యాఖ్యానించాడు మరియొకడు.

రోమని పేరు వినగానే సన్యాసి కన్నులు నిప్పులు కురిపించాయి. "ఆమె సంగతి నాకు వదలివేయండి" అనిమాత్రం అన్నాడు రౌద్రంతో.

"అయ్యా! మీరు పురుషులు. స్త్రీమీద ఎలా చేయి చేసుకుంటారు?" సందేహం వెల్లడించాడొకడు.

"చరిత్ర చాలామారులు అలాంటి అధికారాన్ని ఇచ్చే ఉన్నది. అయినా నే నామెను హతమారుస్తానని అనలేదే?" అన్నాడు సన్యాసి.

సమావేశము పూర్తయినది. సభ్యులంతా వెళ్లిపోయారు. ఈ సన్యాసి ఎవరో తెలుసుకుందామనే ఆలోచనే ఎవరికీ కలగలేదు. సన్యాసికి మొదలు తుది ఉండనక్కర లేదని, కేవలం కర్తవ్య నిర్వహణకోసమే వస్తాడని వారికి విశ్వాసం వారి ఆసక్తి అంతా ఆకర్మస్వరూపానికి మాత్రమే పరిమితమైఉన్నది. ఆవిషయంలో వారికి పూర్తి సంతృప్తి కూడా కలిగింది.

౨౮

వయస్సు మళ్లిన కాళిదాసు చూపులకు మామూలు గానే కనిపిస్తున్నా, పుష్యభూతి మరణముతో ఆయన హృదయం వ్రయ్యలైపోయింది. ఈ విషాదకర సంఘటన జరిగేవరకు ఉజ్జయిని పతనాన్ని ఎవరూ నిరోధించ లేరనే భావమే అతడికి కలుగలేదు. దాని వైభవదశ వెళ్ళిపోయింది. తరచు తలుపులు వేసుకుని ఇంట్లోనే కుమిలిపోతుండేవాడు. బయటికి కూడా ఎక్కువగా వెళ్లేవాడుకాదు. శీలవతిఇంటికి వెళ్ళటముకూడా తగ్గిపోయింది.

ఒకరోజున ఆయన పెరట్లో తిరుగుతుండగా అక్కడ పడిఉన్న ఎర్రగలువ నొకదానిని చూచి కొంచెం ఆశ్చర్య పడ్డాడు. అది అప్పుడే వేసిన పువ్వువలె ఉన్నది. ఆశ్చర్యంతో పైకి తీశాడు. ఇంతలో అక్కడికి వచ్చిన నిఖిలుడు అది చూచి "అయితే ఎర్రగలువ మీ చేతులలోనికి కూడా వచ్చిన దన్నమాట!" అన్నాడు.

"ఎందుకంత ఆశ్చర్యం?" అన్నాడు కాళిదాసు.

"ఉదయమే నేను లేచేసరికి మా వాకిట్లో కూడా ఒక ఎర్రగలువ పడిఉంది. ఎవరి బుట్టలోనుండైనా పడిపోయిన దేమో ననుకున్నాను. కాని ఇప్పుడు చూస్తే ఏదో ఆలోచించ దగిన విషయమనిపిస్తోంది."

"ఏదైనా సందేహము కల్గుతోందా?"

"ఇది ఎవరి పూలసెజ్జనుండో జారి పడిపోయిన బాప తుగా లేదు".

"మరి ఎక్కడనుండి వచ్చిందంటావు ?"

"నేనూ అదే ఆలోచిస్తున్నాను". అంటుండగా వసంతకుడు మెల్లగా అడుగులో అడుగువేస్తుకుంటూ అక్కడకు వచ్చాడు. అతణ్ణి చూచి కాళిదాసు, నిఖిలుడు ఆశ్చర్యంతో "నీ చేతిలోని ఎర్రగల్లువ ఎక్కడిది ? విచిత్రంగా ఉందే ?" అని ఒక్కసారిగా అరిచారు.

"అరే ! మీ చేతుల్లోకూడా ఎక్కడివి ?" సమాధానం ఈయకుండానే తానూ అరచాడు వసంతకుడు.

"ఇందులో ఏదో విశేషం తప్పకుండా ఉన్నది" అన్నాడు నిఖిలుడు.

* * *

"ఈ పువ్వు ఎక్కడినుండో వచ్చిపడ్డది".

"ఎలా వచ్చిందేం ?" కవి అడిగాడు.

"నేను నిద్రలేచేసరికి ఇంకా మసక వెల్తురుగానేఉంది. తలుపు తెరచి, కళ్లు నులుముకుంటూ వాకిట్లోకి వచ్చేసరికి ఎవరో దీనిని నాచేతిలో తురిమి ఉడాయించారు. నేను వారిని సరిగా చూడనైనా లేదు".

"ఎంత విచిత్రం !" మెల్లగా అన్నాడు కవి.

"విచిత్ర మెందువలన ?"

"ఎందువల్లనా ? ఇదేమీ ఆశ్చర్యచేష్ట కాదు కనుక."

"అయితే మరి ఇది ఏమి చేష్ట?"

"ఈ ఎఱ్ఱగలువ లన్నిటి వెనుక ఏదో అర్థమున్నది." అన్నాడు కాళిదాసు.

సాయంత్రము అందరూ శీలవతి ఇంట్లో చేరేసరికి కాళిదాసు అన్నమాటలు వాస్తవమని తెలియవచ్చింది. ఎఱ్ఱగలువ విచిత్రోదంతం క్రమంగా తెలియవచ్చింది. శీలవతి చేతిలోకూడా ఒక ఎఱ్ఱగలువ ఉన్నది! మహాకాళేశ్వరాలయములో ఒక ఎఱ్ఱగలువల గుత్తి ఉంచబడినది! రాజభవన సింహద్వారములో ఎఱ్ఱగలువల తోరణము! ఇంకా ఎందరో పౌరులకు ఎఱగలువ బహుమానములు! అయితే ఈపని చేస్తున్న దెవరో తెలియలేదు. మనిషిని గుర్తించేలోపుగానే అతడు వెళ్ళిపోతున్నాడు.

నిఖిలుడు, వసంతకుడు ఈకథలన్నీ చెప్తుండగా కాళిదాసు సాలోచనగా "ఈ ఎఱ్ఱగలువ శ్వేతపుష్పానికి సమాధానమేమో!" అన్నాడు.

ఉద్రేకముతో చెవులు రిక్కించుకొని విన్నారు వారీ మాటను.

"అదీ కథ. శ్వేతపుష్పధారులకు గట్టి ప్రతీకాలురు వచ్చారు! వారి తెల్లగలువకు వీరి ఎఱ్ఱగలువ సమాధానం!" తన్మయత్వంలో అన్నాడు నిఖిలుడు.

"మహాకాళుడు ఈ ప్రతీకారులను రక్షించుగాక!" అనుకున్నది భక్తిపురస్సరముగా శీలవతి.

"ఈమధ్య నగరంలో ఒక యువకసన్యాసి సంచారం చేస్తున్నాడు. అతనికి దీనితో ఏమైనా సంబంధమున్నదా?"

"అందుకంత అవకాశము లేదే?"

అయితే కాళిదాసుకుమాత్రం పరిస్థితి అంత ఆశా జనకంగా లేదు. ఆయన సహచరులుమాత్రం ఏదో ఉత్సాహంలో పడ్డారు.

"దేవుడు తనసృష్టిని తానే నిర్మూలించడు" అన్నాడు నిఖిలుడు సంస్కృత లోకోక్తి నొకదానిని గుర్తుచేసుకొని.

"అది నిజమేకాని దేవునిసృష్టి ఉజ్జయినికి మాత్రమే పరిమితమై లేదు" అన్నాడు కాళిదాసు.

"శ్వేతపుష్పధారుల పాపాలకు సరియైన పరిహారం ఈ ఎర్రగలువే అయితే..."

"పరిహారాలు పాపపంకిలాన్ని నిర్మూలించేమాట నిజమే. పాపరాహిత్యము దానిఫలము. అది ఎంతో వాంఛనీయమే అయినా, ఈ తతంగములో పాపముచేసినవాడు నశించవచ్చు. అందుకు మాత్రం పశ్చాత్తాపపడరాదు".

"పాప, పుణ్యాము లనేవి మానసిక ప్రవృత్తులు. అవి రాజకీయాల గతి నెలామార్చగలవు?"

"అవి ఎందుకు ప్రభావితం చేయవు? పాపము, దోషము అనేవి మానవుని మనోయంత్రమువల్ల ఉద్భవిస్తుంటాయి. వ్యక్తిని నడిపించే సూత్రాలే జాతిని, రాజ్యాన్ని నడిపిస్తూ ఉంటాయి. వేరువేరు విషయాలను నడిపించేందుకు

వేరువేరు సూత్రాలు, వేరువేరు దైవాలు ఉండరు. నిఖిల్! ఇది తెలుసుకో. మహాసామ్రాట్టులను, మహారాజ్యాలను కూకటివేళ్ళతో పెళ్ళగించే విధిసూత్రాలే పేదవాని పూరి గుడిసెనుకూడా పెళ్ళగించేది. వ్యక్తుల పాపాలవల్ల సమాజము సర్వనాశన మవుతుంది. వ్యక్తుల సద్గుణాలవల్ల సమాజము ఉద్ధరింపబడుతుంది. సత్కర్మ, దుష్కర్మ లనేవాటిని పరిగణించకుండా నీవు సమాజనిర్మాణం చేయనేలేవు. సాంఘిక న్యాయమని, అన్యాయమని నీవు ఏమిపేర్లుపెట్టినా సరే. మానవుడు పెట్టే ఈపేర్లను విధి అంతగా పట్టించుకోదు".

"అంటే ఉజ్జయినీ పతనము అనివార్యమంటారు మీరు".

"ఆహాం. దూరాన కనిపించిన అలలు అక్కడే వికలమై పోవడం ఎంత అనివార్యమో ఇదీ అంతే అనివార్యము".

"అంటే మేమిప్పుడు పడుతున్న సంతృప్తి, ఉత్సాహం అర్థంలేనివంటారు".

"ఎంతమాత్రం కాదు. మరణోన్ముఖుడైనవాడు ఆఖరి క్షణాలలో శాస్త్ర జ్ఞానం కలిగి దైవభక్తిలో నిమగ్నుడైనాడనుకో. అదే సంతృప్తి. దానికే కొంత ఆనందించవచ్చు".

"ధర్మో రక్షతి రక్షితః". ధర్మమును రక్షించుకోగలిగిన వాని నది రక్షిస్తుంది. ఉజ్జయిని ధర్మానికి రక్షగా ఉన్నంత కాలం ధర్మం ఉజ్జయినిని తప్పక రక్షిస్తుంది".

"అయితే ఇప్పటి స్థితి ఏమి టంటారు?"

కాళిదాసు మాట్లాడలేదు. తనలో రేగిన భావాలను లోలోపలనే దాచుకున్నాడు.

## ౨౮

పుష్యభూతి మరణించి అప్పటికి రెండు నెలలయింది. ఒకరోజున నగరమంతా గంభీరమై పోయింది. శత్రువులు దండెత్తి వస్తున్నారనే వార్తతో ఉడికిపోయింది. ఎవరా శత్రువులు ? ఎక్కడినుండి వస్తున్నారు ? ఎందరున్నారువారు? ఈ ప్రశ్నలకు ఎవరికీ సమాధానము తెలియటములేదు. ప్రతి వారూ 'శత్రువు లొస్తున్నారు. మనం పారిపోవాలి. లేకపోతే చచ్చిపోతాము' అని గగ్గోలు పడ్డవారే.

పౌరులంతా భీతావహులై పోయినారు. ఎర్రగలువ బృందంవారు మాత్రము రహస్య సమావేశాలు జరిపి ప్రజలకు ధైర్యం చెప్పాలని ప్రయత్నిస్తున్నారు. 'మీరు పారిపోయినంత మాత్రాన ప్రమాదం తప్పదు. ధైర్యంగా పోరాడడమే మేలు' అని ఉద్బోధిస్తున్నారు. అయితే ప్రజలు పోరాడడమనే దానినే మరచిపోయినారు. ఆయుధము అనగానే వారికి వణకు ప్రారంభమవుతుంది. వారిని ఉద్ధరించడానికి అన్నట్లు బ్లాక్ మిత్రమండలి ఊరేగింపులో వచ్చింది. మేళ తాళాలతో, జండాల రెపరెపలతో వచ్చి బహిరంగ ఉద్ఘాటనలు చేశారు: "పౌరసోదరులారా, భయపడకండి శత్రుమూకలు ఓడిపోయి పారిపోయినాయి" అంటూ. ఎవరు ఎవరిని ఓడించారనే ప్రశ్న ఎవరికీ పట్టలేదు. ఆతర్వాత మిత్రమండలి వారు ప్రకటనను పూర్తిచేశారు : "మాంసాహారీవర్గంవారు నగరముమీదికి దండెత్తి వస్తే శ్వేతహూణ సైన్యాలు తరిమి

తరిమి కొట్టాయి"అని. ఆర్యావర్తంలోకి శ్వేతహూణ సైన్యాలెలా వచ్చాయనే ప్రశ్న ఎవరికీ పట్టలేదు సరికదా శ్వేత హూణులంటే ఏదో కృతజ్ఞతాభావం పొటమరించింది. "మన సైన్యాధిపతి వట్టి పనికిమాలినవాడు. శ్వేతహూణ సైన్యాలుండబట్టి మనం బ్రతికిపోయాము" అనుకున్నారు వారు. ఆ వెంటనే మిత్రమండలి ప్రచారంలో మూడవ అంశం ప్రారంభించారు: "మేము చెప్పలేదా? శ్వేతహూణులు మన శత్రువులు కాదు; పైగా మనకు ముఖ్యమిత్రులు" అని. క్రమంగా నగరంలో శ్వేతహూణుల ప్రతిష్ఠ పెరిగిపోయింది. నగరానికి వారు ముఖ్యులు, ప్రాబల్యం కలవారు అయినారు. వీధుల్లోని జనులు నగరానికి సంరక్షకులు వారే ననుకుంటున్నారు.

ఒకవారం తిరగకముందే ఉజ్జయినీ పౌరులకు మరొక ఆశ్చర్యం తటస్థించింది. బురుజుల మీదనుండి చూస్తే ఉత్తర దిశలో ఆకాశపు టంచున వేలసంఖ్యలో సాయుధ అశ్వికదళాలు కానవచ్చాయి. వరదలో ఉన్న మహావాహినికివలే వారు తమవైపే వస్తున్నారు. పౌరులు ఒకరిముఖా లొకరు చూచుకుంటూ "ఏమిటిదంతా? ఎవరీసైనికులు?" అనుకుంటున్నారు ఒకరితో ఒకరు.

మిత్రమండలికి చెందిన స్వచ్ఛంద సైనికులు అటునిటు తిరుగ నారంభించారు.

"ఆందోళనకు అవసరమేమీ లేదు. మీకు కనిపించడము లేదా? వారంతా మన సంరక్షకులైన శ్వేతహూణ

సైనికులు. మౌఖారీలను తరిమికొట్టి కాస్త విశ్రాంతి నపేక్షి స్తున్నారు" అని పౌరులను జోకొట్ట నారంభించారు.

ప్రజలు ఎంతో సంతోషించారు. 'మిత్రు'లైన ఆ అతిథులకు స్వాగత సత్కారపు ఏర్పాట్లకు దిగారు.

శ్వేతహూణ సైన్యాలొస్తున్నాయనగానే బుధగుప్త సామ్రాట్టు సందేహంలో పడ్డాడు. నగరంలోనికి వారి రాకను నిరోధించమని ఆజ్ఞలు జారీచేశాడు. అవి పాలింపబడనే లేదనే విషయం వేరే చెప్పనక్కరలేదు. సైన్యాధికారి, ప్రధానామాత్యుడు, అన్యరాజ్యాధికారులు, చివరకు యువరాజు సహితము శ్వేతహూణుల సానుభూతిపరులే కనుక, సైన్యాలను నిరోధించే ప్రశ్నే లేదు. వారంతా మౌఖారీలను తరిమివేశారనే భ్రమలో ప్రజలుకూడా అభిమానం చూపిస్తున్నారు. "మన రాజుకు వార్ధక్యదోషంకొట్టి సందేహాలలో పడ్డాడు" అనుకున్నారు. "అయినా ఈ ఆధునికకాలపు రాజకీయాలు ఆవయస్సులో ఉన్నవ్యక్తికి ఏమి అర్థమవుతాయి? ఆయన ఆజ్ఞకు మనం తలవంచవచ్చుగాని, దాని నమలు చేయడం మాత్రం అనవసరం" అనుకున్నారు.

శ్వేతహూణ సైన్యాలు నగరప్రవేశం చేసినప్పుడు అడ్డగించినవారు లేరు. ప్రొద్దు గ్రుంకకపూర్వమే వారు చక్కగా స్వాగతాలమధ్య నగరప్రవేశం చేశారు నామకః పాలకు డెవరైనా నగరము వారి అధికారములోనికి వచ్చింది. శ్వేతహూణ సైన్యాధికారి అయిన హింగ్‌చల్ మృదుపదయుతమైన తన శ్రీముఖాన్ని చదివాడు: "మేము ఉజ్జయినికి

మిత్రులము. దాని సేవచేయుటకై వచ్చినవారము. ఉజ్జయినీ రక్షణార్థము మౌఖారీలను తరిమివేసినాము. ఈ దేశమునకు బయట, లోపల ఉన్న శత్రువులనుండి కాపాడడానికి ఇక్కడ నివసించ దలిచినాము.'' దాని పూర్తిపాఠ మిది.

మౌఖారీల దండయాత్ర అనేది ఒక అబద్ధం; దాని వల్ల భయమనేది నిరాధారం; వారిని హూణులు తరిమి కొట్టారనేది ఒక కట్టుకథ; ఉజ్జయినికి మిత్రులుగా, రక్షకులుగా హూణులు వచ్చారనేది మరొక అసత్యం; మధుర పదాలతో మేళవింపబడ్డ అసత్య పరంపరకూడా ఒకప్పుడు ఏకైక సత్యంగా చెలామణి అవుతూంటుంది!

వీటన్నిటికి మకుటాయమానమైనది రాజభవనమునుండి బుధగుప్తుని ముద్రతో వెలువడిన ఒక సందేశము. అందులో ఇలా ఉన్నది: ''ప్రవాస మొచ్చిన శ్వేతహూణ సైనికులకు, సమర్థవంతుడైన వారి నాయకుడగు హింగ్‌చల్‌కు సామ్రాట్ తమ హృదయపూర్వ కాభినందనలు తెలుపుతున్నారు. సామ్రాట్టు వయోవృద్ధుడైన కారణమున రాజ్యత్యాగముచేసి తపశ్చర్యకై అరణ్యముల కేగుతున్నారనేవిషయము ప్రజలు గమనింతురుగాక! ఇకనుండి యువరాజైన పురగుప్తుడే రాజ్య పాలనా భారము నిర్వహిస్తారు.''

సామ్రాట్టు నిష్క్రమణ కొందరికి విచారము కలిగించి నప్పటికీ, మరికొందరు—ముఖ్యముగా శ్వేతహూణవర్గాలు—పురగుప్తుడు రాజైనందుకు ఆనందంలో తేలియాడిపోయినారు.

సామ్రాట్టు నగరాన్ని ఎప్పుడు విడచి వెళ్ళేది, అడవులలో అతడెక్కడ ఉండేది వాటికి సంబంధించిన ప్రకటన లేవీ వెలువడలేదు. అసలా వృద్ధు డెన్నడూ కనిపించనేలేదు. ప్రజలు అతని రాజ్యత్యాగోదంతాన్ని దిగమ్రింగివేశారు.

# ౩౦

ఉజ్జయినీ చరిత్రలో నూతన శక మారంభ మయినది. నామకః పురగుప్తుడు రాజు. వాస్తవ పరిపాలనాధికార మును -రోమని, హింగ్‌చల్, బక్షునాశుడు- ముగ్గురూ నిర్వహించేవారు. ప్రధానామాత్యుడు, సైన్యాధికారి, ఇతర అధికారులు మున్నగు వారంతా ఈ ముగ్గురికి లోబడి పనులు చేసే సామాన్య అధికారులు. శాంతి భద్రతల చర్యలతో దేశ మంతా స్మశాన శాంతియందువలె ప్రశాంతమైనది.

స్మశాన శాంతి కూడా నిరంతరముగా ఉండదు. క్రమంలో శాంతి రాహిత్యం ప్రారంభమైనది. ఒక రోజున సైనికుల గుడార మొకటి అగ్నిహోత్రుని కాహుతిఅయినది; మరొక రోజున వారి భోజన శకటము నిరోధింప బడినది; ఇంకొక సందర్భములో శ్వేతహూణు నొకని చావగొట్టారు. వారివారి భవనాల గోడలమీద దూషణలు, వ్యతిరేక నినాదాలు వ్రాయబడ జొచ్చినవి.

ఎంత జాగ్రతగా ఉన్నా రక్షక భటులు ఈ పనులు చేస్తున్నవారిని గుర్తించ లేకపోయినారు. ప్రభుత్వాధి

కార్లు ఈ నేరస్తులకు సహాయపడుతున్నారని హింగ్‌చల్ పురగుప్తునికి విన్నవించాడు.

"ఇప్పు డేమిచెయ్యాలి?" ప్రశ్నించాడు పురగుప్తుడు.

"మా దేశములో తీసుకునే చర్యలు తీసుకోనండి" సూచించాడు హింగ్‌చల్.

"ఏమిటా చర్యలు?"

"నేరం జరిగిన ప్రాంతంలో ఉండే పదిమందినీ పట్టి ఉరితీయించండి."

"అది అన్యాయము కాదా!"

"రాజ్య భద్రతకు ఉపయోగించే ప్రతిదీ న్యాయమే."

"అయితే ఆప్రకారమే కానీయండి"

ఆ చుట్టుపట్లుండే పదిమందిని పట్టి రాజు పేరు చెప్పి ఉరితీయించారు. అదే రాత్రి హూణ సైన్యముల నివాస మొకటి భస్మీపటలము చేయబడినది...

హింగ్‌చల్, బకునాశులు పురగుప్తునివద్దకు వెళ్లారు. "ఓ మహారాజా! ఈ నేరాలు ఎవరో సామాన్యులు చేస్తున్నవి కాదు. మాళ్ఖారీలు తమ అనుయాయులచే పెద్ద ఎత్తున చేయిస్తున్న హింసాచర్య లివి." అని మొరపెట్టుకున్నారు.

"అలాగా? అయితే వారిని వెంటనే పట్టి తెప్పించండి. వెంటనే శిక్షిద్దాం."

"అది తమ బాధ్యత మహారాజా!" అన్నారు వంచనా శిల్పములో ఆరితేరిన ఆ హూణులు.

"అయితే మీ బాధ్యత మీరు నెరవేర్చుకోండి. నా బాధ్యత నేను నెరవేర్చుకుంటాను" అన్నాడు పురగుప్తుడు కొంచెము చిరాకుపడి.

"మీ చిరాకు మాకు నచ్చలేదు. ప్రజాశత్రువుల చర్యల వెనుక మీరుకూడా ఉన్నారనే మా అభిప్రాయము నిధి బలపరుస్తున్నది. మీరన్నట్లు మేము చేయదగినది చేస్తాము"

అగౌరవింపబడి, అసమర్థుని క్రోధంతో అసహాయుడై ఉన్న రాజును వదలివేసి వారు చెరచెర వెళ్లిపోయినారు.

ఆ రోజు చీకటిపడిన తర్వాత మిత్రమండలివారు హడావిడిగా హెచ్చరికలు చేసుకుంటూ తిరుగ నారంభించారు. "మారు వేషాలలో తిరుగుతూ, హింసాచర్యలు జరిపేందుకు మాళవులు చాలామంది బంట్లను నగరముమీదికి పంపారు. వారిని నిరోధించే శక్తి మన మహారాజుకు లేదు. అయినా మనం భయపడవలసిన పనిలేదు. శ్వేతహూణ సైన్య మిత్రులు మన రక్షణభారం స్వీకరించారు" అంటూ ఆర్తనాదాలు చేయడం, అభయహస్తాలివ్వడం అన్నీ తామే చేయ నారంభించారు.

ఆ రాత్రంతా భీతావహ పరిస్థితుల మధ్య గడిచింది. దోపిడీలు, దహనాలు, ఊచకోతలు, ఆస్తిపాస్తుల విధ్వంస

నము విచ్చల విడిగా జరిగిపోయింది. నగరము భూలోక నరక ముగా మారిపోయింది. హూణసైన్యాలు, మిత్రమండలివారు అందినవారినల్లా హత్యచేయ నారంభించారు. అరాచకం పైశాచికనృత్యం చేసిన కాళరాత్రి యది. అనేకమంది పౌరులు హతులైపోయినారు. మరికొందరు పారిపోయినారు.

సూర్యోదయ మైంది. విధ్వంసమైన మహానగరం వల్లకాటిని గుర్తుచేస్తున్నది. కొందరు పౌరులుమాత్రం తెగించి రాజభవనానికి పరుగెత్తారు రాజుకు తమ మొర వినిపించు కుందామని. అక్కడి దృశ్యం చూచి వారు చకితులైపోయి నారు. రాజప్రాంగణ మంతా పీనుగుల పెంటగా ఉంది. భవ నములన్నీ దగ్ధము లైపోయిఉన్నాయి. ఒకమూల మహారాజు శవం పడిఉన్నది. గుండెల్లోనుండి తళతళలాడే కత్తి ఒకటి వెలికి వచ్చి ఉన్నది. శవాన్ని కాపలాకాస్తున్న శ్వేత హూణు డొకడు హృదయవిదారకమైన ఈ విధ్వంసకాండ నంతటిని మాఖారీయులు జరిపారని చెప్పాడు. పురజనులకు నోట మాట రాలేదు. ఔననలేదు, కాదన లేదు. సందేహం వెలిబుచ్చే ధైర్యం కూడా వారికి లేకపోయింది.

మాఖారీయులు సామ్రాట్టును హత్యచేశారని మిత్ర మండలివారు బహిరంగ ప్రకటన చేశారు.

హింగ్‌చల్ అధికార ప్రకటన చేశాడు: "సింహాసనానికి వారసుని నియమించవలసి ఉన్నది. అతనికి పట్టాభిషేక మహోత్సవము జరుపవలసి ఉన్నది. ఇదంతా జరగడానికి

కొంత వ్యవధిపడుతుంది. ఈలోపున సింహాసనము అలా వదలివేయడం తగనిపని. అందువలన బాక్ట్రియా మహా రాజైన తోరమానుని ప్రతినిధిగా నేను రాజ్యాధికారం నిర్వ హించవలసి వచ్చింది. బాక్ట్రియా ఉజ్జయినికి ఆప్త మిత్ర దేశము, శ్రేయోభిలాష యనే విషయములు మీా రెరుగనివి కావు".

మిత్రమండలివారు మహోత్సాహముతో నినాదాలు చేశారు: "బాల్హిక్-ఉజ్జయినీ మైత్రి వర్ధిల్లాలి! వర్ధిల్లాలి నిరంతరం, వర్ధిల్లాలి నిరంతరం" అంటూ ఆ వెంటనే మేళ తాళాలు ప్రారంభమైనాయి. నృత్య గాన వినోదాలు జరిగాయి.

ఉజ్జయినిలో అది మహోత్సవ దినం. పగలంతా మహోత్సవమే. రాత్రంతా మహోత్సవమే. ప్రతిక్షణము ఆనందోత్సవంతో గడచింది నాట్యాలు, నాటకాలు, ఊరే గింపులు, హాస్య ప్రదర్శనాలు- ఒకటేమిటి ప్రతి వినోదమూ జరిగింది. ప్రొద్దుగ్రుంకగానే దీపోత్సవాలు, టపాకాయలు, ఆకాశములోని జువ్వలు- వీటిమధ్య ప్రపంచమే మరుగు పుచ్చబడింది. వినోద విహారమునుండి రోమని ఇల్లు చేరేసరికి అర్ధరాత్రి దాటింది. వెంటనే విశ్రాంతిమందిరములోకి వెళ్లి కాస్త కునుకు తీద్దామనుకున్నది. మణికుటీరము అంతా నిశ్శ బ్దముగా ఉంది. ఆమె ఒంటరిగానేఉంది. పరిచారికలెవరూ ఉత్సవాలనుండి తిరిగి రాలేదు.

ఈ సమయంలో ఆమెగదిలోని ఒకవ్యక్తి చొచ్చుకు వచ్చాడు. "ఎవరునువ్వు?" అని గావుకేక పెట్టింది రోమని.

యువకునివలె ఉన్నాడు. కాషాయరంగు దుస్తులు ధరించి ఉన్నాడు. చేత ఎఱ్రగలువ ఒకటున్నది.

ఆయువకుడు మారు మాట్లాడకుండా ఆ ఎఱ్రగలువను రోమని ముందుకు విసిరాడు.

"అయితే నీవు అరుణపుష్ప సంఘ సభ్యునివా?" ప్రశ్నించింది.

"సభ్యుణ్ణికాదు; నాయకుణ్ణి" అని సమాధానము.

ఆ స్వరం రోమనిని హడలగొట్టింది. అయినా తెప్పరిల్లుకొని "నీవు పురుషుడవు. ఈ అర్ధరాత్రివేళ ఒంటరిగా ఉన్న స్త్రీ గదిలోకి ఎందుకు వచ్చినట్లు?

"ఎందుకా? అయితే విను: 'కురులన్నీ అంటకత్తెర వేయబడిన యువతిని వీలున్నంత దగ్గరగా చూద్దా'మని వచ్చాను. అర్థమవుతోందా?"

"ఎందుకు నీలో అంత అన్యాయపుకోరిక జ్వలిస్తోంది?"

"ప్రతీకారపు జ్వాల అది. అన్యాయానికి ప్రతీకారం జరపాలనే కోరిక అది."

"నీ వనేది నా కేమిటో అర్థము కావటంలేదు."

"నీవొక యువతి కురులు కత్తిరించావు; గుర్తులేదూ?"

రోమనిమనసులో అలనాటిసంఘటన ఒకటి మెదిలింది.

"ఆమె నీ కేమవుతుంది?" ప్రశ్నించింది.

"నాప్రియురాలనుకో"

"నీవొక సన్యాసివి. పైగా ఆమె నీకన్న చాలా పెద్దది!" సందేహం వెలిబుచ్చింది రోమని.

"పోనీ ఆమే నేననుకో"

రోమని పకపక నవ్వింది.

"ఈ అనుకోవడా లెందుకు? నీవు నిలువెత్తు పురుషు డవై ఉండగా!"

"అయితే నన్ను దర్శించుకో" అంటూ పై దుస్తులు తీశా డా యువకుడు. యవ్వనపు పొంగులో ఉన్న ఆరూపం, ఆ వక్షము రోమనిని చకితం చేసింది.

"తీరిందా నీ అనుమానం రోమనీ? నీముందున్నది మధువల్లరి. తెలిసిందా?"

రోమని చాలా భయపడిపోయింది. సమాధానం ఇవ్వ లేకపోయింది.

"నీకుట్ర, మీవాళ్ల వ్యూహాము అన్నీ ఫలించాయి. ఉజ్జయిని రక్షణలేక, హింసా దౌర్జన్యాలతోను, దేశ ద్రోహులతోను, వంచనలతోను ఛిన్నాభిన్నమై, మీ పాదాల కడ పడిఉంది. నేను దానిని రక్షించలేక పోయినాను. అందువల్ల దానిని శాశ్వతంగా విడచి పోతున్నాను. కాని నే వెళ్లిపోబోయేముందు..." అంటూ బొడ్లోనుండి పదునైన కత్తెర ఒకటి తీసింది. "వెళ్లిపోబోయే ముందు కేశ సంపదతో మురిసిపోతున్న అప్సరస సౌందర్యంతో నా కండ్లకు పండుగ చేసి పోదామనుకుంటున్నాను" బడబడా అనేసింది.

రోమని హడలిపోయికూడా వెక్కిరింతగా పగలబడి నవ్వింది.

భయంతో వణకిపోతున్న ఆమె కురులను మధువల్లరి సునాయాసంగా చేజిక్కించుకుని, ఏకబిగిన అంటకత్తెర వేసి ఊరుకుంది. రోమనికి నిరోధించే శక్తికూడా లేకపోయింది. పూర్తి కాగానే మధువల్లరి రోమని సొగసుచేసుకునే గదిలోకి వెళ్లి ఒక పెద్ద అద్దంతో తిరిగి వచ్చింది. "ఇక చూచుకో నీఅందం" అంటూ కసిగా రోమని ముందుంచింది. కత్తిరించిన కురులను కసితో రోమనిముఖాన కొట్టింది. రోజుకుంటూ చరచరా ఆ చీకటిలో కలిసిపోయింది.

రోమనికి స్పృహ వచ్చేసరికి కనిపించిన దృశ్యం ఆ అద్దంలో తన వికృతమైన ముఖం. ఆవల నగరంలో మహోత్సవాలు జరుగుతుంటే ఇక్కడీమె కీ పరాభవం! భోరున విలపించింది రోమని.

## ౩౧

అదేరాత్రి సిప్రానదిఒడ్డున గంభీరంగా నిలచిఉన్న ప్రాచీన దేవాలయపు క్రీనీడలలో నాల్గు మానవాకారాలు నిలచి ఉన్నాయి.

"ఇక మనం ఆలస్యం చేయకూడదు. ప్రమాదం ముంచుకు వస్తోంది. శత్రువులు ఏ క్షణానైనా మనమీద విరుచుకు పడవచ్చు" అన్న దొంక గొంతుక.

"నీవన్నది నిజం. ఇక మనం ఉండి ఏమిలాభం? ఉజ్జయిని విధ్వంసమైపోయింది. గుప్తసామ్రాజ్యము పతనమై పోయింది. ఇక ఎందుకు మన మిక్కడ తారట్లాడడం?"

"మన ప్రాణాలుకూడ ప్రమాదంలో ఉన్నాయి"

"అయితే యాత్రికులమై వెళ్లిపోదాం" అనుకున్నారా నలుగురు. అమరమైన భక్తి పారవశ్యంతో మహాకాళుని ముందు– శాశ్వతుడును, అనంతుడును నైన ఆ సర్వశక్తిమంతుడగు మహాప్రభువుముందు సాగిలపడి మ్రొక్కారు. మెల్లగా లేచి, ఆ అగాధమువెంట చల్లగా నడిచి యాత్రికులవలె బయల్దేరారు. మోకాలిలోతుకన్న మించని ఆనదీప్రవాహాన్ని దాటుకుంటూ వెళ్లిపోయినారు.

ఒడ్డుకు చేరగానే కాలిబాట ఒకటి తగిలింది. "మార్గం అంతా క్రొత్తది. నాకేమీ కనిపించడం లేదు" అన్నాడు నిఖిలుడు

"అయితే చేయి నా భుజాన వేయి" అన్నది శీతివతి సహాయ మందిస్తూ.

నాల్గు అడుగులు వేసి "నాకు కూడా ఏమీ కనుపించడం లేదు" అన్నది.

"అయితే నీవు నాచేయి పట్టుకో" అన్నాడు కాళిదాసు చేతి నందిస్తూ.

ఇంకా కొంచెము దూరము పోగానే "నాకుకూడా అడుగు సాగడం లేదు" అన్నాడు కాళిదాసు.

"అయితే ఉండండి. చేయిపట్టుకు నడిపిస్తాను" అంటూ వసంతకుడు ముందుకొచ్చాడు.

సాహిత్యకారుని కళా కోవిద, కళా కోవిదను కవి వర్యుడు, వీరందరిని విదూషకుడు నడిపించుకుంటూ ఆ అంధ కార బంధురమైన మార్గాన అంతకన్న అంధకారములో ఉన్న గమ్యానికి బయల్దేరారు.

ఒక్క సారి ఆగి, వెనుతిరిగి చూచారు. అవతల కని పిస్తున్న దృశ్యాన్ని చూచి, "సకాలంలో బయట పడ్డా" మనుకున్నారు. దూరాన నాల్గు నివాసాలు భగభగ లాడి పోతున్నాయి. దురాగ్రహులైన హూణులు ఉజ్జయినిలో జరు పుతూవచ్చిన దహనకాండలో ఆఖరి అంకమది. ఆ మంటల వెలుగులు అజేయంగా ఉన్నట్లు తళతళ లాడిపోతున్న ఆలయ శిఖరమునందున్న మహాకాళేశ్వరుని త్రిశూలమును దర్శించారు.

నిర్వాసులు నల్గురూ దక్షిణాభిముఖులై ఆ అంధకార ములో ప్రయాణము సాగించారు. వింధ్యాచలమునకు మధ్య భాగమందున్న ధారానగరము వారి గమ్యస్థానము.

